జాతీయ జీవిత గ్రంథమాల

# రాణీ లక్ష్మీబాయి

మూలం :

బృందావన్‌లాల్ వర్మ

అనువాదం :

శ్రీమతి సరస్వతీ శర్మ



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# 1

మహారాష్ట్రదేశంలో సతారా దగ్గర వాయీ అనే గ్రామం ఉంది. 1818 వరకు పదవిలో ఉన్న పీష్వాకాలంలో ఆ గ్రామవాసి అయిన కృష్ణారావు తాంబే ఉన్నతపదవిలో ఉన్నాడు. కృష్ణారావు తాంబే కొడుకు బలవంత రావ్ తాంబే పరాక్రమవంతుడు. పీష్వా సేనలో గొప్ప పదవిలో ఉన్నాడు. బలవంతరావుకు ఇద్దరు కొడుకులు - మోరోపంత్, సదాశివ్. వీళ్ళిద్దరూ పూనాలో పీష్వా దర్బారులో ఉండి ఆయన కృపకు పాత్రులైనారు.

రెండవ బాజీరావు పీష్వాలలో చివరివాడు. 1818 లో ఆంగ్లేయులు ఆయన పీష్వాపదవిని రద్దుచేసి సంవత్సరానికి ఎనిమిది లక్షల రూపాయల పెన్షను, బిఠూర్ అనే గ్రామం జాగీరుగాను ఇచ్చారు. బాజీరావు బిఠూర్ వచ్చి అక్కడే స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నాడు. బాజీరావు తమ్ముడు చిమాజీ అప్పా కాశీ వెళ్ళిపోయాడు - పూనాలో తమదంటూ ఏమీలేదు కనుక. చిమాజీకి మోరోపంత్ తాంబేమీద అమితమైన దయ. అందువల్ల మోరోపంత్ కూడా చిమాజీతో కాశీవెళ్ళి అక్కడ ఆయన వ్యవహారాలు చూస్తూ వుండేవాడు. అందుకుగాను అతనికి 50 రూపాయల జీతం లభించేది.

మోరోపంత్ తాంబే భార్యపేరు భాగీరథీ బాయి. ఆమె చాలా గుణవంతురాలు, తెలివికలది, అందమైనదీ. వారిద్దరికీ ఒక కుమార్తె కలిగింది. బాల్యంలో ఆమెకు మనూబాయి అని నామకరణం చేశారు. 1835 నవంబరు 19 కి సరియైన విక్రమ సంవత్సరం 1891, ఆశ్వయుజ బహుళ చతుర్దశినాడు

ఆమె పుట్టింది. తరువాత ఈమె లక్ష్మీబాయిగా భారతదేశంలో ప్రసిద్ధి కెక్కింది.

మనూకు నాలుగేళ్ల వయసులోనే భాగీరథీబాయి కాశీలో చనిపోయింది. కొన్నాళ్లకు చిమాజీ అప్పకూడా చనిపోయాడు. దానితో మోరోపంత్‌కు తన కుటుంబపోషణకు ఇంకేవిధమైన మార్గమూ లేకపోయింది. అప్పుడు బాజీరావు అతనిని కాశీనుంచి బిఠూర్‌కు పిలిపించాడు. పీష్వాకు అతనంటే చాలా ఇష్టం.

మనూ ఆలనా, పాలనా అంతా మోరోపంతే చూసేవాడు. ఆయన మనూని పుత్రునికన్న అధికంగా పెంచాడు.

మనూ చాలా అందంగా ఉండేది. అందుకని బాజీరావు ఆమెను చిన్న తనంనుంచీ "ఛబిలీ" (సుందరీ) అని పిలిచేవాడు.

బాజీరావుకు సంతానం లేదు. అందుకని ఆయన నానాధోండూపంత్ అనే అతన్ని పెంచుకున్నాడు. నానా అన్నదమ్ములు ముగ్గురు - నానా, బాలారావు, రావుసాహెబ్, నానారావు బిఠూర్‌లో చాలా తక్కువగా ఉండే వాడు. ఈ మగపిల్లలిద్దరూ మనూ కంటె వయసులో పెద్దవారయినా వారు ముగ్గురూ కలిపి కసరత్తు చేయడం, కత్తి తిప్పడం, తుపాకీ పేల్చటం, గుఱ్ఱపుస్వారీ చెయ్యడం వంటివి బాగా నేర్చుకున్నారు.

మనూ చిలిపితనమూ, పట్టుదలకల పిల్ల. అయినా సునిశితమైన బుద్ధి కలది. వయస్సుకు మిగిలిన వారిద్దరికన్న చిన్నదయినా, కుస్తీ పట్టడం, కత్తి తిప్పడం మొదలయినవాటిలో వారికన్న ప్రజ్ఞ కలది. ఆడపిల్లలతో అంతగా స్నేహం లేకపోవడంవలన స్త్రీసహజమైన సిగు, బిడియం, సంకోచం ఆమెకు దూరంగా ఉండేది.

నానా తనకు సంవత్సరానికి వచ్చే 8 లక్షల రూపాయలు సుఖంగా జీవనం చేయడానికి సరిపోతాయనుకునేవాడు. బాజీరావుకు ఈ ఉపకారవేతనం

'ఆయనకు, ఆయన కుటుంబానికి' ఇవ్వబడింది. ఏ ప్రయత్నమూ లేకుండానే సంవత్సరానికి ఎనిమిది లక్షల రూపాయలు వస్తుంటే ఇంకా దురాశకుపోయి కష్టాలను ఎందుకు ఎదురు తెచ్చుకోవడం అని నానా ఉద్దేశ్యం.

అంత చిన్నవయసులో కూడా మనూ ఇలా ఆలోచించేది కాదు. ఛత్రపతి శివాజీ మొదలయిన ఆధునిక వీరులనుగురించి, అర్జునుడు, భీముడు మొదలయిన పురాణ వీరులనుగురించి ఎప్పుడూ ఊహించుకుంటూ ఉండేది. ఆ ఊహ ఆమెకు ఒక విశిష్టమైన ప్రేరణను కలుగచేస్తూ ఉండేది.

# 2

వర్షాకాలం గడిచిపోయింది. కార్తికంకూడా అయిపోతూ ఉంది. సూర్యుడు అస్తమించడానికి కాస్త వ్యవధి ఉంది. బిఠూర్ గ్రామానికి వెలుపల గంగాతీరాన ముగ్గురు అశ్వారోహకులు వేగంగా వస్తున్నారు. అందులో ఒకామె మిగిలిన ఇద్దరికంటె చిన్నది. ఆమె వయస్సు 12 సంవత్సరాలు. మగపిల్ల లిద్దరూ ఆమెకంటె కొంచెం పెద్దవాళ్లు.

పెద్దవాడు ముందు వెళ్లాడు. బాలిక తన గుఱ్ఱపువేగాన్ని హెచ్చిస్తూ, 'చూస్తాను, ఎలా ముందుకు వెడతావో!' అంటూ తాను ముందుకు వెళ్ళిపోయింది. రెండవ అతను వేగం హెచ్చించాలని ప్రయత్నం చేశాడు. కాని అతని గుఱ్ఱానికి ఎదురుదెబ్బ తగిలి అతనిని ఒక్కసారిగా కింద పడవేసింది. ఎండిన చిన్న కొమ్మ ఒకటి అతని నుదిటికి కొట్టుకుంది. రక్తం వస్తోంది. గుఱ్ఱం అతనిదగ్గర ఆగకుండా పరుగెత్తింది.

ఆ కుఱ్ఱవాడు 'మనూ, ఓ మనూ! చచ్చిపోయాను' అంటూ అరిచాడు. ఆ బాలిక మనూ అన్నమాట. మనూ వెంటనే తన గుఱ్ఱాన్ని ఆపింది. వెనక్కు తిరిగి వచ్చింది. గుఱ్ఱం దూకి అతనివంక ఆదేపనిగా చూడ సాగింది.

'గాభరా పడకు, భయమేమీ లేదు. గాయమంత పెద్దదికాదు' అని మనూ నెమ్మదిగా, మృదువుగా అంది. ఇంతలో మూడో అశ్వారోహకుడు వారిని చేరుకున్నాడు. ఈ దృశ్యంచూసి దెబ్బతిన్న అతనివంక తడబడుతూ చూశాడు.

'నానా! దెబ్బ తగిలిందా?' అని అడిగాడు.

దెబ్బతిన్న వ్యక్తి నానా ధోండూ. రెండవవాడు తాంత్యా తోపే.

'పెద్ద దెబ్బకాదు. ఇప్పుడే-కోటలోకి వెళ్లగానే-పట్టీ వేస్తాను. చాలా తొందరగా తగ్గిపోతుంది' అన్నది మనూ.

'నన్ను ఎలా తీసుకొని వెడతావు మనూ?'

'లే. లేచి నా గుఱ్ఱంమీద కూర్చో. నేను కళ్లెం పుచ్చుకుంటాను. నిన్ను నేను వెంట ఉండి తీసుకుపోతాను.'

'నా గుఱ్ఱం ఎక్కడ ఉంది?'

'పారిపోయిందిలే! లే! నా గుఱ్ఱంమీద కూర్చో' అంది మనూ. నానా లేచాడు. మనూ ఒకచేతిలో గుఱ్ఱపు కళ్లెం పుచ్చుకొని ఇంకోచేత్తో నానాని గుఱ్ఱంమీద కూర్చోబెట్టింది. తానుకూడా అతనికి వెనుకగా ఎక్కి-కూర్చొని త్వరగా గుఱ్ఱాన్ని నడిపించి. తాంత్యా తోపే వారికి వెనుక విచారంగా బయలుదేరాడు.

కోటగుమ్మం దగ్గరకు రాగానే ఒక వృద్ధుడు, ఒక మధ్యవయస్కుడు అక్కడకు వచ్చారు. గుఱ్ఱం అంతవేగంగా రావడంతో ఏదో ఆపద సంభవించి ఉండవచ్చునని వారిద్దరూ భయపడ్డారు. వృద్ధుడు పట్టువస్త్రాలు ధరించి, మెడలో ముత్యాలహారం వేసుకుని ఉన్నాడు. ఆయనకు కళ్లు సరిగా కనిపించడంలేదు. ఈయన రెండవ బాజీరావు పీష్వా. రెండవవ్యక్తి మోరోపంత్ తాంబే-మనూ తండ్రి.

'మోరోపంత్! వాళ్ళంతా వచ్చారా?'

'వచ్చారు ప్రభూ!' అన్నాడు మోరోపంత్.

ఇంతలో అశ్వారోహకులు దగ్గరకు రాగానే, వారిని చూచి 'అయ్యో! ఇదేమిటి? మనూ, నానా ఇద్దరూ రక్తంతో తడిసిపోయారు!' అన్నాడు.

బాజీరావు గాభరా పడ్డాడు. సిపాయిలు నానాని కిందికి దింపారు. మనూ దూకింది. మోరోపంత్ ఆమెను కావలించుకున్నాడు. 'మనూ! దెబ్బ ఎక్కడ తగిలిందమ్మా!' అని అడిగాడు అధైర్యపడుతూ.

'నా కసలు తగల్లేదు నాన్నా! నానాకి తగిలింది. అయినా పెద్ద దెబ్బ కాదులే!'

నానాని మెత్తని పరుపులమీద పడుకోబెట్టి గాయాన్ని కడిగి పట్టీ వేశారు. గాయం కొంచెం పెద్దదే కాని, అంత భయపడవలసింది కాదు. బాజీరావు దిగులుపడి ఉన్నాడు.

మనూ, మోరోపంత్ ఆ కోటలో ఒక భాగంలో ఉంటున్నారు.

వారిద్దరూ ఒంటరిగా ఉన్నప్పుడు, 'ఇంత చిన్నగాయానికి అంత హడావుడా?' అన్నది మనూ తండ్రితో.

'గాయం చిన్నదేమీ కాదమ్మా! ఎంత రక్తంపోయిందో చూశావుగా!' అన్నాడు మోరోపంత్.

'మీరంతా పూర్వకాలం మాటలు చెబుతారు నాన్నా! మరి పట్టుతాళ్ళతో, దారాలతో ఎవరయినా యుద్ధం చేస్తారా?'

'చెయ్యరనుకో-తల్లీ! అయినా నువ్వు పూర్వకాలం అంటున్నావే! ఆ రోజులన్నీ మారిపోయాయమ్మా!'

'ఏమయింది కాకా?'

'ఇప్పుడు మన దేశసౌభాగ్యమంతా తారుమారయిందమ్మా! ఆంగ్లేయుల భాగ్యానికి ఉషఃకాలం యిది.'

'ఇది మామూలే.'

'నువ్వు పెద్దదానవయ్యాక కాని నీకు సంగతులు తెలిసిరావమ్మా!'

'నేను ఎప్పుడూ పిరికిపందను కాను.'

'సరే! నువ్వు యివ్వాళ నిద్రపోతావా? లేక రాత్రంతా వాగుతూ కూర్చుంటావా?'

ఈ మాటలకి మనూ కిలకిలా నవ్వింది.

# 3

ప్రొద్దున్నే మనూ నానాని చూడడానికి వెళ్ళింది. 'రాత్రంతా నిద్రపట్టిందా?' అని అడిగింది, అతని తల నిమురుతూ.

'నిద్ర పట్టీ పట్టకుండా ఉంది. రాత్రంతా ఈ గాయం నొప్పిగానే వుంది' అన్నాడు నానా.

'మధ్యాహ్నానికి తగ్గుతుందిలే. సాయంకాలానికల్లా లేచి తిరుగుతావు. మనం అలా తిరిగిరావచ్చు.'

'మళ్ళీ గుఱ్ఱపుస్వారీ చేస్తే నొప్పి ఎక్కువవుతుందేమోనని భయంగా ఉంది.'

'అదే సర్దుకుంటుందిలే.'

నానా ఒక్కక్షణం ఊరుకొని, మళ్లీ 'ఒకవేళ నొప్పి ఎక్కువయితేనో?' అన్నాడు.

'అయినా ఓర్చుకోవాలి. ఈసారి పడ్డప్పుడు ఇంత నెప్పి వుండదు.'

నావల్ల కాదు బాబూ.

పోనీ లడ్డూ తింటావా?

తినాలని లేదు.

అయితే ఏం చెయ్యాలని వుంది?

నన్ను మెదలకుండా పడుకోని వుండనీ.

ఎప్పటిదాకా?'

అబ్బ! నన్ను విసిగించకు మనూ.

మనూ నవ్వింది. పెదవులు బిగించి, 'నువ్వేమో ఛత్రపతి శివాజీవి మరిపించే పనులు చేస్తానంటావు! బాజీప్రభువు దేశపాండేకి వచ్చినంత కీర్తిని సంపాదిస్తానంటావు! తానాజీ మాల్‌సురేమీద దెబ్బ తీస్తానంటావు! మొదటి బాజీరావు ప్రభువుకు సరిసమానంగా నిలబడతానంటావు!....' అని అంటూవుండగానే బాజీరావు అక్కడకు వచ్చాడు. మనూ బిగ్గరగా మాట్లాడుతున్న మాటలు ఆయన విన్నాడు.

'మనూ! నీ చిలిపితనం ఎప్పుడు తగ్గుతుందో తెలియకుండా వుంది. ఏమిటి నీ వాగుడు?' అన్నాడు బాజీరావు.

మనూ ఊరుకోలేదు.

'తాతా! మీరు చెప్పిందే మళ్ళీ నేను నానాకి చెబుతున్నాను' అన్నది.

'మహాభారత కథలు చదివి వినిపించు. మంచిమంచి మాటలు చెప్పు. నానాని విసిగించకు.'

మనూ నుదురు చిట్లించి, బాజీరావు దగ్గరగావచ్చి, 'అయితే మాకు తినడం, నిద్రపోవడం మాత్రమే నేర్పుతారా ఏమిటి?' అంది.

బాజీరావుకు నవ్వు వచ్చింది. ఏదో చెప్పాలనుకుంటూవుండగానే మోరోపంత్ వచ్చి, 'నానా సాహెబును కొంచెంసేపు ఏనుగుమీద తిరిగిరానివ్వండి. ఏనుగు తయారుగా వుంది' అన్నాడు.

బాజీరావు, 'దెబ్బ అదురుతుందేమో!' అన్నాడు.

'లేదు ప్రభూ! అంబారీలో మెత్తని బాలీసులు వేయించాను. ఏనుగు నెమ్మదిగా నడుస్తుంది.

మనూ బయటకుపరుగెత్తింది. నానాను ఏనుగుమీద కూర్చోబెట్టారు. మనూకు కూడా కూర్చోవాలని వుంది. కాని నానా ఏనుగును తొందరగా పొమ్మని చెప్పాడు. మనూ వస్తే విశ్రాంతికూడా తీసుకోనివ్వకుండా ఏదో వాగుతూ కూర్చుంటుందని అతని భయం.

మనూ 'ఏనుగును తిప్పి తీసుకురండి. నేనుకూడా దానిమీద ఎక్కాలి' అని మోరోపంత్‌తో చెప్పింది. మోరోపంత్ బాధపడ్డాడు. ఆ బాధను అణుచుకుంటూ 'అది వెళ్ళిపోయిందమ్మా!' అన్నాడు.

'పిలవండి, పిలవండి. ఎక్కువదూరం వెళ్లలేదు కదా! ఎవరినైనా పిలుచుకొని రమ్మనండి. ఏమయినా సరే నేను ఏనుగుమీద కూర్చోవాలి.'

మోరోపంత్ తన మనసులోని మాటలను బయటకే వ్యక్తం చేశాడు; 'మనం సామంతులమూ కాదు, సర్దారులమూ కాదు. చదువుకున్నావు కాని ఏం లాభం? ఏమీ తెలియదు! మనకు ఏనుగునెక్కే భాగ్యం లేదు.'

మనూ పెదవులు కొరుకుతూ, సవాల్ చేస్తున్నట్లుగా 'నాకు ఒకటి కాదు' పది ఏనుగులుపొందే అదృష్టం ఉంది' అన్నది. మోరోపంత్ నవ్వాడు. మనూను దగ్గరకు తీసుకుంటూ 'పద, ఏదయినా పురాణం చదువుదువు కాని,' అన్నాడు.

మనూ మారాం చేస్తూ 'నేను గుఱ్ఱం ఎక్కి వెళ్ళి నానా ఏనుగును ఏడిపిస్తాను' అన్నది.

'వద్దమ్మా, వద్దు. ఏనుగుకు కోపంవచ్చి నానాని గాయపరుస్తుంది.'

మనూ ఒప్పుకుంది. 'అయితే నేను తుపాకితో గురిచూడడం సాధన చేస్తాను.'

మోరోపంత్ ఒప్పుకున్నాడు.

కోట చాలా పెద్దది. నాలుగువైపులా ఎత్తైన బురుజులు. మనూ బురుజు మీద నిలబడి గురిచూపి కొట్టడం మొదలుపెట్టింది. కొంచెంసేపయ్యాక, ఏనుగు వస్తున్నట్లుగా గంటల చప్పుడయింది. ఆ చప్పుడు విని మనూ తుపాకిని అక్కడే వదలిపెట్టి క్రిందికి పరుగెత్తుకు వచ్చింది. నానా ఏనుగు మీదినుంచి క్రిందికి దిగాడు. మనూని ఉడికిస్తూ 'సుందరీ! ఏమైనా గ్రంథ పఠనం సాగిస్తున్నావా?' అని అడిగాడు.

మనూ మండిపడి 'నన్ను 'సుందరి' అని పిలవక్కర్లేదు' అంది.

'ఏనుగుమీద కూర్చుంటే దెబ్బలనొప్పి ఎగిరిపోయింది. అందుకని నీ చిన్నప్పటి పేరు జ్ఞాపకానికి వచ్చింది.'

'ఓ! అందుకా!.........అలా ఎప్పుడూ పిలవకు. నా కా పేరంటే అసహ్యం.'

నానా మనూని రెచ్చగొట్టడానికి తిరిగి ఆదేమాట అనబోతూ ఉండగా మనూ ఆతని మాటని మధ్యలోనే తుంచివేసింది. ఇంతలో మోరోపంత్ వచ్చి ఝాన్సీనుంచి తాంత్యా దీక్షితశాస్త్రి వచ్చినట్లు తెలియచేశాడు.

# 4

భోజనాల తర్వాత దీక్షితులుగారిని కలుసుకున్నారు బాజీరావు, మోరోపంత్. దీక్షితులుగారు జ్యోతిశ్శాస్త్రంలో దిట్ట అని ప్రఖ్యాతి. కొంచెంసేపు మాట్లాడిన తరువాత మోరోపంత్ సమయంచూసి 'నాకు మా అమ్మాయి మనూ బాయి వివాహాన్నిగురించి చాలా బెంగగా ఉంది. ఎంత వెదికినా యోగ్యుడయినవరుడు ఎక్కడా దొరకడం లేదు. మీకు పెద్దపెద్దవారితో పరిచయ ముంటుంది. తమరు దయచేసి మా అమ్మాయికో సంబంధం చెప్పండి.' అన్నాడు.

బాజీరావు అతన్ని సమర్థిస్తూ 'పిల్ల చాలా తెలివికలది, అందమైనదే.' అన్నాడు.

మోరోపంత్:-'మరాఠీ, హిందీ, సంస్కృతము చెప్పించాము. మత మంటే ఆమెకి ఆసక్తి ఎక్కువ. నాలుగేళ్ల వయసులోనే తల్లి పోయింది. పీష్వా, నేను కలిపి ఆమెను పెంచాము. ఆయుధాలు వాడడం బాగా తెలుసు. గుఱ్ఱపు స్వారిలో పురుషున్నికూడా ఓడిస్తుంది.

బాజీరావు:-పూజా పునస్కారాలు నిష్ఠగా చేస్తుంది.

దీక్షితులుగారు మనూ జాతకాన్ని తెప్పించి చూశారు. దానిని బాగా పరిశీలించి చూచి, 'ఇటువంటి జాతకాన్ని ఎప్పుడో ఒక్కసారి చూశాను. ఈమె ఏ రాజ్యానికో రాణి కావలసి వుంది,' అన్నారు.

అదే సమయంలో మనూ అక్కడకు వచ్చింది. బాజీరావు దీక్షితులు గారికి మనూను చూపిస్తూ 'ఈ అమ్మాయేనండి' అన్నాడు. మనూ సౌంద ర్యాన్ని, తేజోవంతమైన ఆమె ముఖాన్ని చూస్తూ, దీక్షితులుగారు సంతో

షంతో, 'రా అమ్మా! కూర్చో. నువ్వు శాస్త్రాలు చదివావా?' అని అడి గారు.

మనూ కూర్చొని ఏమాత్రం సంకోచం లేకుండా, 'శాస్త్రాలు ఊరికే చదివాను. కాని తులసీదాసు రామాయణమంటే నాకు ఇష్టం. కత్తి తిప్పటం అన్నా, తుపాకి పేల్చటమన్నా నాకు ప్రాణం' అన్నది. బాజీరావు నవ్వుతూ, 'ఊరికే వాగడం అంటే ఇంకా ఇష్టం' అన్నాడు.

దీక్షితులుగారు 'ఇంకా చిన్నపిల్ల. ప్రపంచం అంటే ఏమిటో తెలియదు' అన్నారు సానునయంగా.

మోరోపంత్ 'ఇంకా అమాయకురాలు! పెద్దదయితే ఇంటిపనులన్నీ తానే స్వయంగా సరిదిద్దుకుంటుంది.' అన్నాడు.

దీక్షితులుగారు 'ఆమె ఏ రాజ్యానికో రాణి అవుతుంది' అన్నారు.

అక్కడ కూర్చున్నవారిలో ఒకరు 'రాజ్యమంతా ఆంగ్లేయులే తీసు కున్నారు కదా!' అన్నారు. బాజీరావు ఆ మాటలను మార్చివేస్తూ 'ఝాన్సీలో చాలా తోటలు ఉంటాయనుకుంటాను' అన్నాడు దీక్షితుల గారితో.

దీక్షితులుగారు సమాధానమిస్తూ, 'కోటలోపల పెద్ద ఉద్యానవనం ఉంది. కోటకు బయట చాలా తోటలు ఉన్నాయి' అన్నారు.

మనూ 'అక్కడున్న సేన పెద్దదేనా?' అని అడిగింది.

దీక్షితులు:-ఆ! చాలా శ్రేష్ఠమయినది కూడా!

మనూ:-గుఱ్ఱాలు బావుంటాయా?

దీక్షితులు:-ఆ! చాలా!

మోరోపంత్, బాజీరావు ఇద్దరూ దీక్షితులుగారితో ఇంకా ఏకాంతంగా మాట్లాడాలనుకున్నారు. మిగిలిన వారందరినీ అక్కడనుంచి బయటకు పంపారు.

ఝాన్సీరాజు గంగాధరరావుగారి భార్య గతించింది. సంతానం లేదు. తిరిగి వివాహం చేసుకోవాలనుకుంటున్నాడు. అందుకనే మంచిపిల్లను వెతకడానికి దీక్షితులుగారు బయలుదేరారు.

'నేను ఝాన్సీకి తొందరగావెళ్ళి రాజా గంగాధరరావుతో మాట్లాడి వస్తాను ఒప్పుకుంటారనే ఆశగా ఉంది' అన్నారు దీక్షితులుగారు.

దీక్షితులుగారు మరునాడు ఝాన్సీ వెళ్ళిపోయాడు. మనూ సంబంధం విషయం రాజా గంగాధరరావుతో మాట్లాడి జాతకాలు సరిపోతాయేమో చూశారు. జాతకాలు కలవడంతో రాజాగారుకూడా వొప్పుకున్నారు.

దీక్షితులుగారు రాజా పరివారాన్ని వెంటబెట్టుకొని బిఠూర్ వెళ్లారు. మోరోపంత్, బాజీరావులు సంతోషంతో ఈ సంబంధానికి అంగీకరించారు.

మనూని అలంకరించారు. ఆణిముత్యాలవంటి మనూబాయి విశాల నేత్రాలు ఆమె ధరించిన మణులకుసైతం అందాన్ని చేకూరుస్తున్నాయి. బాజీరావు ఆమెకు నగలు, పట్టుచీరెలు బహూకరించాడు. ఆమె అవి ధరించి అపరదుర్గాదేవిలా వుంది. ప్రధానం చాలా ఆడంబరంగా జరిగింది.

నానా:-అయితే మనూ! నువ్వు ఝాన్సీనుంచి ఇక్కడికి ఏనుగుమీద వస్తావా?

మనూ:-ఒక్క ఏనుగుమీద నేమిటి? పదింటిమీద వస్తాను.

నానా:-ఒక్కదానిమీద నువ్వు కూర్చుంటావు. మిగిలినవానిమీద మంత్రి, సేనాపతులు కూర్చొని వస్తారు.

మనూ:-నా కయితే గుఱ్ఱంమీద రావడం చాలా ఇష్టం.

నానా:-అయితే ఢిల్లీమీద యుద్ధమే ప్రకటించు.

మనూ:-ఢిల్లీలో ఏముంది? ఢిల్లీ అనే పంజరంలో ఇప్పుడు ఒక తోలు బొమ్మ మాత్రమే వున్నదని జనం చెప్పుకుంటారు.

నానా:-అ, అవునవును, అన్నివైపులా ఈ ఇంగ్లీషువాళ్ల గోలేగా?

మనూ:-ఆ ఇంగ్లీషువాళ్లనుకూడా ఒకనాటికి ఓడించవచ్చునని నీకు నమ్మకం లేదుగా!

నానా:-సుందరికి బడాయిలు చెప్పుకోవడంతప్ప మరేమీ చేతకాదు.

మనూ తన పెద్ద కళ్లను ఇంకా పెద్దవిగా చేసి నానావంక చూస్తూ, అదిగో! నన్ను మళ్ళీ 'సుందరీ' అంటున్నావు!' అంది.

నానా నవ్వాడు. 'నువ్వే నీ నోటితోనే 'సుందరీ' అన్నావుగా! దెబ్బ తిన్నావులే!'

మనూకూడా నవ్వింది. 'ఇంకెప్పుడూ అనకేం' అన్నది. నానా మొహాన్ని గంభీరంగా మార్చి 'అయితే ఇకనుంచి 'ఝాన్సీరాణి' అని పిలుస్తాలే' అన్నాడు. మనూ నవ్వింది.

ఆ నవ్వులో ఝాన్సీయొక్క ఎంత మహత్తరమైన, శాశ్వతమైన చరిత్ర దాగి వుందో!

అప్పుడే అక్కడికి బాజీరావు, మోరోపంత్ వచ్చారు. వారుకూడా నానా, మనూల సంతోషంలో పాలుపంచుకున్నారు.

అక్కడ వివాహ విషయాలచర్చ జరుగుతోంది. బిఠూర్‌కు అనేకమంది దక్షిణాది బ్రాహ్మణులు వచ్చారు. వివాహం ఝాన్సీలో జరగాలని నిశ్చయింపబడింది. వివాహపు ఖర్చంతా రాజా గంగాధరరావు భరిస్తాడు. ఇక నుంచి మోరోపంత్‌కూడా ఝాన్సీలో ఉండాలని నిశ్చయమైంది.

ఝాన్సీనుంచి వచ్చినవారంతా వెళ్ళిపోయిన తర్వాత ఒక మంచి తిథి చూచి మోరోపంత్ మనూను ఝాన్సీ తీసుకొనివెళ్ళాడు. అతనివెంట బిఠూర్‌నుంచికూడా కొందరు వెళ్ళారు. వివాహానికి ముహూర్తం పెట్టారు. భారీ ఎత్తున ప్రయత్నాలు జరుగుతున్నాయి.

# 5

ఝాన్సీలో వినాయకుడి మందిరం చాలా పురాతనమయినది. వివాహానికి ముందు వరుడు కొన్ని ఆచారాలను పాటించవలసి వుంటుంది. స్నాతకం, వరపూజ వంటివి ఆ మందిరంలోనే జరుగుతాయి. రాజా గంగాధరరావు గుఱ్ఱంమీద కూర్చుని వినాయకుడి మందిరానికి వెళ్ళాడు. ఆయన వెళ్ళే దోవలోనే మోరోపంత్, మనూలు తమ చుట్టపక్కాలతో విడి దిగిన భవనం ఉంది. ఆ భవనం మేడమీద కిటికీలోనుంచి మనూ గంగాధరరావుని మొదటిసారి చూచింది. గంగాధరరావు వయసుకు పెద్దవాడే! కాని మొహం చాలా అందంగా ఉంది. కళ్లు ఎఱ్ఱగా ఉండడంవల్ల అంత ఆకర్షణీయంగా లేవు. పైగా భయం కలిగించేటట్లుగా ఉన్నాయి. బొజ్జ కాస్త పెరిగింది. కాని వికారంగామాత్రం లేదు. చామనిఛాయ. మొత్తంమీద కండగల పురుషుడు.

మనూ ఒక్క క్షణంసేపు అతన్ని చూసినతర్వాత ఆమెదృష్టి అతడు గుఱ్ఱంమీద ఎక్కి కూర్చున్నతీరుమీద పడ్డది. నవ్వుకొన్నది. దగ్గరలోనే కొందరు ఆడపిల్లలున్నారు. తన అభిప్రాయం వాళ్లకి తెలియచేయాలని తొందరపడ్డది. నగరవాసులు ఆదరపూర్వకంగా చేసే ప్రణామాలను అందుకుంటూ రాజు నెమ్మదిగా వెడుతున్నాడు. ఇంతలోనే మనూకు ఎదురుగా పదిహేనేళ్ల ఒక మరాఠీకన్య వచ్చి నిలబడ్డది. ఆమె చాయనచాయగా ఉంది. మొహం పొడుగ్గా ఉంది. కళ్లు పెద్దవిగా ఉన్నాయి. తిన్ననైన ముక్కు, మనూకు దగ్గరగావచ్చి, వంగి నమస్కారం చేసింది. మనూ ఎంతో పరిచయం ఉన్నట్లుగా 'నువ్వెవరు?' అని అడిగింది.

'నేను మీ దాసీవి. నాపేరు సుందర్' అన్న దామె.

'నా దాసీవా ? ఎలా ?'

'తమరు మహారాణీ. నేను మీ సేవకురాలిని.'

'నాకు దాసీలంటూ ఎవరూ వుండకూడదు. కేవలం చెలులై మాత్రమే ఉండాలి. అలా ఉంటావా ?'

'అలాగే. ఎప్పటికీ ఉంటాను మహారాణీ! మేము పదహారుగురు దాసీలం. మీ సేవకోసం ఉన్నాము.'

'దాసీలు కాదు. చెలులు, నేస్తాలు.'

మళ్ళీ మనూదృష్టి గంగాధరరావుమీద పడ్డది. మనూ నెమ్మదిగా సుందర్‌ని 'గుఱ్ఱం ఎక్కడం తెలుసా ?' అన్నది.

'కొంచెం తెలుసు, బాగా పరుగెత్తిస్తాను. కోసెడుదూరం పరుగెత్తించినా అలవను.'

'మరి ఆయుధాలు వాడడం తెలుసా సుందర్ ?'

'లేదు మహారాణీ.'

గంగాధరరావు సవారే ముందుకు వెళ్లిపోయింది. అప్పుడే మనూ దగ్గరికి మరో ఇద్దరమ్మాయిలు వచ్చారు. ఒకామె సుందర్ వయసుది. రెండవ ఆమె ఒక సంవత్సరం చిన్నది. వాళ్లు మనూకి వంగి నమస్కారం చేశారు. మనూ కుశలప్రశ్న లడిగింది. సుందర్ వారిని పరిచయం చేసింది.

'పెద్దామె ముందర్, రెండవ ఆమె కాశీ. వీరిద్దరూకూడా తమ దాసీలు.' మనూ వెంటనే 'దాసీలు కారు, చెలులు. నా దగ్గర దాసీలంటూ ఎవ్వరూ ఉండకూడదు' అంది.

వారు ముగ్గురూ ఎంతో ఆనందించారు. కాశీ కొంచెం పొట్టిగా ఉన్నా బలిష్ఠమయిన శరీరం కలది. సుందర్ సున్నితమైన అందమైన శరీరం

కలది. పొడవైనది కూడా, చామనచాయగా ఉంటుంది. ముందర్, కాశీ- ఇద్దరూ గోధుమవన్నెలో వుంటారు. ముగ్గురూ కుంభీజాతివారు.

కొందరు యువతులు మేడమీదగదిలో కొంచెం దూరంగా నిలబడి తమ భావి మహారాణిదగ్గరకు రావాలని ఉత్సాహపడుతున్నారు. మనూ పైగచేసి వారిని పిలిచి మాట్లాడసాగింది. వాళ్లు తమ నృత్యగానాలద్వారా తమ ఆనందాన్ని వ్యక్తం చేస్తామన్నారు. మనూ అంగీకరించింది. ఆ తరువాత 'మీ అందరికీ గుఱ్ఱపుస్వారీ నేర్పుతాను. కత్తి, తుపాకీ, బల్లెం, కటారి ఉపయోగించడంకూడా బాగా నేర్చుకోవాలి. అన్నీ నేను నేర్పుతాను' అన్నది.

కొంతమంది వెంటనే ఒప్పేసుకున్నారు. మరికొందరు సిగ్గుపడుతూ సరే వన్నారు. ఇప్పుడుమాత్రం వారందరూ మంచిమంచి బట్టలు, నగలు ధరించి వున్నారు. వినాయకుడి గుడి దగ్గరనుంచి మేళాలు మధురంగా వినిపిస్తున్నాయి. కొంతమంది మహిళలు మనూ మెడలో పూలమాలలు వేయడానికి ఉత్సాహపడుతున్నారు.

మనూ నవ్వుతూ అంది: 'మీరు కుస్తీపట్టడం నేర్చుకుంటారా? గోదాలో కుస్తీ పట్టడం-?' కొందరు మేలిముసుగులు సవరించుకున్నారు. మరికొంతమంది మొహం తిప్పుకొని నవ్వసాగారు.

'గోదాలో మట్టి మీ జుట్టుకు అంటుకుంటుందేమో?' అన్నది మనూ నవ్వుతూ. వాళ్లంతా నవ్వారు.

మనూ కొంచెం గంభీరంగా 'కాని మీ జడలోవున్న పూలకంటె ఆ మట్టే ఎక్కువ శోభిస్తుంది' అంది.

సుందర్:-మహారాణీ! జుట్టుకు మట్టితో శోభ ఎలా కలుగుతుంది?'

మనూ:-పూలతో సంబంధం పెట్టుకోవచ్చు. కాని మట్టితో సంబంధం మాత్రం వదులుకో కూడదు.

అందరూ వంబరపడిపోయారు. మనూ వెంటనే 'వినాయకుడి గుడికి వెళ్ళి ఏం జరుగుతుందో, ఇంకా ఏం జరుగాలో చూపి రండి' అంది. మళ్ళీ 'వీళ్లు ముగ్గురూ నాదగ్గరే వుంటారు. ఆ! మీ రిచ్చిన పూలమాలలు నేను తీసుకుంటున్నాను' అని కొంచెంసేపు ఆగి, 'వీటికి బదులుగా మీకు ఆయుధాలను ఇస్తాను' అంది.

మనూకి పూలమాలలు ఇచ్చి వాళ్లు వెళ్ళిపోయారు.

'ఝాన్సీప్రజలకు పూలంటే చాలా యిష్టమని విన్నాను. బావుంది. కాని బిక్కచిక్కిన గుర్రానికి వెండి, బంగారు జీనులు తగిలిస్తే అందంగా ఉంటుందా?' అన్నది మనూ.

సుందర్ ఉత్సాహంగా 'నాకు మీ మాటల అర్థం యిప్పుడు తెలిసింది మహారాణీ!' అంది.

వినాయకుడి గుడిలో స్నాతకం మొదలయిన వ్యవహారాలన్నీ అయి పోయిన తరువాత నృత్యగానాదులు జరిగాయి. మనూ దగ్గరకు వచ్చిన యువతుల్లో ఇద్దరు ముసల్మాను యువతులుకూడా ఉన్నారు. ఒకామె గంగా ధరరావు నాటకశాలలో నృత్యగానాదు లొనరించే మోతీబాయి. మరొక ఆమె జూహీ.

ఏకాంతంలో జూహీ నెమ్మదిగా మోతీబాయితో, 'ఝాన్సీకి నిజమైన రాజు యిప్పుడు దొరికాడు' అన్నది.

మోతీబాయి 'అయ్' అన్నట్లు కళ్లు పెద్దవిచేసి చూస్తే, జూహీ మాటని ఖండించింది: 'రాజాగారు వింటే తల తీయిస్తారు. కాస్త తెలివిగా మసులుకో! కాని ఈ రాణీగారుమాత్రం కొంచెం ఉగ్రరూపం ధరిస్తుం దనడంలో సందేహం లేదు.

# 6

వివాహపు తంతు - హోమం చుట్టూ ప్రదక్షిణం చేయడంతో సహా - అంతా వినాయకుడి మందిరంలో జరిగింది. పరిక్రమ చేయించిన బ్రాహ్మణుడు ముసలి వాగ్గు. మనూ చీరకొంగును గంగాధరరావుగారి ఉత్తరీయపు కొసకు ముడివెయ్యాలి. బ్రాహ్మణుడి చేతులు వణుకుతున్నాయి. మనూ 'నేనే ఎందుకు కట్టకూడదూ?' అనుకొంది. ఇంతలో సిగ్గు ముంచుకొచ్చింది. బ్రాహ్మణుడు ముడి అయితే వేశాడు కాని బిగించలేకపోతున్నాడు. మనూ సిగ్గును దూరంగా నెట్టి, చిరునవ్వుకూడా నవ్వకుండా నెమ్మదిగా, దృఢంగా బ్రాహ్మణుడితో 'ఎప్పటికీ విడవకుండా గట్టిగా కట్టండి' అన్నది.

గంగాధరరావు విన్నాడు. మోరోపంత్ కన్యాదానం చేయడానికి అక్కడే కూర్చున్నాడు. పెదవులు ముడిచాడు. పురోహితుడు నవ్వాడు. మనూ పుల కించి పోయింది. ఈ మాట బయటకు పొక్కింది. మన భాగ్యంవల్లనే ఈ రాణి మనకు లభించిందన్నారు అందరూ ముక్తకంఠంతో. ఈమె ఝాన్సీ పేరును ప్రపంచమంతట వ్యాపింపచేస్తుందన్నారు.

వివాహం జరిగిన తరువాత మనూ పేరు 'లక్ష్మీబాయి' 'మహారాణి లక్ష్మీబాయి' గా మార్చబడింది. "మహారాజా గంగాధరరావుకు జై, మహా రాణి లక్ష్మీబాయికి జై" అనే ధ్వనులతో ఆ ప్రాంతమంతా మారు మ్రోగింది.

వివాహానికి ముందు గంగాధరరావుకి శాసనాధికారం లేదు. ఆ రోజుల్లో రాజకీయ ప్రతినిధి 'కెప్టెన్ డన్‌లప్', ఝాన్సీకి నాయకుడుగా ఉండేవాడు. అతను రాజు దగ్గరకు వస్తూ పోతూండేవాడు. ఆ ఇద్దరూ స్నేహితులవి శేషాలు చెప్పుకుంటూ ఉండేవారు.

గంగాధరరావు అధికారప్రాప్తికోసం మొదటినుంచీ ప్రయత్నం చేస్తూనే ఉన్నాడు. వివాహం అయినతర్వాత అధికారం లభించింది. కాని అధికారం ఇవ్వటానికి మునుపే ఆంగ్లేయులు కంపెనీ తరఫునుంచి ఒక 'ప్రతిజ్ఞా పత్రం' సంధికోసం రాయించారు. ఝాన్సీలో ఆంగ్లేయుల పటాలాన్ని ఒకదాన్ని ఉంచేటట్లు, దాని కయ్యేఖర్చు ఝాన్సీరాజే భరించేటట్లు ఈ సంధి పత్రంలో ఉంది. గంగాధరరావు అంగీకరించాడు. ఆయన రొఖ్ఖరూపంలో కాక వారికి ఒక జమీ ఇచ్చాడు. దాని ఆదాయం సాలుకు 2,27,458 రూపాయలు. ఈ తతంగం అయినతర్వాత గంగాధరరావుకు అధికారం ఇవ్వబడింది. గంగాధరరావు వచ్చినదానితోనే తృప్తిపడ్డాడు. సభ జరిగింది. వేడుకలు జరిగాయి, నాటకాలు ఆడారు. నాటకంలో మోతీబాయికూడా ఉంది. నృత్యగానాలు జరిగాయి.

లక్ష్మీబాయి - మహారాణి లక్ష్మీబాయి - సామాన్యంగా కోటలోని భవనంలోనే నివసిస్తూండేది. బయటికి చాలా అరుదుగా వస్తూవుండేది. ఒకవేళ వచ్చినా పర్దావేసుకొని వచ్చేది. గుర్రపుస్వారీ, వ్యాయామం ఇవన్నీకూడా కోటలోపలే చేసేది. ఈ కార్యక్రమానికి చాలాసేపు పట్టేది. తన చెలులు (దాసీలని ఆమె వారిని పిలువలేదు) చేతకూడా గుర్రపుస్వారీ, శస్త్ర అస్త్రాల ప్రయోగం చేయించేది. మిగతాకాలంలో విధిగా ధార్మికగ్రంథాలు - ముఖ్యంగా భగవద్గీత - చదివేది. బాల్యందాటి యౌవనంలోకి ప్రవేశించేది అయినా కొత్తకొత్తబట్టలు వేసుకోవాలనిగాని, నగలు ధరించాలనిగాని కోరిక ఆమెకు ఉండేది కాదు.

ఝాన్సీ వచ్చాక, నవ్వుతూ వాగుడుకాయగా ఉండే మనూలో నెమ్మది నెమ్మదిగా మార్పు రాసాగింది. ఇప్పుడు అంతగా మాట్లాడటం లేదు. రాణీ లక్ష్మీబాయిలో గాంభీర్యం గూడుకట్టుకుంది. వ్యంగ్యంగా మాట్లాడాలనుకున్నప్పటికీ, చాలా సహజంగా, సరళంగా

ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది. దృఢమైన చిత్తవృత్తి ఆమెకు జన్మసిద్ధమైనవే కదా!

రాజా గంగాధరరావు సనాతన ధర్మపరాయణుడు. ఢిల్లీ, లక్నోలలో మాదిరే పర్దా పద్ధతిని అనుసరించేవాడు. సాధారణస్త్రీలు మొహం కన్పించే టట్లుగా ఉన్నా, మేలిముసుగు వేసుకున్నా, ఈయనకి నచ్చేదికాదు. కాని ఈయన తన భవనంలోమాత్రం బాగా పర్దా పద్ధతిని అవలంబింప జేసేవాడు.

రాజా ఒకరోజు రాత్రి నాటకశాలనుంచి వచ్చాడు. లక్ష్మీబాయి - ప్రతి హైందవ స్త్రీ వలెనే పతిని సత్కరించింది. రాజా మొహం కాస్త కోపంగా ఉంది.

రాణి 'మీరు ఇవాళ నాటకశాలనుంచి త్వరగా వచ్చేశారేం? నాటకం బాగుండలేదా?' అని అడిగింది.

'నాటకానికేం బాగానే ఉంది కాని ఒక సంఘటన మూలంగా మనస్సు బాగుండలేదు.'

'ఏమిటది?'

'ఖుదాబక్ష్ అని మనదగ్గర ఒక పరదా రుండేవాడు. ఒకరోజు అనవసరంగా వాగాడు. మేము అతన్ని దేశబహిష్కారం గావించాము. మళ్ళీ వాడు నాటకశాలలోకి వచ్చాడు. మోతీబాయిని ఎరుగున్నావు కదా?'

'ఆ! తెలుసు. ఆమెతో పోట్లాడాడా ఏం ఖుదాబక్ష్?'

'లేదు రాణీ! అంత సాహసం చెయ్యడు. మోతీబాయి బాగా అభినయించింది. నాటకం అయిపోయినతర్వాత ఖుదాబక్ష్ వెనకనుంచి 'మోతీబాయి చాలా చక్కగా అభినయించింది' అన్నాడు. మాకు అతని నీచమైన ప్రవర్తనకు కోపం వచ్చింది. దేశంనుంచి వెళ్ళకొట్టబడ్డవాడు నాటకశాలలోకి ఎలా రాగలిగాడు? మేము పట్టుకోవాలనుకుంటుండగా పారిపోయాడు. ఇప్పటిదాకా అతను ఎక్కడున్నదీ తెలియలేదు. మోతీబాయికి అతనితో

పరిచయమున్నట్లు అనిపిస్తోంది. మేము మోతీబాయివి నాటకశాలనుంచి తొలగించాము' అన్నాడు రాజు.

'అయితే ఇప్పుడు నృత్యగానాల ఆనందం ఎలా లభిస్తుంది?'

'నాట్యం చేసేవాళ్లు చాలామంది ఉన్నారు. మీరుకూడా రోజు నాటకశాలకు రావచ్చు. ప్రక్కన దూరమేమీ కాదు; దగ్గరే!'

'నాకు ఇష్టం లేదు.'

'గుఱ్ఱపుస్వారీ, కుస్తీ, తుపాకీలు పేల్చడంతప్ప తమరికి ఇంకేమీ ఇష్టం ఉండదనుకుంటాను అవునా?'

'ఆ! నా చెలులను నా మోస్తరుగా తయారుచెయ్యాలి. ఒకవేళ అవసరం వస్తే పురుషులకి సహాయం చెయ్యటంలో వెనుకంజ వెయ్యకుండా ఉండాలని. ఇళ్లు, వళ్లుకూడా శుభ్రంగా ఉంచుకునేటట్లు చెయ్యాలనీ....'

'వీళ్లందరినీ ఈవిధంగా తర్ఫీదుచేసి నువ్వు ఏంచెయ్యాలనుకుంటున్నావు?'

'ఇంకా ఇప్పుడేమీ చెప్పలేను. మనస్సుని, శరీరాన్నికూడా శక్తిమంతం చెయ్యటం గొప్ప పనికాదా ఏమిటి?'

'గుఱ్ఱపుస్వారీ, అవీ నేర్పటంతో వాళ్లని ఎందుకు పనికిరాని వాళ్లనుగా చేస్తున్నావు.'

'నృత్యగానాలు నేర్పిస్తే.'

'స్త్రీలు నృత్యగానాలు చేస్తే మనస్సుకి, శరీరానికి మంచి వ్యాయామం లభిస్తుంది. పేరు ప్రఖ్యాతులు సంపాదించడానికి ఇదొక సాధనం కూడాను.'

రాణీకి బాగా విసుగు కలిగింది. దానిని ఆమె పైకి వ్యక్తం చేయకుండా నవ్వుతూనే రాజుకి చురిక అంటించింది. మరి ఆమె పెరిగిన వాతావరణం, రాజకీయ పరిస్థితులు అలాంటివి. 'మరే! స్వరాజ్యం వచ్చేసిందిగా! ఇంక ఇప్పుడు నవ్వుతూ, తుళ్లుతూ ఉండటంకంటె చేయగలిగింది ఏముంది?' అన్నది.

'ఎక్కడ చూపినా పొట్లాటే కదా! ప్రతిగ్రామంలోనూ దొంగల భయం. మోసగాళ్లు ఎక్కువ అయ్యారు. ఆంగ్లేయులదగ్గర మంచిమంచి ఆయుధా లున్నాయి. అందుకే వాళ్ళని మనరాజ్యంలో అట్టిపెట్టాను' అన్నాడు రాజా.

'నాటకశాలలో తయారయ్యే ఆయుధాలతో ఆంగ్లేయులని తరుమలేరా ఏమిటి?'

రాజాకు రాణీ ఇలా వ్యంగ్యంగా మాట్లాడడం చాలా కష్టమనిపించింది. కాని ఆ వ్యంగంతో వెలువడిన చిరునవ్వు అతనిబాధను అణిచివేసింది. 'సరే జరిగిందేదో జరిగింది. తమరు రాజ్యాన్ని బందోబస్తు చెయ్యడం నేర్చుకోండి. అప్పుడు రాజ్యం బాగుంటుంది. మంచి రక్షణకూడా లభిస్తుంది. లేకపోతే రాజ్యాన్ని ఆంగ్లేయులు తమ చెప్పుచేతల్లో ఉంచు కుంటారు.

'ఆ! ఐదులక్షల జాగీరు వాళ్లు మింగి కూర్చున్నారుగా!'

'దేశంలో అన్ని జిల్లాలలోను ఆంగ్లేయులు తమ సైన్యాన్ని అట్టే పెట్టి. రాజ్యంలోని కొంచెం భాగాన్ని ఆ సైన్యాన్ని నడపడానికిగాను ఇస్తున్నారు. కొంతమందేమో ఆ సైన్యంకోసం రొఖ్ఖరూపంలో నగదు ఇస్తున్నారు.' అని క్షణమాగి రాజా 'నిజంగా తమరికి నాటకశాల అంటే ఇష్టం లేదా?' అని అడిగాడు.

రాణీ వెంటనే సమాధానం ఇచ్చింది—'ఉహూ అదేం కాదు. అంత కంటె కావల్సింది ఏముంది. రాజ్యాన్ని చూడటానికి మంత్రులు ఉన్నారు. దొంగల్ని పట్టడానికి, ప్రజల శాంతిభద్రతలను చూడటానికి ఆంగ్లేయుల సేన ఉంది' అని నవ్వింది.

రాజా ఈ సూటి పోటి మాటలను అర్థం చేసుకున్నాడు. దానితోపాటు రాణీది కుశాగ్రమైన బుద్ధి అనికూడా తెలిసింది.

'మేము దొంగలను, బందిపోట్లను, నీచులను శిక్షిస్తున్నాము. మేము ఒక కొత్తరకమైన దండనకూడా ప్రవేశపెట్టాము. ఇహనుంచి నేరస్తుల్ని తేళ్లతో కరిపిస్తాము' అన్నాడు.

'తేళ్ళతో మరి ఆంగ్లేయప్రభుత్వాన్ని కరిపిస్తారా?'

'చూడు! చూడు! మాట ఎక్కడికి తెచ్చావో!' అంటూ రాజు నవ్వాడు. ఇంతలో ఒక భటుడు వచ్చి—

'మహారాజా ఖుదాబక్ష్‌ని వెతుకుతూనే ఉన్నాము. ఇప్పటిదాకా జాడ దొరకలేదు' అన్నాడు.

'ఇంకా వెతకవలసిందిగా చెప్పు' అని రాజు ఆజ్ఞ ఇచ్చాడు. భటుడు వెళ్లగానే లక్ష్మీబాయి రాజుని విశ్రాంతి తీసుకోవలసిందిగా కోరింది.

మనూ పెళ్ళినాటికి 13 సంవత్సరాలది. 16 సంవత్సరాలు రాగానే కొడుకు పుట్టాడు. చాలా ఆడంబరంగా ఉత్సవాలు జరిగాయి. కాని పుట్టిన మూడు నెల్లకే కొడుకు చనిపోయాడు. దీనితో గంగాధరరావు శారీరకంగాను, మానసికంగాను దెబ్బ తిన్నాడు. అప్పటినుంచి ఆయన ఆరోగ్యం ఏమీ బాగుండటంలేదు. లక్ష్మీబాయికూడా ఆరోగ్యం బాగుండకపోయినా ఆమె వెంటనే కోలుకో గలిగింది.

రాజు, రాణి ఇద్దరూ రెండుసంవత్సరాలు అతి కష్టంగా గడిపారు. రాజు రోజురోజుకు కుంగిపోతున్నాడు.

ఖుదాబక్ష్ నవాబ్ ఆలి బహదుర్ దగ్గరకు అప్పుడప్పుడు వస్తున్నాడని ఒకరోజున రాజుకి తెలియగానే ఆయన నవాబ్ ఉండే మహల్ (భవనాన్ని) జప్తు చేయించాడు. బయట ఉండే భవంతిమాత్రం ఉండేటందుకు వదలి పెట్టాడు.

నవాబు ఆలీతో విరోధం మొదటినుంచీ ఉన్నదే। గంగాధరరావుకి కృష్ణారావు, రఘునాథరావు అని ఇద్దరు సోదరులున్నారు. అందరికంటె చిన్నవాడు కృష్ణారావు. తన తండ్రి బ్రతికివుండగానే చనిపోయాడు. కృష్ణారావు కొడుకు రామచంద్రరావుని సింహాసనాధీరుణ్ణి చేశారు. ఈయన కూడా కొంతకాలమయ్యాక చనిపోయాడు. అప్పుడు రఘునాథరావు ఝూన్సీకి రాజయ్యాడు. ఈయన 'లచ్ఛీ' అనే ఒక వేశ్యని చేరదీయగా వారిద్దరికీ నవాబ్ ఆలీ పుట్టాడు. రఘునాథరావు చచ్చిపోయిన తర్వాత ఝాన్సీ సింహాసనంకోసం నవాబ్ ఆలీ, గంగాధరరావులకు మధ్య చాలా కాలం వివాదం జరిగింది. ఆంగ్లేయులు గంగాధరరావు కోర్కెను మన్నించి

అతనికి రాజ్యమిచ్చారు. ఆలీ బహదూర్‌కి ఒక పెద్ద జాగీరు విచ్చారు. గంగాధరరావు చాలా దర్జాగా, ఆడంబరంగా ఉండేవాడు. అప్పటినుంచీ నవాబ్ ఆలీకి గంగాధరరావు అంటే బద్ధవైరం.

1853 లో శరన్నవరాత్రికి బ్రహ్మాండంగా ఉత్సవం జరిగింది. రాజు రెండు సంవత్సరాలనుంచి జబ్బుగా ఉన్నాడు. ఆరోజు ఆయనకు కాస్త తులాసాగా ఉంది. ఎవరినైనా పెంచుకుందామనే తలంపు ఆయనమనస్సులో కలిగింది. రాణీ ఇష్టపడింది. తమ దాయాదుల్లోని ఒకడిని పెంచుకున్నారు. వారు పెంచుకున్న అబ్బాయిపేరు ఆనందరావు. కాని పెంపుడు అయిన తర్వాత అతని పేరు 'దామోదరరావు'గా మార్చబడింది. ఝాన్సీలోని పిన్నా పెద్దా సేనానాయకులు, సర్దారులు, సేఠ్‌లు, షాహుకార్లు, బీదా, బిక్కా అందరూ ఈ ఉత్సవానికి హాజరయ్యారు. ఆంగ్లేయుల ఆఫీసర్లు మేజర్ ఎలిస్, కెప్టెన్ మార్టిన్‌లుకూడా ఈ ఉత్సవానికి వచ్చారు.

ఉత్సవం ముగియగానే అందరూ వెళ్ళిపోయారు. మేజర్ ఎలిస్, కెప్టెన్ మార్టిన్, మోరోపంత్, ప్రధానమంత్రిమాత్రం అక్కడుండిపోయారు. రాజు దత్తత స్వీకారాన్నిగురించి ఒక (కవరు) పత్రం ప్రధానమంత్రిచే రాయించి ఆంగ్లేయుల ఆఫీసరుకి ఇచ్చాడు. దగ్గిరే పర్దా వెనకాల రాణీ కూర్చుని ఉంది. రాజు దత్తతపత్రం ఇస్తుంటే ఆయనకంఠం గద్గదమయి పోయింది. కళ్లనుంచి నీళ్లు కారుతున్నాయి. పర్దా వెనకనుంచి వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లు వినిపించింది. ఆ వెక్కి వెక్కి ఏడవటం దత్తత పత్రంమీద ముద్ర వేయబడిందా అన్నంత గట్టిగా ఏడ్చింది రాణి.

'మేజర్ సాబ్! దామోదరరావు చాలా అందమైనవాడు. చాలా తెలివి గలవాడు. తల్లికి తగిన కుమారుడై ఝాన్సీని వెలుగుతో నింపుతాడు. నా ఝాన్సీకి వీ రిద్దరూ చాలా పేరు తెస్తారు' అన్నాడు రాజు. పర్దా వెనక నుంచి మళ్ళీ ఎక్కిళ్ళతో కూడిన ఏడుపు వినిపించింది.

రాజా పర్దావైపుకు మొహం తిప్పి గద్గదకంఠంతో ఆయాసపడుతూ, 'అరే! ఇది ఏమిటి? నన్ను మాట్లాడనియ్యవా? నామాట చెప్పనీ!' అన్నాడు.

రాణి నెమ్మదిగా దగ్గి తన కంఠాన్ని సవరించుకున్నది. రాజు కాస్త స్థిమితంగా 'మేజర్ సాబ్! మా రాణీలో ఎన్నో మంచి గుణాలున్నాయి. ప్రపంచంలోని గొప్పవాళ్ళందరూ ఆమె పాదధూళిని ఏనాటికైనా శిరస్సున ధరిస్తారు' అన్నాడు. అతడు చాలా కష్టంమీద కన్నీళ్లను ఆపుకున్నాడు.

'రాజా ఎక్కువగా మాట్లాడకండి. అలా బాధపడితే మీ ఆరోగ్యం తొందరగా కోలుకోదు' అన్నాడు ఎలిస్ రాణీ కాస్త బిగ్గరగా దగ్గింది. అవి రాజుని ఇంకా మాట్లాడవద్దనేటందుకు సంకేతం. రాజు కన్నీళ్లను తుడుచుకొని ఆయాసంగా 'రాణీ చాలా చక్కగా పరిపాలించగలదు. దామోదరరావు మైనరు అయినప్పటికీ బాధపడ నక్కర్లేదు' అన్నాడు.

రాజుకు గుండెల్లో నొప్పి ఎక్కువైంది. దగ్గుతెర వచ్చింది. ఆయన ఆపుకునేటందుకు ప్రయత్నం చేశాడు. కాని లాభం లేకపోయింది. తడబడుతూ 'మాకు ఝాన్సీ వాసులంటే చాలా ఇష్టం. అందరూ సుఖంగా ఉండాలని మా కోరిక. ఎవరి ఆస్తి వాళ్ళకి దక్కాలి' అన్నాడు.

మళ్ళీ దగ్గగానే రక్తం పడ్డది. రూపంలో మార్పు వచ్చింది. రాజ వైద్యులు పక్కనే ఉన్నారు. బాధలో మెలికలు తిరిగిపోతున్నాడు రాజా. కళ్లు తిరిగిపోతున్నాయి. మార్టిన్ ఒక పక్కన మెదలకుండా కూర్చున్నాడు. ఎలిస్‌కి వెళ్ళిపోదామని సంకేతం చేశాడు. రాజా అతి ప్రయాసమీద 'నా.... ఆఖరి....ప్రార్థన ఒక్కటే....నా ...ఝాన్సీని అనాథను....చెయ్యకండి' అన్నాడు. ఆఫీసర్లు ఇద్దరు నమస్కారంచేస్తూ ఎప్పుడు అవసరమయితే అప్పుడు పిలవండి అని చెప్పి వెళ్ళిపోయారు. లక్ష్మీబాయి గబాల్న బయటకి వచ్చింది. భర్త అలా వుండడంచూచి బాధపడింది. మోరోపంత్,

దామోదరరావుని పిలిపించాడు. రాజు స్పృహలేకుండా పడివున్నాడు. ఆ రోజు అలాగే గడిచిపోయింది. రెండవరోజు ఆయన పరిస్థితి విషమించింది. ఆఖరికి ఆయన నోటినుంచి....గంగా జలం' అన్నమాట వెలువడింది. గంగాజలం నోట్లో పోయగానే తెలివివచ్చింది. 'హరీ! క్షమించు.... తండ్రీ....ఎంతోమందిని....బాధ పెట్టాను....అపరాధాలను....మన్నించు....' అంటూ ప్రాణం విడిచాడు. భవనమంతా హాహాకారాలతో మారుమ్రోగిపోయింది. ఇంతవరకు రాణీని విచారంతో చూడనివారుకూడా ఈరోజు ఆమె మితిమీరి రోదించడం చూశారు. మోరోపంత్ కూడా ఏడుస్తూ దామోదరరావుని తన ఒడిలోకి తీసుకున్నాడు.

# 8

గంగాధరరావు చనిపోకముందే కొన్ని సంవత్సరాలక్రితం బిఠూర్‌లో బాజీ రావు చనిపోయాడు. ఎనిమిది లక్షల ఉపకారవేతనం కూడా రావటం ఆగి పోయింది. 'సూర్యచంద్రు లున్నంతవరకు ఈ సంధి అలాగే ఉంటుంద'ని ఆంగ్లేయులు ఉపకారవేతనానికి సంబంధించిన ఒక సంధిపత్రంలో వ్రాశారు. నానాధోండూ పంత్ యువకుడయ్యాడు. ఆంగ్లేయులప్రవర్తన అతనికి నచ్చలేదు. అతను, తాంత్యాతోపే ఇద్దరూ స్వరాజ్య సాధనకోసం వెతకసాగారు. ఆంగ్లేయుల్లో తమ రాజ్యాన్ని విస్తరింపచేయాలనే కాంక్ష ఎక్కువయింది. ఢిల్లీలో చక్రవర్తి పరిపాలనని, అవధ్‌లో నవాబుల పాలనని రద్దు చేశారు. చాలా పెద్దపెద్ద రాజ్యాలను తమ హస్తగతం చేసు కున్నారు. దీంతో అనేకమంది రాజులు, నవాబులు, రాజకీయనాయకులు పిరికివారై పోయారు. ఆంగ్లేయులు తమ మతాన్నికూడా ప్రచారం చేసేం దుకు ఎత్తులు వేశారు. రాజ్యాన్నీ తమ అధికారప్రాబల్యాన్నీ విస్తరింప జేయడం వాళ్ళ ఉద్దేశ్యం.

రాజా గంగాధరరావు చనిపోయిన తర్వాత నానా, తాంత్యాతోపే ఇద్దరూ రాణీని పలకరించడానికిగాను ఝాన్సీ వచ్చారు.

రాణీ కోటలోని భవనంలోనే ఉంటుంది. భవనంలో ఒక భాగంలో పెద్ద ఎత్తైన మందిరం ఉంది. అక్కడ రాత్రిపూట భజన, పూజలు అవీ జరుగుతూ ఉంటాయి. కోటకింద భాగంలో శంకరుని గుడి ఉంది. అక్కడికి ప్రతిరోజు ఉదయం పూజ చేయటానికి రాణీ వెడుతుంది. నగరపు భవనంలో సేనలు ఆయుధాలు మొదలయినవి ఉంటాయి.

నానా, తాంత్యాతోపే ఇద్దరు లోపలిభవనంలో చాలారోజులు ఉన్నారు.

ఆ రాత్రి చలి చాలా ఎక్కువగా ఉంది. అప్పుడు నానా, తాంత్యా లక్ష్మీబాయితో మాట్లాడుతున్నారు. రాణీ చెలులు సుందరి, కాశీబాయి ఒక మూల కూర్చున్నారు.

చిక్కిపోవటం మూలంగా రాణీ మొహం కాస్త పొడుగు అయినట్టుగా ఉంది. అయినా ఆమె దివ్యసౌందర్యంలో ఒకవిధమైన గౌరవభావాన్ని కలిగించే కాంతి నిండివుంది. ఆమె మెడలో ముత్యాలదండ ఒకటి, వేలికి ఒక వజ్రపు ఉంగరం తప్ప ఇంకే ఆభరణాలు ఆమె ధరించలేదు. తెల్లని చీర కట్టుకొని దానిమీద తెల్లనిదే ఒక శాలువ కప్పుకుంది.

వారు ముగ్గురూ ఆనాటి రాజకీయ పరిస్థితులనుగూర్చి చర్చించుకుంటున్నారు.

రాణి:-బుందేల్ ఖండ్ రాజ్యం ఆరిపోతున్న దీపంలా ఉంది. దానిలో నూనె ఉంది కాని వెలుగులేదు.

నానా:-దానిలో వెలుగు పుట్టించడానికి వీలులేదా ఏం?

రాణి:_ఏమో చెప్పలేం! నువ్వేమయినా ఆలోచించావా! నా కసలు బయటికి రావటానికే మనసొప్పటం లేదు.

తాంత్యా:_నేను ఇటూ, అటూ తిరుగుతూనే ఉన్నాను. వాతావరణం కాస్త కొరుకుడు పడట్టే ఉంది. రాజులు, నవాబులు సర్దార్లకు తమ ప్రజల మంచి ప్రజామా అందుకోటంలోనే ఆనందం లభిస్తున్నట్లుగా తోస్తోంది. చాలామంది మద్యపానంలో సుఖసంతోషాలలో మునిగి తేలుతున్నారు.

రాణి:- వీరసింహ్‌దేవ్, బుందేల్ ఖండ్ ఛత్రపాల్ పరిస్థితి అలా ఉంది ఉండకూడదే!

నానా:-లక్నో, ఢిల్లీల పరిస్థితి కాస్త మెరుగనుకుంటాను.

తాంత్యా:-ఢిల్లీ, లక్నోలు వెళ్లి చాలారోజు లయింది రాణీసాబ్.

రాణి:-మీకు నేను ఎప్పటి మనూనే; రాణీసాబ్‌ని కాదు.

తాంత్యా:-బాయీ సాబ్ అంటాము.

దీనితర్వాత చాలారాజ్యాలను గురించినచర్చ జరిగింది. తర్వాత ఝాన్సీ గురించిన ప్రస్తావన వచ్చింది.

రాణీ నిట్టూర్చి, ఇప్పుడు ఇక్కడేం మిగిలింది? ఒకవేళ ఏమయినా ఉన్నా మనచేతిలో ఏం లేదు.

నానా:-మన ఉన్నదంతా ఝాన్సీలోనే ఉంది. ఝాన్సీమీద చాలా ఆశ ఉంది.

లక్ష్మీబాయి పాలిపోయిన పెదవులమీద ఒక విలక్షణమైన చిరునవ్వు వెలసి మాయమయింది. 'ఏమి టా ఆశ' అంది.

'దామోదరరావు దత్తత స్వీకరింపబడుతుంది. నువ్వు ఇక్కడ వారందరినీ పోగుచేస్తావు' అన్నాడు తాంత్యా.

రాణీ:-ఆంగ్లేయుల ప్రభుత్వమంతా గవర్నర్ జనరల్ కనుసన్నలలో మెలుగుతుంది. ఇప్పుడప్పుడే ఏం చెప్పలేం!

తాంత్యాకళ్లు రాణీ చెలులవంక మళ్ళాయి.

రాణీ వెంటనే 'వీళ్లు ముగ్గురు నాకు చాలా నమ్మకమైనవారు. సందేహించకుండా చెప్పు' అంది.

తాంత్యా:-కంపెనీవాళ్లు తమ స్వార్థంకోసం పట్టుబడతారు. స్వార్థానికి దెబ్బ తగలనంతవరకు హరిశ్చంద్రులు, ధర్మరాజుల్లాగా ప్రవర్తిస్తారు. కాని దెబ్బ తగలగానే రంగు మారుస్తారు.

నానా:-అసలు సమస్యల్లా ఏం చేయాలనేదే! ఏదో ఒకటి చెయ్యాలి కదా!

రాణీ:-నవాబుల పరిస్థితి తెలిసిందనుకో. ప్రతిదేశంలోని జనుల అభిప్రాయంకూడా తెలుసుకోవాలి. లక్నో ప్రజల అభిప్రాయం ఏమిటో?

నానా:-పట్టుదలతోనే ఉన్నారు.

తాంత్యా:-ఢిల్లీవాళ్ళను కొంతమందిని కలిశాను. వారి పరిస్థితికూడా అంతే।

రాణీ కాస ఆలోచించి "ప్రజలే నిజమైన శక్తి. ఛత్రపతి శివాజీ ప్రజల సాయంతోనే ఢిల్లీ చక్రవర్తిని ఎదుర్కొన్నాడు. మావళులు, కుంభిణీ రైతులు ఇప్పుడుకూడా ఉన్నారు. వీరి నాగలి మొదళ్ళలోనే స్వరాజ్యం సంపాదించుకోవాలనే ఆశ, శక్తి బంధింపబడి ఉన్నాయి. ఇక్కడివాళ్లు కూడా బహుశా అలాగే ఉంటారనుకుంటాను. దక్షిణప్రజలకు ఛత్రపతి మహారాజా నాయకత్వం వహించాడు. ఇక్కడి ప్రజలకు నువ్వు నాయకత్వం వహించు అంది. వారిద్దరూ తలలు వంచుకొని ఆలోచించసాగారు.

రాణీ తన నెచ్చెలులవంక చూసి "మీరేం ఆలోచిస్తున్నారు?" అంది. సుందర్ వెంటనే సమాధానమిచ్చింది. "మహారాణి నేను కుంభిణీని ఇంకేం చెప్పాలి. మీ ఆజ్ఞ పాలిస్తూ చచ్చిపోవటానికి వెనకా ముందాడను" అంది.

నానా:-మీరు నిజం చెప్పారు రాణీ। ఇంకా మనం ప్రజలదరికి చేరలేదు అన్నాడు. ప్రజలంతా తొందరగా సంఘటితమవుతారనే ఆశగా ఉంది. నాయకుడు కావాలి.

రాణీ:-నాయకుణ్ణి నాయకుడు వెతకనక్కర్లేదు. సమర్థ స్వామి రామదాస్ ఆశీర్వచనం చాలు.

నానా:-బాగా చెప్పారు.

రాణీ:-ఎక్కడే సాధనం కన్పించినా దానిని ప్రయోగించగలిగి ఉండాలి. ముఖ్యసాధనం ప్రజలు. ఇక్కడి ప్రజలు ఎప్పటికీ మన వెనకుంటారనే నమ్మకం నాకుంది. బుందేల్‌ఖండ్‌లో అందరికీ ఆయుధం ప్రయోగించడం తెలుసు. ఇక్కడ జనసంఖ్యకూడా చాలా ఎక్కువ. చాలామంది స్త్రీలు ఆయుధాలు ప్రయోగించడం నేర్చుకున్నారు. ఇంకా నేర్చుకుంటారు.

వారిద్దరూ ఆనందమగ్నులయ్యారు.

# 9

ప్రొద్దున్నే ఒణికిపోయే చలిలో నవాబు అలీ బహదుర్ ఏనుగు సవారీమీద ఎలిస్ దగ్గరికి వచ్చాడు. వెంట తన విశ్వాసపాత్రుడైన నౌకరు పీర్ అలీని కూడా తీసుకువచ్చాడు. ప్రస్తుతం జిల్లాజడ్జీ కచ్చేరీ ఉన్నచోట ఎలిస్ ఉండే వాడు. పీర్ అలీ బయటకెళ్లాడు. నవాబు లోపలికెళ్ళాడు. నమస్కార ప్రతినమస్కారాలు, క్షేమసమాచారాలు అయినతర్వాత నెమ్మదిగా నవాబ్ తన విషయానికి నాందీగా....

'రాణీసాబ్ అర్జీకి సమాధానమేమీ రాలేదు. బహూశా కొట్టివేయబడిం దనుకుంటాను' అన్నాడు.

ఎలిస్ విచారంగా, 'ఏమీ చెప్పలేం। చూడాలి ఏమవుతుందో? దత్తత అంగీకరింప బడుతుందో లేదో?'

నవాబు:-ప్రజల క్షేమంకోరి ప్రభువులు చాలా రాజ్యాల్లో న్యాయం, శాంతిభద్రతలకోసం చట్టం చేశారుకదా। కాని ఝాన్సీ జిల్లాలోమాత్రం చాలా పెద్దపెద్ద అన్యాయాలు జరిగాయి.

'ఇక్కడి ప్రజలు ప్రభుత్వపరిపాలనను అంగీకరిస్తారా?'

'తప్పకుండా స్వీకరిస్తారు ప్రభూ!'

'పెద్దదొరగారి ఇష్ట మెలా అయితే అలా' అని ఎలిస్ నవాబువంక మవ్వు వచ్చిన పనేమిటన్నట్టుగా మొహం పెట్టాడు.

నవాబు నెమ్మదిగా, మధురంగా 'నాదో విన్నపం' అన్నాడు.

ఎలిస్:-ఆ। తప్పకుండా చెప్పండి.

నవాబు:-నా తండ్రి మహారాజా రఘునాథరావు నాకు 50 గ్రామాలు జాగీరుకింద ఇచ్చాడు. రాజా గంగాధరరావు సర్కారుకు సేన కొరకయ్యే

ఖర్చుకింద ఇచ్చిన జమీలో (ఫిర్కా) ఈ గ్రామాలుకూడా ఉన్నాయి ప్రభుత్వం నాకు 500 రూపాయలు ఇవ్వటానికి బందోబస్తు చేసిందికాని దాంతో గడవడం కష్టంగా ఉంది.

ఎలిస్:-నవాబ్ సాహెబ్! మీరు నా మిత్రులు. మీకోసం నావల్ల కాగలి గింది నేను చేస్తాను. మీరు అర్జీ పెట్టండి.

నవాబు సంతోషంతో 'చాలా కృతజ్ఞుణ్ణి. దేవుడు మిమ్మల్ని గవర్నరుగా చెయ్యాలి' అని కొంచెమాగి 'ఇంకో మనవి' అన్నాడు.

'చెప్పండి, చెప్పండి.'

'మహారాజా రఘునాథరావు భవనం నా ఆధీనంలో ఉండేదని మీకు తెలుసు. కాని దానిని గంగాధరరావు నా దగ్గరనుంచి ఉత్తి పుణ్యానికి లాక్కున్నాడు. అది దేనికి ఉపయోగించకుండా తాళం వేసి వుంది.'

'నాకు తెలుసు. ఆ భవనం మీది. మీకే వస్తుంది. కాస్త ఓపిక పట్టండి.'

నవాబు ఎలిస్‌మీద కృతజ్ఞతల జడివాన కురిపించి పోవటానికి సన్నద్ధు డయ్యేలోపల ఎలిస్ 'కాసేపు కూర్చోండి నవాబుగారూ!' అనగానే సంబర పడిపోతూ కూర్చున్నాడు నవాబు.

'మన పురవాసు లేమంటున్నారు నవాబ్‌సాబ్!' అని అడిగాడు ఎలిస్.

'ఇబ్బందుల్లో ఉన్నారు. నిజం చెప్పాలంటే కంపెనీ ప్రభుత్వపు ఆధీనం లోనే వారు హాయిగా ఉంటున్నారు.'

'ప్రజలతో - అందునా ప్రముఖులను కలుస్తూ వారి కష్టనష్టాలను సుఖ దుఃఖాలను నాకు చెప్తుతూ ఉండండి.'

'తప్పకుండా మహారాజ్. రెండు మూడురోజుల కొకసారి వస్తూ ఉంటాను.'

'రాణీగారి పరిస్థితి ఏమిటి? ఆవిడ ఎలాంటిది?'

'దుఃఖంలో మునిగి ఉంది. ఖచ్చితమైన మనిషి. తన మనోధర్మానికి కట్టుబడి ఉంటుంది. గుఱ్ఱపుస్వారీ చెయ్యటం, ఆయుధాల నుపయోగించడం అంటే ఆమెకు ఇష్టం. బహుశా ఇప్పుడు ధార్మికగ్రంథాలు చదువుతుండ వచ్చు.'

'ఆః విన్నాను. కాని ఆవిడదగ్గరికి వాళ్లు, వీళ్లు ఎవరైనా, అంటే తప్పు దోవలు పట్టించేవారుగాని, అడ్డదిడ్డమైన మాటలు చెప్పేవారుగాని వస్తు న్నారా ః లేదా ః అనేది తెలుసుకోవలసిన విషయం.

'ప్రస్తుతం ఆవిడని పరామర్శించడానికి వచ్చిన బంధువులంతా వచ్చి వెళ్ళిపోయారు.'

'దయచేసి వారు ఎవరైందీ ఆచూకి తెలుసుకోండి' అన్నాడు ఎలిస్.

'మంచిది అలాగే చేస్తాను' పీర్ ఆలీ అని చాలా నమ్మకమైన, తెలివైన నౌకరు ఒకడున్నాడు. ఈ పనికోసం వాడిని నియమిస్తాను' అని చెప్పి ఆలీ బహదూర్ వెళ్ళిపోయాడు. పీర్ ఆలీకి వాడు చెయ్యాల్సిన పని చెప్పాడు.

ఖుదాబక్ష్ ఇతని భవనంలోనే ఉన్నాడు. నవాబు రాగానే 'నా విషయం గురించి ఏమైనా మాట్లాడారా ?' అని అడిగాడు.

నవాబు 'ఆయన చాలా కష్టంమీద ఒప్పుకున్నాడు. అయిన ఆలో చించాలి' అని అబద్ధమాడాడు.

ఖుదాబక్ష్ బలవంతుడు, అందమైనవాడు, యువకుడు. ప్రస్తుతం కష్టాల్లో ఉన్నాడు. 'నేను రాణిగారిదగ్గరకు వినతిపత్రం పంపాను. ఆమె నాకు ఝాన్సీలో ఉండటానికి అనుమతి నిచ్చింది. జాగీరు విషయంలోకూడా గవర్నరుగారి దగ్గరనుండి ఆజ్ఞ రాగానే....తీర్మానం చెయ్యబడుతుందని చెప్పారు.

నవాబు లోలోపల కోపంతో మండిపోయాడు. ఓ క్షణమాగి 'బాగుంది వినతిపత్రం ఎవరిద్వారా పంపావు' అని అడిగాడు.

మోతీబాయి నా మనవి తీసుక వెళ్ళింది. నాటకశాలలో పనిచేస్తూ ఉండేది. జీతం రావలసి ఉంది అందుకని వెళ్ళింది. మాటలసందర్భంలో నా ప్రార్థన వినిపించింది.

'నేను సాయం చేస్తాలే' అన్నాడు అలీ బహదుర్.

*   *   *

అతి కష్టంమీద ఎలిస్ 'అది నా కర్తవ్యం, చాలా క్లిష్టమైనది' అన్నాడు. అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు.

ఎలిస్ 'రాణీగారు వచ్చారా?' అని అడిగాడు.

వచ్చి పరదాచాటున నున్నారని మంత్రి చెప్పాడు.

ఎలిస్ జేబునుంచి ఒక పత్రం తీసి చదివి వినిపించగానే మోరోపంత్ బాధగా "ఓహ్" అనుకున్నాడు.

మంత్రి 'అయ్యయ్యో' అన్నాడు.

మిగతావారందరూ 'జరగగూడనిదేదో జరిగిపోయింది' అన్నారు.

దామోదరరావు దాదాపు 5 సంవత్సరాలవాడు. ఏదో చెడు జరిగిందని వాడు ఊహించాడు. ఉన్నట్లుండి రాణీ పెద్దగా 'నా ఝాన్సీని నేను ఇవ్వను' అని అరిచింది.

ఆవిడ అరుపులకి రాజమందిరం ప్రతిధ్వనించింది. వాయుమండలం ఈ మాటలను తనలో ఇముడ్చుకుంది.

'నేను గవర్నర్ జనరల్ ఆర్డరును వినిపించాను. నేను చేయగలిగింది నేను చేశాను. కాని ఫలితం లేకపోయింది. కాని ఇందులో అసంతృప్తికి ఏమీ అవకాశం లేదని నా మనవి. నెలకు అయిదువేలరూపాయలు ఉపకార వేతనం మహారాణిగారికి లభిస్తుంది. అది....ఆమె—పరివారానికి చాలు' అన్నాడు ఎలిస్.

వెంటనే పర్దా వెనుకనుంచి 'అన్యాయం చేశారు, నేను తీసుకోను' అన్నది రాణీ దృఢస్వరంతో.

ఇంక ఇక్కడ ఉండటం శ్రేయస్కరం కాదని ఎలిస్ వెళ్ళిపోయాడు.

మందర్ పర్దాలోపల రాణీదగ్గర కూర్చుంది. ఎలిస్ ప్రకటన వినగానే మూర్ఛపోయి గోడ కానుకుపోయింది. ఎలిస్ వెళ్ళిపోయినతర్వాత స్పృహ వచ్చి విలపించసాగింది.

'ఎందు కేడుస్తావు. నీ కెవరు నేర్పారు ఇది. ఈ చిన్నరాజ్యంకోసం బ్రతుకుతున్నావా ఏమిటి లే! లే!' అంటూ రాణి సుందర్‌ని బుజ్జగించి ఆమెని తన భుజంమీద పడుకోబెట్టింది. ఇద్దరూ కోటలోకి వెళ్ళిపోయారు.

క్షణంలో ఈ వార్త నగరంలో వ్యాపించింది. ఝాన్సీ ప్రజలకు అంతు లేని బాధ కలిగింది. రాణీ సేన అయితే వెంటనే యుద్ధం ప్రకటించాలను కుంది. కాని రాణి, ఇప్పుడు సమయంకాదని నచ్చజెప్పింది.

ఎలిస్ జాగుచెయ్యకుండా ఝాన్సీ మొత్తం ఆంగ్లేయుల అధీనంలోకి వచ్చే ఏర్పాటు చేశాడు. మంత్రిదగ్గర కార్యాలయాల తాళాలు తీసుకున్నాడు. తావాలో ఆధికారం ప్రకటించాడు. నగరంలో ఆంగ్లేయుల పరిపాలనను గురించి చాటింపు వేయబడింది. భూమిశిస్తు వసూళ్లుచేసే వారిదగ్గరికి కట్టు దిట్టమైన ఏర్పాట్లకోసం కబురుపెట్టాడు. ఎవరెవరికి జాగీర్లు, ఆస్తులు ఉన్నాయో వారివికూడా నమోదు చేసుకున్నాడు. వీటివికూడా బందోబస్తు, జప్తు చెయ్యవలసి ఉంది.

# 10

రాణీ కోటఖాళీచేసింది. నగరంలోని ఒక భవనంలో ఉండవలసి వచ్చింది. కోటలో ఆంగ్లేయుల కాపలాదళం ప్రవేశించింది.

చాలారోజులు గడిచాయి. ఒకరోజు రాణీ తన ముగ్గురు నెచ్చెలులతో కూర్చుని ఉంది. వీరు ముగ్గురు చాలా విచారంగా ఉన్నారు. కళ్లవెంట నీళ్లు కారుతున్నాయి. సుందర్ కరుణాపూరితమైన స్వరంతో 'ఇప్పుడెలా, మహారాణీ?' అంది.

రాణీ తన్నుతాను సంబాళించుకుని సుందర్ తలమీద చేయివేసి 'కన్నీళ్లు మన శక్తిని పోగొడ్తాయి, మనం పని మొదలుపెట్టాలి. ఏడుస్తూ, మొత్తుకుంటూనే శక్తి పోగొట్టుకొంటే పని ఎలాసాగుతుంది? ఛత్రపతి శివాజీ తల్లి జిజియాబాయి భర్తని పోగొట్టుకున్నా ఎవరికోసం, ఏం ఆశపెట్టుకుని బ్రతికింది? సింహాసనంమీద కూర్చోబెట్టటానికా? ఆవిడ తపస్సు, త్యాగం పుత్రుణ్ణి ఏనుగు సవారీమీద, మెత్తని సింహాసనంమీద కూర్చోబెట్టటానికి కాదు.

చెలులు సావధానులై వినసాగారు.

'మనం ఏం చెయ్యాలో నిశ్చయమైపోయింది కదా! మార్గంలో అనేక బాధలు, కష్టాలు వస్తాయి. పెంపుడు ఒప్పుకోకపోవటంకూడా బాధేననుకో! ఒకవేళ ఒప్పుకున్నా మనం నిద్రపోవడానికే బ్రతికి ఉన్నామా? బాజీరావు తాత మా అందరినీ స్వరాజ్య స్థాపనకోసం ప్రేరేపించేవారు. శిక్షణఇచ్చేవారు, కర్తవ్యాన్ని విస్మరించకూడదని శ్రీకృష్ణభగవాను డుపదేశించాడు. మన హిందూదేశంలో ఎవరు స్వరాజ్యంకోసం ప్రయత్నంచేసినా చెయ్యకపోయినా నేను చేస్తాను - తప్పకుండా చేస్తాను. నా భగవంతుడి ఎదుట, నా

ఆత్మసాక్షిగా నేను ప్రతిజ్ఞ చేశాను. ప్రజలు మనవెంట ఉన్నారు. ప్రజలే సర్వస్వం. ఆంగ్లేయులు రాజును నశింప చేయగలరు గాని ప్రజలని చేయ లేరు. నేను ప్రజల ఎదురుగా స్వరాజ్యపు జెండా ఎగరవేసే రోజు వస్తుంది.

చెలుల కళ్లల్లో మెరుపు మెరిసింది. 'ఎలిస్, గిలిస్ అంతా ఎగిరిపోతారు' అంది సుందర్ ఉత్సాహంగా.

'నెలకు 5 వేల రూపాయల పెన్షన్ నే నెందుకు ఒప్పుకొన్నానంటే కంపెనీ వాళ్లకి నా ఉద్దేశ్యమేమిటో తెలియకూడదని'.

సుందర్ వెనకా ముందాడుతూ 'సేనని ఎప్పుడు ఆయత్తపరుస్తారు? మన రాజ్యంలోని సేనకి 6 నెలల జీతాన్నిచ్చి మాన్పించారుగా'!

'సమయంచూసి మన సైనికులు తమ అనుచరులను తీసుకొని ముందు దూకుతారు. అప్పటిలోపల స్త్రీలను సిద్ధంచేయాలి. ఎందుకంటే ఆంగ్లేయులు ఇప్పట్లో ఈ విషయాన్ని గురించి ఊహించలేరు.'

చెలులు సంతోషంగా దాన్ని బలపరిచారు. స్త్రీలకి గుఱ్ఱపుస్వారీ అదీ మర్నాటినుంచీ నేర్పడం ప్రారంభమయింది. వారిసంఖ్య చాలా ఎక్కువగా ఉంది. ఆంగ్లేయులు రాణీ ఏదో ప్రత్యేకమైన విషయంలో తీవ్రంగా ఆలోచిస్తున్నదని తెలుసుకున్నారు. రాణీ, ఆవిడ సైనికులు చెలులు అంతా నగరం వెలుపల నలుమూలలా ప్రతి అంగుళాన్ని పరిశీలించడం మొదలు పెట్టారు. వీరంతాకూడా ఆయుధాలను వాడటంలో చాలా నిపుణులు.

ఆ సమయంలో తాంత్యాతోపే వచ్చి రాణీని కలుసుకున్నాడు. ఈ సారి రాణినిచూసి చాలా ఆశ్చర్యపోయాడు. కుశల ప్రశ్నలయ్యాక ఆనాటి రాజకీయ పరిస్థితులమీద చర్చ జరిగింది. తాంత్యా మాటలసందర్భంలో 'చాలా మంది రాజులు, నవాబులనుకూడా ఆంగ్లేయులు లోబర్చుకున్నారు. కాని ప్రజలు అప్రమత్తులై ఉన్నారు. సిపాయిలు రోషపూరితులై ఉన్నారు' అన్నాడు.

రాణీ ఉత్తేజితురాలై 'మళ్లీ ఒకసారి పర్వతపంక్తులు, మైదానాలు 'హర హర మహదేవ' అనే ధ్వనితో దద్దరిల్లిపోవాలి.' తన్ను తాను సంబాళించుకొని మళ్ళీ 'నీ ఎదుటకూడా నన్ను నేను అదుపులో ఉంచుకొని మాట్లాడాలి' అని నవ్వింది.

తాంత్యా దృఢస్వరంతో 'బాయిసాబ్ నా మనస్సులో, ప్రజల మనస్సుల్లో, అందరి మనస్సుల్లో ఉన్నమాటే మీరు చెప్పారు' అన్నాడు. రాణీ ఏమీ పశ్చాత్తాపపడలేదు. 'చాలాపని చెయ్యవలసి వచ్చింది. ముఖ్యమైన స్థలాల భూస్థితిని సూక్ష్మదృష్టితో పరిశీలించవలసి ఉంది. ఎక్కడికి ఏవిధమైన సేనను తీసుకొని వెళ్ళాలో ఎక్కడెక్కడ యుద్ధం చెయ్యాలో మొదలైనవన్నీ తెలుసుకోటం, గుర్తు పెట్టుకోటం చాలా అవసరం' అంది రాణీ.

'బాయిసాబ్! ఇవన్నీ మనసులో ఉన్నాయి. తమ ఆజ్ఞను పూర్తిగా పాలిస్తాం. నానాసాబ్ కూడా ఈ విషయంలో దృఢచిత్తులై ఉన్నారు.'

'ఫిరంగులు, తుపాకులు, తుపాకీమందు, తుపాకిగుళ్లు, ఫిరంగిగుళ్ల మొదలైనవి తయారుచేసేవారిని పట్టుకోవాలి.'

'తప్పకుండాను. మనకి ఒక గూఢచారిదళం ఉండడంకూడ అవసరం.'

'నేను అప్పుడే స్థాపించాను.

'ఎప్పుడు? ఎలా! ఓహో!'

'నా ముగ్గురు చెలులు, ఇంకా కొంతమంది కలసి చేస్తున్నారు. అన్నీ చాలా జాగ్రతగా జరుగుతున్నాయి.

'నానాసాహెబ్ ఇంకా వారి సోదరులు ఈ పనిలో నిమగ్నులై ఉన్నారు. ఢిల్లీ, మీరట్‌లకు చెందిన చాలామంది ముసల్మానులు కార్యనిరతులై ఉన్నారు' అన్నాడు తాంత్యా.

'అంతా తయారు చేసుకోటం పూర్తయిన తర్వాత స్వరాజ్యసాధన ప్రారంభించాలి.'

'సరిగ్గా చెప్పారు. సగంసగం పనివల్ల ఏమీకాదు. మద్రాసు సిపాయిలు ఉన్నట్టుండి తిరుగుబాటు చేసారు కాని విఫలమైంది. ఆంగ్లేయులు చాలా జాగ్రత్తగా వ్యవహరిస్తున్నారు.'

'వాళ్లెంత జాగ్రత్తగా ఉన్నా, ఎంత కుటిలంగా రాజ్యంచేసినా, మన దేశంలోని అసంఖ్యాకమైన ప్రజలు-హిందువులు, ముసల్మానులు అందరూ-ఆంగ్లేయుల పరిపాలన కోరటంలేదు.' రాణీ నవ్వి 'నాకు తెలుసు' అంది.

రాణీకి భోజనానికి వేళయింది. తాంత్యా వెళ్లిపోయాడు. రెండవరోజున అనుకున్నవేళకు ఇద్దరు వ్యక్తులతో కలిసివచ్చాడు. ఒకతనిపేరు రఘునాథ సింహ్. రెండవతనిపేరు జవాహర్‌సింహ్. ఇద్దరూ యువకులే! రఘునాథ సింహ్ చాలా బలవంతుడు. జవాహర్‌సింహ్ బక్కగా ఉంటాడు. అయినా బలవంతుడే! ప్రణామంచేసి ఇద్దరూ కూర్చున్నారు. తాంత్యా! మంత్రి. జవాహర్‌సింహ్‌ని అతని గ్రామంనుంచి రాత్రి ఎందుకు తీసుకువచ్చారు. జవాహర్‌సింహ్ చేతులు జోడించి 'ఝాన్సీనుంచి ఇక్కడికి దగ్గరే! మంత్రి గారు తమ ఒంటెను పంపారు. నేను ప్రాతఃకాలానికే ముందు వచ్చేశాను' అన్నాడు.

'మంత్రి రఘునాథసింహ్‌ని సవారీ పంపమని అడగగానే పంపాడు!' అన్నాడు తాంత్యా.

'మహారాణీ! మేము ఝాన్సీకోసం, మా యజమానురాలికోసం ప్రాణా లర్పించటానికి, ఒడ్డడానికి తొందరపడుతున్నాం.'

'తాంత్యా అసలుసంగతి చెప్పే ఉంటాడు. అంతా మీమీది ఆశ!'

రఘునాథసింహ్:-అవును మహారాణీ. కాస్త చెప్పగానే తెలుసు కున్నాం. ఎక్కువ చెప్పవలసిన అవసరంలేదు. మాతల్లిని దర్శించుకోవ డానికి ఆమె ఆజ్ఞ పాలించడానికి వచ్చాను.

జవాహర్‌సింహ్:-మా కత్తులమీద మీరు మీ చేతులతో గంగాజలం చల్లాలి.

రఘునాథసింహ్:-దానితోపాటు తల్లి ఆశీర్వాదంకూడా కావాలి.

రాణి నవ్వింది 'మీ సంగతి నాకు బాగాతెలుసు. అవసరం ఏర్పడితేనే ఒరలోంచి కత్తిదూయాలి. చిన్నచిన్న మాటలని పట్టించుకోవద్దు.'

'వాళ్ళకి ఈ ఆజ్ఞ చాలా కఠోరంగా ఉంది' అన్నాడు తాంత్యా.

రాణీ:-ఆంగ్లేయుల అన్యాయం మితిమీరితే మంచిదే! వాళ్లు ఇక్కడ గోహత్య మొదలుపెట్టారు. అందరూ వద్దన్నారు. హిందువులు, ముస ల్మానులు ఏడుస్తున్నారు, మొత్తుకుంటున్నారు. అయినా వాళ్లకి ఏమీ విని పించలేదు. భగవంతుడు వినాలి.

వాళ్ళంతా తలలు వంచుకున్నారు.

రాణీ సుందర్‌ని పిలిచి గంగాజలం తెమ్మంది. సుందర్ తెచ్చింది. రాణి వాళ్ళిద్దరి కత్తులమీద చల్లింది. వాళ్లు రాణీ కాళ్లు స్పృశించి కత్తులు ఒరలో పెట్టుకున్నారు. రాణి పులకించిపోయింది.

'రాణీ! మమ్మల్ని ఆశీర్వదించండి' అన్నాడు రఘునాథసింహ్.

రాణీ కంఠం పూడుకుపోయింది. సంబాళించుకొని "మీ కందరికీ స్వరాజ్య సంపాదనే ఆదర్శం కావాలి. సంతోషంగా ఉండండి. మన తర్వాతి తరాల వారు మనపేరు చెపితేనే ప్రేరణ పొందేటంతగా పేరు పొందండి' అన్నది.

'తల్లి ఆశీస్సు, పవిత్రమైన ఈ గంగాజలం మాకు శక్తినిచ్చి ఎప్పుడూ మావెంటే ఉంటుంద'న్నాడు జవాహర్ సింహ్.

లాంఛనలు అన్నీ పూర్తి అయింతర్వాత అందరూ వెళ్ళిపోయారు. రాణీ చెలులందరూ చాలా ఉత్సాహంగా ఉన్నారు.

లక్ష్మీబాయి ఈవిధంగా పనులన్నీ చాలా జాగ్రత్తగా, నిక్కచ్చిగా చేస్తోంది. ఆవిడ అనుచరులుకూడా చాలా సావధానంగా ఉన్నారు.

కంపెనీ ప్రభుత్వం, ఆంగ్లేయుల అధికారాన్ని క్రియలద్వారా విస్తరింప జేయసాగింది. గ్రామపంచాయతీల స్థానంలో కోర్టులు వచ్చేశాయి. జాగీర్లు చేజారాయి. గుడిమాన్యాలుకూడా తీసుకున్నారు. ఝాన్సీలో గోహత్య ఏ రాష్ట్రంలోనో చెయ్యలేదు—అయినా ప్రజలు, రాణీ కూడా లిఖితపూర్వకంగా గోవధ నిషేధించాలని మనవి చేశారు. రెంటినీ తిరస్కరించారు. తెల్లదొర బయటికి పల్లకిమీద వచ్చినా, గుఱ్ఱంమీద వచ్చినా అందరూ నమస్కారం చెయ్యాలట. ప్రజలకి చాలా కోపంవచ్చింది. కాని లక్ష్మీబాయి అందరినీ శాంతపరచి 'మనకి ఎప్పటికైనా స్వరాజ్యం వస్తుంది. అప్పుడు ధర్మం, మతం ఎప్పటికీ చిరస్థాయిగా ఉండేటట్లు స్థాపించబడుతుంది. దానికోసం సంఘర్షణ తప్పదు. శక్తిని సమకూర్చుకుంటూ ఉండాలి.

# 11

ఆంగ్లేయుల పరిపాలనారంభంలో బందిపోటు దొంగలు ఝాన్సీ రాజ్యపు జమీలలో పడసాగారు. వీళ్లల్లో సాగరసింహుడనే బందిపోటుమీద ప్రభుత్వానికి చాలా ఫిర్యాదులు వచ్చాయి. ఒకసారి సాగరసింహుడు పట్టుబడ్డాడు. ఝాన్సీ జైలులో పెట్టారు. ఆంగ్లేయ ఆఫీసర్లు-కలెక్టరు, కమీషనర్-అతన్ని చూడాలనుకొని జైలుకి వచ్చారు. జైళ్ళ ఇన్‌స్పెక్టర్ బక్షిష్ ఆలీ ఆఫీసర్లకి మర్యాద పురస్సరంగా స్వాగతం చెప్పాడు. వంగి వంగి దణ్ణాలు పెట్టాడు. ఆఫీసర్లు సాగరసింహుడితో మాట్లాడారు. అతను మిడిసిపాటుతో సమాధానాలు చెప్పాడు. ఆఫీసర్లు బెదిరించారు. వాళ్ళ దొంగలగుంపు పేర్లు తెలుసుకోవాలనుకున్నారు. సాగరసింహుడి చేతులకి బేడీలు తగిలించి ఉన్నాయి. కాస్త వినయంగా 'ఆకలి, దప్పిక లేస్తున్నాయి. బుర్ర పని చెయ్యటం లేదు. పైగా ఇదో బరువు! బరువు తగ్గి కడుపునిండా అన్నం దొరికితే రేపు అందరిపేర్లు చెపుతాను' అన్నాడు.

ఆఫీసర్లు ఒప్పుకున్నారు. సంకెళ్లు తీసేసి కడుపునిండా అన్నం పెట్టమని చెప్పి ఆఫీసర్లు వెళ్ళిపోయారు. కాని అతనిమీద కాపలామాత్రం పెట్టారు.

బక్షిష్ ఆలీ సాగరసింహుడితో చాలా స్నేహంగా ప్రవర్తించాడు. చక్కటి భోజనం పెట్టాడు. రాత్రిపూట సమయంచూసి సాగరసింహుడు పారిపోయాడు. పాపం, బక్షిష్ ఆలీ చాలా దిగులుపడ్డాడు.

పెద్ద ఆఫీసరు జైలుకు రాగానే సాగరసింహుడు పారిపోయాడని తెలిసి చాలా మండిపడ్డాడు. బక్షిష్ ఆలీని అతను చెప్పులతో కొట్టి అవమానించాడు. గంగాధరరావు పరిపాలనలో ఇతను కోటలోని ముఖద్వారాలకు ఆఫీసరుగా ఉండేవాడు. ఈ అవమానంతో అతను చాలా బాధపడ్డాడు.

అప్పుడు వహించినా అతని మనస్సులో ఓ మూల ఈ బాధ రగులుతూనే ఉంది.

ఈ సంఘటన అన్నిచోట్లకి వ్యాపించింది. ఆంగ్లేయులసేనలో ఉన్న భారతీయులకు చాలా బాధ కలిగించింది.

రాణీకి కూడా తెలిసింది. మోతీబాయి రాణీకి మీరా భజనలు అవీ విన్పించ డానికి వస్తోంది. అది దుఃఖంతో అన్నీ వివరంగా రాణికి చెప్పింది. భజన లతోపాటు ఏవైనా ముఖ్యంగా సంగతులుంటే కూడా వినిపించడం దాని వంతు. మోతీబాయి చాలా అందమైనదే, తెలివి కలదే. నూటికి నూరుపాళ్లు రాజభక్తి కలది లక్ష్మీబాయి అంటే అపారమైన భక్తిశ్రద్ధలు కలది. నాటకశాలలో పనిచేసే జోహీ గంగాధరరావు సేనకి ఆఫీసరు కర్నల్ నామ్ఖా పొరుగునే ఉంటోంది. మోతీబాయి, జోహీ ఇద్దరూ ముస్లిం యువ తులు. జోహీకూడా రాణీ అంటే చాలా భక్తిశ్రద్ధలు చూపుతుంది.

తాంత్యా కర్నల్ జ్యాఖా భవంతిలో ఉంటున్నాడు. రాణీ భవనంలో జోహీ తాంత్యాని ఒకటి రెండుసార్లు చూసింది. కాని ఇక్కడ చాలాసార్లు చూసింది. రాణీ సలహాతో తాంత్యా మాటమీద, జోహీ, ఆంగ్లేయుల సేన లోని భారతీయులు ఉండేచోటికి రాకపోకలు సాగించింది. భజనలు పాడి డబ్బులు సంపాదిస్తున్నదేమోనని ఆంగ్ల ఆఫీసర్లు అనుకున్నారు. అసలు జోహీ రాజకీయకారణంతో వెడుతోంది, ఎక్కడ ఏం జరుగుతోందో తెలుసుకోడానికి. అవకాశం వస్తే సిపాయిలని యుద్ధరంగంలో దూకాలని ప్రేరేపిస్తోంది.

జోహీ, మోతీబాయి - ఈ ఇద్దరూ లక్ష్మీబాయి తరపున గూఢచారులుగా చాలా చాకచక్యంగా పనిచేసేవారు. ఆలీ బహదుర్‌కిమాత్రం వీరిద్దరూ రాజ్ మహల్‌కు వచ్చి భజనలు, పాటలు విన్పించేవారిగానే ఉండిపోయారు. లక్ష్మీ బాయి దగ్గరికి ఎవరెవరు వస్తూపోతూ ఉన్నారు, అక్కడ ఏమేమీ జరుగు

తోంది - అన్న విషయాలను తెలుసుకోమని నవాబును ఆంగ్లేయులు కోరారు. అందుకని అతను లక్ష్మీబాయితో సంబంధం పెంచుకోటానికి ప్రయత్నం చేస్తున్నాడు. పీర్ అలీ నవాబుకు నమ్మిన బంటు.

అతను ఒకరోజున మోతీబాయిని తియ్యటిమాటలతో ముంచి వేస్తూ—

'నువ్వు మహారాణీకి పాటలు, భజనలు వినిపిస్తావుకదా! అప్పుడప్పుడు నవాబుగారికికూడా వినిపిస్తూ ఉండు. వారు సంగీతప్రియులు అది విని విన్ను సన్మానిస్తారు' అన్నాడు.

మోతీబాయి వినయంగా, ఉత్సాహంతో—

'మొదట నేను ఘోషా పాటించేదాన్ని. కాని ఇప్పుడు ఏమంత పట్టింపు లేదు, అలా చేయాల్సివచ్చింది. మహారాణీ చాలా ధార్మికురాలు. ఆవిడ దగ్గరకెళితే ఆమె దర్శనభాగ్యంతోపాటు పొట్టనిండా తిండీ లభిస్తుంది. నవాబుగారి సేవకూడా అలాగే చేస్తాను.'

ఒకరోజున పీర్ అలీ మోతీబాయిని నవాబు భవనంలోకి తీసుకువచ్చాడు. సిగ్గుతోను, లజ్జాభారంతోను ఉన్న మోతీబాయిని అతను మర్యాదగా చూశాడు.

నవాబు కాస్త విలాసంగా 'నేను నాటకశాలలో నీ కళాకౌశలాన్ని చూశాను. నా ఇంటికివచ్చి నీవు బిడియపడ నక్కరలేదు'. అన్నాడు.

'ఏదో పాత అలవాటు. మీరుకూడా మాకు ప్రభువులే!'

నవాబు సంబరపడిపోయాడు. మోతీబాయి ఓ గంటపాటు ఏ వాద్య సహాయం లేకుండా గానం చేసింది. నవాబు ఏమంత సంతోషించకపోయినా "బలే! బలే!" అంటూనే ఉన్నాడు. ఆఖరికి తనకి కావలసిన వాటిల్లోకి ఆమెను దింపి,

'మీ రాణికి ఎటువంటి పాటలంటే ఇష్టం' అని అడిగాడు.

'ఆవిడకి మీరా భజనలంటే చాలా ఇష్టం. ఎప్పుడూ పూజా భజనలలోనే కాలం వెళ్లబుచ్చుతారు' అని మోతీబాయి సమాధాన మిచ్చింది.

'మహారాణి పెన్షన్‌తో చాలామందికి సహాయం లభిస్తోందనుకుంటాను.'

'ఆ! చాలా ఉదార స్వభావురాలు. దానధర్మాలు చేస్తుంటారు.'

'ఆ! తప్పక చెయ్యాలి. ఇంకా వచ్చేపోయేవాళ్లు, చుట్టుపక్కాలు, పాత నౌకర్లు వీళ్లందరికీకూడా కాస్తో కూస్తో ఇవ్వాలిగా మరి.'

మోతీబాయి కను కొసలగుండా తలుపు దగ్గరనుంచి తన మాటలు వింటున్న పీర్ అలీని చూసింది.

మోతీబాయి సిగ్గుపడుతూ - 'ఆ! వస్తూ పోతూ ఉండటమయితే నిజమే కాని ఇచ్చి పుచ్చుకోలు నేనేమీ చూడలేదండీ' అంది.

'మహారాణీ వాళ్ళతో మాట్లాడటానికి బోలెడు సమయాన్ని వెచ్చిస్తోంది. ఇదిమాత్రం తక్కువా ఏమిటి?'

'ప్రపంచంలో పనులన్నీ చెయ్యటానికి మహారాణికి తీరిక ఎక్కడ నుంచి వస్తోందో అర్థం కావటంలేదు. సవారీ, కసరత్, గురిచూపి విసరడం లాంటివి చేస్తూ ఉంటుంది. స్త్రీలకు నేర్పుతుంది. పూజా, పురాణకాలక్షేపం, వచ్చిపోయేవారితో కాలక్షేపంతోపాటు నా పాటలు భజనలుకూడా వింటానికి ఆమె తీరిక చేసుకుంటారు.'

'ఇప్పుడామె ఘోషాకూడా వదలిపెట్టింది కదా! ఆవిడకి అడవుల్లోను, పర్వతాలమీద నదీనదులతీరాన తిరగటంలో ఏం సుఖం అవ్పింస్తోందో తెలియటం లేదు' అని నవాబు నవ్వాడు.

'మొదట నన్నుకూడా గుఱ్ఱపుస్వారీ నేర్చుకోమన్నారు. నాకు భయం వేసింది. కాని నెమ్మది నెమ్మదిగా, కాస్త నేర్చుకున్నాను.

'ఆడవాళ్లకు కూడా గుఱ్ఱపుస్వారీ నేర్పిస్తోందన్నమాట. మరి నువ్వు కూడా నేర్చుకున్నావా?'

'ఆ ! నేర్చుకుంటున్నాను.'

'దానివలన ఉపయోగం ఏమిటి ? ఆడవాళ్ళకి ఇంటి పనులతోనే తీరిక ఉండదు కదా !'

'కాస్త ఒంటికి వ్యాయామంలాంటిది లెండి ! అంతకు మించిన ఉపయోగం నాకేమీ కన్పించటంలేదు.'

సంభాషణాచాతుర్యంతో స్త్రీని ఓడించాలంటే ఆమెని పొగడటం అవసరమని అలీ బహదుర్ కనిపెట్టాడు.

'నీ ఆరోగ్యవంతమైన శరీరం, రూపము, రంగు చూస్తుంటే-మొదటి నుంచీ అసలే అందమైనదానివి, ఇంకా అందంగా కనపడటానికి కారణం గుఱ్ఱపుస్వారియే అనుకుంటాను.'

మోతీబాయి కాస్త ఓడినట్టుగా కన్పించింది. నవ్వి, ముడుచుకొని కళ్ళు మత్తుగా పెట్టి 'మహారాజులు చాలా గొప్పవారు' అంది.

'నేను అబద్ధం చెప్పటం లేదు' అన్నాడు నవాబు.

నవ్వి కాస్త సర్దుకొని జాగ్రత్తగా 'ఎవరెవరు రాణీ దగ్గరకు వస్తున్నారు? —వచ్చారు?'

మోతీబాయి 'చాలామంది వస్తున్నారు. బిఠూర్‌నుంచి తాంత్యా తోపే, కటీలీనుంచి జవాహర్‌సింహ్ రాజకుమారుడు, ఎక్కడనుంచో ఒక 'నాయకుడు' అబ్బో చాలామంది. ఇంకా పేర్లు గుర్తు రావటంలేదు. ఈసారి బాగా గుర్తుంచుకుంటాను' అని ఠకీమని సమాధానమిచ్చింది.

'తప్పకుండా ! నాకు చెపుతూండు. డబ్బులేమీ సంకోచించవద్దు.'

'తమదయ.'

'వచ్చిపోయే వాళ్ళగురించి, వాళ్ళు మాట్లాడుకున్న మాటలు ప్రస్తుతం ఏమయినా చెప్పుకోతగ్గ మాటలుంటే అవీ చెపుతూ ఉండు.'

'కొన్నిమాటలు గుర్తున్నయ్యండి చెప్పనా ?'

'తప్పకుండా జాగ్రత్తగా వింటాను.

'రాణీ పెంచుకున్న అబ్బాయికి ఉపనయనం చేయాలనుకుంటున్నారు. ప్రస్తుతం దానిని గురించిన చర్చ జరుగుతోంది.'

'అందరూ దీన్నిగురించే మాట్లాడుతున్నారా?'

'ఆ! ఎక్కడెక్కడివారిని గుర్తుంచుకొని పిలిపిస్తోంది. ఉపనయనం చాలా అట్టహాసంగా చేయాలని.'

కొంచె మాగి నవాబు 'ఇప్పుడెక్కడి కెడతావు? రాణీదగ్గరకా' అని అడిగాడు.

'ఆ! ఆమెకి భజన వినిపించి ఇంటికి వెళ్ళిపోతాను.'

కొంతసేపటికి మోతీబాయి రాణీ భవనానికి చేరుకుని. 'మీరా భజన విన్పించిన తర్వాత కాసేపు మాట్లాడాలి' అని రాణికి విన్నవించుకుంది.

అక్కడుంచిన ఆమె తంబురా మీటి మీరా భజన విన్పించి—

'తమరికి విరుద్ధంగా గూఢచారిత్వం జరుగుతోంది' అని చెప్పింది.

రాణీ చాలా శాంతంగా 'వారెవరు మోతీ' అని అడిగింది. మోతీ జరిగిందంతా చెప్పింది.

ఉపనయనాన్ని గురించి చెప్పి 'మోతీ! నీ తెలివిని చూస్తుంటే ఆశ్చర్యమేస్తోంది. దామోదరరావు ఉపనయనాన్నిగూర్చి ఇంకా ఏ విషయం బయటికి రాందే నీకెలా తెలిసింది? తప్పకుండా అట్టహాసంగా అవుతుందనుకో! ఎవరితోను చెప్పనుగూడా చెప్పలేదే!'

'రాణీ! తమరు ఒక రోజున యువరాజుతో నీకు ఉపనయనం జరుగుతుందని చెప్పారుగా! అది ఇప్పుడు గుర్తుకు వచ్చింది. పాచిక వేశాను.'

రాణీ నవ్వి 'నువ్వు ఖుదాబక్ష్‌ని గురించికూడా ఆరాతియ్యాలి' అంది.

మోతీ తలవంచి వినయంగా దృఢమైన స్వరంతో-'అమ్మా ఒకవేళ మీరు చెప్పింది చేస్తేనే నన్ను ఈ పనిలో ఉండనియ్యండి. లేకపోతే తీసెయ్యండి.'

'నాకు నీమీద నమ్మకం ఉంది. ఇనుము ఇనుముగానే రుజువు అవుతుంది. నీవు చేసేపనిలో నీపేరుంటుంది. సరేకాని జోహీ ఆంగ్లేయుల సేనలో ఎలా పనిచేస్తోందో చెప్పు.'

'అమ్మా అది రహస్యాలను కనుక్కుంటోంది.'

కాసేపాగి మోతీబాయి వెళ్లిపోయింది.

# 12

రాణీ గుఱ్ఱపుస్వారి మొదలుపెట్టిన దగ్గరనుంచి పురుషోచితమైన దుస్తులు వేసుకోవటం మొదలెట్టింది. తలమీద ఉక్కుటోపీ, జాకెట్ మీద గట్టిగా బిగించిన పై పంచ, పైజామా, దానిమీద గట్టిగా బిగించిన బెల్ట్, రెండు పక్కలా పిస్తోళ్లు, రెండు ఒరల్లో కత్తులు, అప్పుడప్పుడు చేతిలో బల్లెం- ఇదీ ఆమె వేషం. ఇవన్నీ బరువెక్కుతున్నా గుఱ్ఱాన్ని వేగంగానే పోనిస్తున్నది. తలమీద టోపీ పెట్టుకోవాలంటే జుట్టు చిక్కుపడి అడ్డం రావటంతో కాశీవెళ్ళి శిరోముండనం చేయించుకోవాలి, ఒకసారి కన్నభూమిని తిరిగి చూచి వచ్చినట్టుంటుంది - అనుకుంది.

డిప్యూటీ కమిషనర్ అనుమతి లేందే కాశీ వెళ్ళటానికి వీల్లేదని తెలిసింది. అనుమతికోసం గార్డన్‌ని కోరటం జరిగింది. అతను పట్టుదలగలవాడవటంతో అనుమతి ఇవ్వలేదు నెపంతో.

ఇది విని రాణీకి చాలా కోపం వచ్చింది.

'నేను భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినతర్వాత కాని శిరోముండనం చేయించుకోను - ఒకవేళ అలా జరగకపోతే స్మశానంలో అగ్నిదేవుడు ఆపని చేస్తాడు.'

ఆవిడ ప్రతిజ్ఞ విని చెలులంతా సంతోషించారు.

కాలం వేగంగా నడుస్తోంది. రాణీ ప్రణాళిక అభివృద్ధి చెందుతోంది. అక్కడేమేమి జరిగేది ఆవిడకి క్షణక్షణం తెలుస్తూనే ఉంది. ఆయుధాలు పోగు చెయ్యబడుతున్నాయి. ఇక్కడ రాణీకి విశ్వాసపాత్రులైనవారు కూడా చక్కగా పనిచేస్తుంటే అక్కడ నానాసాహెబ్, ఢిల్లీలో బహదుర్ షా,

అవధ్ వాసులపట్ల సానుభూతి చూపే నాయకులు తమతమపనుల్లో నిమ గ్నులై ఉన్నారు.

రాణీ ముఖ్యులైనవారిని పిలిపించవలసిన సమయం ఆసన్నమైందని గుర్తించింది. అందుకే దామోదరరావుకి ఉపనయనం చేయించడానికి నిశ్చయించుకుంది. దానికిగాను ఒక లక్షరూపాయల అంచనా వేయబడింది. ఆమె దగ్గర అంతడబ్బు లేదు. దామోదరరావుకి 7 వ సంవత్సరం వచ్చింది. ఈ వయస్సులో ఉపనయనం జరగడం తప్పనిసరైంది. అదీగాక వాళ్లు వేసుకున్న పథకాన్నిగురించి ఆలోచించి ఓ నిశ్చయానికి రావలసినసమయం ఇదే కనుక అందరిని సమావేశపరచటం అవసరం। ఆంగ్లేయులసేనలో ఉన్న భారతీయులలో అసంతృప్తి ప్రబలిందని మోతీబాయివాళ్ళద్వారా తెలిసింది.

రాణీ పురోహితుణ్ణి పిలిపించి ముహూర్తం పెట్టించి, గార్డన్‌కి దామోదరరావుపేర ఖజానాలో ఉంచిన 10 లక్షల రూపాయలలో ఉపనయనం కోసం ఓ లక్ష పంపమని కబురుచేసింది. గార్డన్ లేదనటానికి వీల్లేదని తెలుసుకున్నాడు. కాని పై అధికారులతో ఆలోచించి 'ఝాన్సీవాసు లెవరైనా నలుగురు గొప్ప ధనవంతులు బాధ్యత పుచ్చుకుంటే రూపాయలిస్తాము. ఎందుకంటే దామోదరరావు మేజరైనతరువాత డబ్బుకోసం అడిగితే జామీను ఉన్నవాళ్లయినా ఇయ్యాలి, లేదా రాణీ అన్నా ఇవ్వాలి' అని కబురుపెట్టాడు.

రాణీ బాధపడింది. నగరంలో అందరికీ చాలా కోపం వచ్చింది. ఝాన్సీలో అప్పుడు 62 మంది లక్షాధికారు లున్నారు. వారంతా జామీ నుండటానికి సిద్ధపడ్డారు. కొంతమందయితే 'ఆంగ్లేయుల్ని డబ్బు అడగాల్సిన అవసరం లేదు, మేమే ఇచ్చేవాళ్లం' అన్నారు.

కాని రాణీ తన డబ్బే కావాలని పట్టుపట్టింది. నలుగురు పెద్దమనుషులు జామీ నిచ్చారు.

అనుకున్న వేళకు ఉపనయనం జరిగింది. ఎక్కడెక్కడివారు వచ్చారు. నవాబ్ ఆలీ బహదుర్‌కూడా వచ్చాడు. అతనూ, అతనిలాంటివారిదగ్గర ప్రణాళికను గురించిన మాటలేవీ జరగకూడదు - జరుగలేదుకూడా. కేవలం ఉపనయనానికి సంబంధించిన మాటలుమాత్రమే వారితో జరపడమయింది. ఝాన్సీప్రజలు చాలా సంతోషంగా ఉపనయనాన్ని తిలకించారు. విందులు జరిగాక పాటలు పాడారు. తర్వాత ముఖ్యులైన కొద్దిమంది ఏకాంత మందిరం లోకి వెళ్ళారు. వాళ్లలో నానాసాహెబు, తాంత్యా తోపే, జవాహర్‌సింహ్, రఘునాథసింహ్, ఖుదాబక్ష్, చెలులు, ఆమెకు సన్నిహితులు వున్నారు.

'మీ అందరి సహాయ సహకారాలతో చిన్న యజ్ఞం పూర్తయింది. ఇంక ముఖ్యమైంది దీన్నిమించిన యజ్ఞం ఉంది. దానిని మనం జయప్రదం చేయాలి' అంది రాణి.

'మంచి పురుహితులతోపాటు శ్రేష్ఠమయిన సామాను కూర్చబడింది. యజ్ఞసామగ్రిని మోసేవాళ్లు, అశ్వమేధపు గుఱ్ఱాలుకూడా ఏర్పాటు చేయ బడ్డాయని' నానాసాహెబ్ అన్నాడు.

'సబబని తోస్తే నేను మామూలుభాషలో ఒకమాట చెప్పుతా' నన్నాడు తాంత్యా.

'ఆ! ఆ! ఎందుకు చెప్పకూడదు? అంతా మనమేగా. బయట ఆడ వాళ్లు గట్టి పహరా ఇస్తున్నారు' అంది రాణి.

'ఉత్తరహిందూదేశంలోను, తూర్పువైపున పని గట్టిగా జరుగుతోంది. ఆంగ్లేయులు కొవ్వుతో చేసిన తూటాలను నిలిపివేశారు. కాని దానిమూలంగా హిందూ-ముస్లింలలో పుట్టిన అసహ్యభావం, ఏవగింపు ఇంకా తగ్గలేదు.'

'కొవ్వుతో చేసిన తూటాలమూలంగా ముసల్మాను సిపాయిలలో చాలా క్రోధం చెలరేగింది. ఈ తూటలు ఎంతమాత్రం ఆపబడలేదు. ఇప్పుడు ప్రభుత్వం చర్య తీసికోవలసిన సమయం ఆసన్నమైందన్నాడు ఖుదాబక్ష్.

'మేము బుందేల్ ఖండ్‌నుంచి ఆరంభించటానికి తయారుగా ఉన్నాము' అన్నాడు రఘునాథసింహ్.

'ఇంకా మన సేన పూర్తిగా తయారుకాలేదు. అవగానే ఏదో ఒకేతేదీన ఒకే సమయంలో పని మొదలుపెట్టడం మంచిది' అన్నది రాణి. ప్రణాళికను గురించి పరిశీలన జరిగింది. రాణీమాటతో అందరూ ఏకీభవించారు. సభ సమాప్తమయింది.

తాంత్యా మోతీబాయి, జోహీలను విడివిడిగా కలిసికొని మాట్లాడాడు.

# 13

యూన్సీ, సైనిక దేరాల్లోకి జోహీ రాకపోక లెక్కువయ్యాయి. నృత్యగానా లతో ఎదుటివారిని మురిపింప చేస్తూండటం ఎక్కువైంది. తన పని సాను కూలం చేసుకోవటానికి సైన్యంలోని ప్రతి ఒక్క విభాగానికి చెందిన ఆఫీసర్లను జోహీ గుర్తు పెట్టుకుంది. ఆ ఆఫీసర్లకి ఒకానొకరోజు మహత్తర మైనపని చేయవలసి వుంటుందని తెలిసినా, అది ఎప్పుడు చెయ్యాలో తెలియదు. కాని జోహీని ఉపయోగించుకోడం ఆ 'మహత్తరమైన పని' యొక్క ప్రణాళికలో ఒక భాగమని వారు తెలుసుకున్నారు.

ఒక రోజు జోహీ నృత్యగానాలను చూసి ఆనందించడానికి కెప్టెన్ డన్‌లప్‌కూడా వచ్చాడు. డన్‌లప్ తన గూఢచారిద్వారా, దేరాల్లోకి వచ్చి తమ నృత్యగానాలతో ఆఫీసర్ల గుట్టులాగే నర్తకినులగురించి విని అది పరిశీలించడానికి వచ్చాడు.

డన్‌లప్‌ని చూడగానే జోహీ ఓ క్షణం గాభరా చెందింది. కాని అంత లోనే నిలదొక్కుకొని నాట్యం చేసింది. నాట్యమయినతర్వాత డన్‌లప్— 'నువ్వు ఈ శిబిరంవలన ఎన్ని డబ్బులు సంపాదిస్తున్నావు?' అని అడిగాడు.

'ఎంత దొరికితే అంతసార్' అని సమాధాన మిచ్చింది.

'పో ఇక్కణ్ణించి, ఇంకెప్పుడూ ఈ గుడారంలోకి రాకు.'

జోహీ మొహం విచారంగా పెట్టి బయటికెళ్ళింది. డన్‌లప్ చాటుకాగానే తనలోతాను నవ్వుకొంటూ లోపల్లోపల 'పిల్లవెధవా! ఎప్పుడో ఒకరోజు గుర్రమెక్కి తుపాకీ రుచి చూపిస్తాను' అనుకుంది.

'ఈ ఆడవాళ్ళని లోపలికి రానియ్యవద్దని' డన్‌లప్ సైనికులకి ఆజ్ఞ ఇచ్చి పోయాడు.

అతను వెళ్లగానే శ్రావ్యంగా పాటలుపాడే అందమైన ఆడవాళ్లకి జరిగిన అవమానం తమదిగా భావించి సైనికులు బాధపడ్డారు.

సాయంకాలమవగానే జోహీ లక్ష్మిబాయి దగ్గరకివచ్చి జరిగిందంతా వివరంగా చెప్పింది.

'సరే సమయం రానీ' అంది రాణి.

ఫిబ్రవరి నెల. వసంతఋతువు వచ్చింది. వెన్నెల వెళ్ళిపోయింది. చీకటిరాత్రి చల్లగాలి నెమ్మదినెమ్మదిగా వీస్తోంది. చుక్కలు మెరుస్తున్నాయి. రాణి నిద్రించేవేళయినా, నిద్ర రావటంలేదు. భవనానికి ఎదురుగా గ్రంథాలయం ఉంది. రాణి లేచి పక్కమీద కూర్చొని - వేదపురాణాలు, గీత, ఖురాన్, బైబిల్ అన్నీ వ్యర్థం కావలసిందేనా? అలా ఎన్నటికీ కాకూడదు, కాజాలదు. కృష్ణుడు అమరుడు, మనమంతా నిత్యం. భారతదేశంలో ఇంకా ఎంత శక్తి ఉందో, నేను శంకరుడిలా శౌర్యంతో ప్రవర్తించి చూపిస్తాను. ఒకవేళ నేను యుద్ధంలో చచ్చిపోయినా నన్నుమించిన యోధుడు, తపస్సంపన్నుడు ఈ భూమిని రక్షిస్తాడు - అని అనుకుంది.

పహరా ఇస్తున్న సైనికురాలు ద్వారందగ్గరికి వచ్చానన్నట్టుగా దగ్గింది, రాణీ పిల్చి 'ఏమిటి?' అని అడిగింది.

'మహారాణీ! మోతీబాయి వచ్చి తమతో ఒక్క అరగడియ మాట్లాడాలంటోంది' అని చెప్పింది.

రాణీ మోతీబాయిని పిలిచి కుర్చీ పీటమీద కూర్చోమంది.

మోతీబాయి జేబునుంచి ఒక ఉత్తరం తీసి చూడమని రాణి కిచ్చింది. దీపాలవెలుగులో రాణీ చదివింది—

—ఇంక నా వల్లకాదు. నే నాగలేను. ఇంకా ఎంతకాల మీ గుండె కోత! లే! లేచి ధర్మంకోసం తర్పణ ప్రారంభించు. కొద్దిమంది విదేశీయులు ఈ

విశాలమైన దేశాన్ని ఆక్రమించారు. వెళ్ళగొట్టు ! దేశాన్ని స్వతంత్రం చెయ్యి' అని ఉంది దాంట్లో.

'ఈ ఉత్తరం ఎక్కడ దొరికింది' అని అడిగింది రాణీ.

ఇటువంటి ఉత్తరాలు ఇవాళ గుడారానికి వచ్చాయని సాయంకాలం తెలిసింది. ఈ ఉత్తరాన్ని తాంత్యాప్రభువులు నా కిచ్చారు. వారు సాయంకాలం వచ్చారు. పొద్దున్నే వెళ్ళిపోతారు. తమ దర్శనం కోరుతున్నారని చెప్పింది మోతీబాయి.

రాణీ తెల్లటి చీరమీద ఒక తెల్లటి శాలువా కప్పుకొని బయటిగదిలోకి వచ్చింది. కుశలప్రశ్నలయ్యాక అసలుసంగతి కొచ్చారు - మోతీబాయికూడా అక్కడే ఉంది.

'తాంత్యా ! ఇలాంటి ఉత్తరాలు సమయంకాని సమయంలో వచ్చినట్టు కన్పిస్తున్నాయి కదా !' అంది రాణీ.

'అవును బాయిసాబ్ ! నిజం చెప్పారు. ఇంకా మనం పూర్తిగా సిద్ధమవనే లేదు. అనుకున్న టైమ్‌కి ముందే తెలిసిపోతే చాలా జననష్టం జరుగుతుంది. నేను అందుకే వచ్చాను. ఇప్పుడే దీన్ని నిలిపివేయండి.'

'అలాగే చేద్దాం. లక్ష్యసిద్ధికోసం సాధన, తగినసమయమూ చాలా అవసరం.'

'ఇప్పుడు డబ్బుకి కొదవేం లేదు. కొంతకాలంవరకు నిశ్చింతగా యుద్ధం చేయడానికి తగిన డబ్బుంది. శస్త్రాస్త్రాలు, మందుగుండు సామగ్రి పోగయింది. సాధ్యమైనంత త్వరగా ఫలానారోజు అని నిర్ణయిస్తే మంచిదేమోనని మీతో ఆలోచించడానికి వచ్చాను. మళ్ళీ తెల్లవారకమునుపే వెళ్ళిపోవాలి. ఢిల్లీ, లక్నో మొదలైనరాష్ట్రాలు మనతో ఏకీభవిస్తాయి.

'ఏ తారీకు నిర్ణయిద్దా'మని లక్ష్మీబాయి శాంతంగా అడిగింది.

'31 మే, ఆదివారం పగలు 11 గంటలకి.'

'3, 4 నెలఖుంది. తారీకు బాగానే ఉంది. దేశం మొత్తంమీద ఒకేసారి మొదలు పెడదామా?'

'ఆ! అన్నిచోట్లా ఒకేసారి. అప్పటిదాకా ఈ విషయాలన్నీ గోప్యంగా ఉంచాలని మనం ప్రజలకి, సైనికులకుకూడా చెప్పాలి.'

ఈ విషయాన్నిగురించి కాసేపు చర్చించినతర్వాత మోతీబాయి, తాంత్యా వెళ్ళిపోయారు. రాణి చాలాసేపటిదాకా ఆలోచించి ఆలస్యంగా నిద్రపోయింది.

# 14

ఎండలు మొదలైనాయి. సరసులన్నీ వికసించిన కమలాలతో నిండి పోయాయి. రైతులు పంట ఇంటికి తెచ్చుకున్నారు. వికసించిన కమలము, కడుపునింపే రొట్టె - ఈ రెండు స్వాతంత్ర్యయుద్ధానికి చిహ్నాలైనాయి.

భారతదేశంలో కమలం పువ్వు లన్నింటిలోనూ శ్రేష్ఠమైనదని వాడుక. సరస్వతీదేవి గొప్పతనం, లక్ష్మీదేవి నిండుతనం కమలపు పువ్వొడిలో రేకులలో ఎక్కడో అదృశ్యరూపంలో దాగి ఉంటుందట. అది హిందూ దేశపు ప్రగతికి, సంస్కృతికి పవిత్రమైన శుభసూచకమైన ప్రతీక. రంగు లేత ఎరుపు, అది క్రాంతి లక్షణం. ఆ క్రాంతితోనే మానవత్వానికి రక్ష కలగాలి.

కమలంతోపాటు రొట్టెకూడా అంత గొప్పతనాన్ని ఆపాదించుకున్నది. ఒక ఊరినుంచి మరో ఊరికి రొట్టె పంపబడుతూంటుంది. ఆ రెండో గ్రామంలో తయారుచేయబడ్డ రొట్టె మూడోగ్రామానికి పంపబడుతుంది. హిందూ ముస్లిములు ఈ మహాయజ్ఞంలో ఐకమత్యంతో పాల్గొంటున్నారు.

కమలం, రొట్టె, ఈ రెంటి ప్రయాణం ఇంకా పూర్తికాలేదు. అను కున్న తారీకుకు ముందుగానే మే 6 న మీరట్‌లో గల్లంతయింది. బెంగాల్ లోని బారక్‌పూర్ గుడారంలో దీనికిమునుపే అల్లరి జరిగింది.

మీరట్, ఢిల్లీలసైన్యం ఢిల్లీ ఎర్రకోటమీద అధికారం సంపాదించింది. బహదుర్ షాని భారత సమ్రాట్‌గా ప్రకటించింది. బహదుర్ షా గోవధ వెంటనే నిషేధించాడు. దానితోపాటు ఒకప్రకటన జారీ చేశాడు—

1. ప్రతి రాష్ట్రపరిపాలన వేరువేరుగా జరుగుతుంది. నేను మీ అందరి ప్రతినిధిగా మీ అందరి అనుమతితో పని చేస్తాను. నాకు వియం తృత్వం అక్కర్లేదు.

2. ఆంగ్లేయులు నాశనం చేసిన మనదేశపు వృత్తి, వ్యాపారాలు పున రుద్ధరించి తిరిగి పెంపొందింపబడతాయి.
3. ఎవరి మతాలను వారు నిర్భయంగా, స్వతంత్రంగా అవలంబించ వచ్చు.
4. ఆంగ్లేయులు పెద్దపదవులు మనవారికి (హిందూదేశస్థులకు) ఇవ్వటం లేదు. ఇది ఇకమీదట జరుగకూడదు.
5. న్యాయం అందరికీ ఒకటే।

మే నెలలో దాదాపు ఉత్తర భారతదేశమంతటా విప్లవాగ్ని వ్యాపించింది. ఒక రోజు ఒకచోటయితే మరో రోజు మరోచోట.

ఈ సంగతి ఝాన్సీలో ఉన్న డన్‌లప్‌కి తెలిసింది. రాణీకి అంతకు ముందే తెలుసు. ఆవిడ భవనంలోకి వచ్చే పోయే వారిసంఖ్య తగ్గించేసింది. ఏ కొద్దిమందినో రానిస్తోంది. వారిలో మోతీబాయికూడా ఉంది. మోతీద్వారా రాణి చాలా అవసరమైన, ముఖ్యమైన సమాచారాన్ని అందుకొంటుండేది, ఇస్తుండేది కూడాను. మోతీబాయి రఘునాథసింహ్, ఖుదాబక్ష్ లాంటివారితో సన్నిహితంగా సంబంధాలు జరుపుతూ ఉంది.

జూన్ 4న కాన్పూర్‌లోను, ఝాన్సీలోను విప్లవచిహ్నాలు పొడగట్టాయి. పెద్దకోటకి మైలు దూరంలో ఉన్న ఒక చిన్నకోటకి హవల్దారొకడు కొంత మంది సైనికులను తీసుకొని ప్రవేశించాడు. ఈ కోటని - వాళ్లు స్వంతంగా నిర్మించుకున్నారు గనుక ఆంగ్లేయులు 'స్టార్‌ఫోర్ట్' అని పిలిచేవారు. ఈ కోటలోకి ప్రవేశించిన సైనికులు సామాను, డబ్బు తీసుకుపోయారు. డన్‌లప్ కొంత సేనను వెంటబెట్టుకొని వాళ్ళని ఎదుర్కొన్నాడు. తారాగఢ్ (స్టార్ ఫోర్ట్)లోంచి పోయిన సామానేదీ పట్టుకోకుండానే తిరిగివచ్చాడు. కమిషనర్‌కీ సంగతి తెలియచెయ్యబడింది. ఆతని సలహాప్రకారం ఆంగ్లేయుల కుటుంబాలన్నీ పిల్లా-పాపాతోసహా కోటలోకి పోవటానికి తయారయ్యాయి.

వాళ్ళకి ఇప్పటికి రాణి పరాక్రమం. తేజం, యోగ్యత ధార్మికత గుర్తొచ్చాయి. గార్డన్ చాలామంది ఆంగ్లేయులను వెంటబెట్టుకొని రాణిదగ్గరకు వెళ్ళాడు.

'మాసేన కాస్తా చిందరవందరయింది. మాకేదైనా ఆపద సంభవిస్తే మీరు సహాయం చేయవలసిందని' అతను రాణికి ప్రార్థనాపూర్వకమైన ఒక ఉత్తరం పంపాడు.

'మా దగ్గరిప్పుడు తగినంత సైన్యంకాని, ఆయుధాలుకాని లేవు. మీరు ఒకవేళ ఒప్పుకుంటే, మాతో సహకరిస్తే, ప్రజారక్షణకోసం మంచి సేనను తయారుచేయవచ్చు' నని రాణి సమాధానం పంపించింది.

డన్‌లప్ ఒప్పుకున్నాడు. ముగ్గురు పెద్ద ఆంగ్లేయ అఫీసర్ల సమావేశం జరిగింది. సమావేశంలో అనుకున్న ప్రకారం డన్‌లప్ ఒక ఆంగ్ల సైనికుణ్ణి తీసుకొని శిబిరంలోకివెళ్ళి అక్కడున్న సైనికులను తిట్టడం మొదలు పెట్టాడు. దాంతో వాళ్లు రెచ్చిపోయారు. వాళ్ళ నాయకుడు రిసాల్‌దార్ కాలేఖాన్ డన్‌లప్‌ని పేల్చాడు. ఇది చూసి ఆంగ్లేయులు భయంతో దిక్కుతెలియక పారిపోవటం మొదలుపెట్టారు. గార్డన్ రాణీదగ్గరకి పరిగెత్తాడు. సుందర్ ద్వారా రాయబారం జరిగింది.

'పురుషులను గురించి మాకేం భయంలేదు. కాని పిల్లలకి స్త్రీలకు మీ భవనంలో ఆశ్రయమివ్వండి. వాళ్ళనుగురించే భయంగా ఉంది' అన్నాడు గార్డన్.

ముందర్ రాణీని వెనకముందు లాలోచించమనీ, విప్లవకారులు మన భవనంమీద విరుచుకుపడే అవకాశం ఉంది కనుక ఈ విషయంగురించి మీరు దూరంగా ఉండటం మంచిదనీ చెప్పింది.

రాణీ ముందర్‌తో 'మనయుద్ధం ఆంగ్లేయ పురుషులతో కాని స్త్రీలతో కాదు కదా! అయినా నేను సేనని అదుపులో పెట్టలేకపోతే వారికి నాయకత్వం

ఏం వహిస్తాను? గార్డన్‌తో పిల్లల్ని, స్త్రీలను ఇక్కడికి పంపమని చెప్పు' అని గట్టిగా నచ్చచెప్పింది.

ముందర్ చెప్పగానే వెంటనే స్త్రీలను, పిల్లల్ని భవనంలోకి ప్రవేశ పెట్టాడు. రాణీ వాళ్ళకి భోజనం ఏర్పాట్లుచేసి, వాళ్లని ఓదార్చింది.

కాని కమిషనర్‌కి కోపం రావటంమూలాన వారందరూ కోటకు పంప బడ్డారు. రాణి భవనంలో ఇద్దరో ముగ్గురో ఉన్నారు.

ఈ లోపల సిపాయిలు ధ్వంసమైన గుడారంలో చిక్కుకుని దాన్నించి బయటపడి కోటమీదకూడా విజయం పొందడానికి వెళ్ళారు. ఇదిచూసి గార్డన్ ప్రభృతులు కోటద్వారాలన్నీ మూయించారు. కాని సిపాయిలు చాలా మంది ఉన్నారు. వాళ్ళదగ్గర ఫిరంగులున్నాయి. కోటలో ఫిరంగుల్లేవు. యుద్ధంచేసేందుకు కాస్త సామానుంది. తినటానికయితే బొత్తిగా ఏమీలేవు.

నవాబ్ ఆలీ అదే సమయంలో పీర్ ఆలీతో 'అనుజ్ఞ అయితే ఓరఛా, దతియా జిల్లాలనుంచి సేనను పిలిపిస్తా'నని కబురుచేశాడు. ఆంగ్లేయ ఆఫీసర్లు తిరుగుబాటుదార్లు కొద్దిమందే ఉన్నారు కనుక తిరుగుబాటు అణిచి వేయబడుతుందని ప్రత్యుత్తరమిచ్చారు. పీర్‌ఆలీ ఈ విషయం ఖుదాబక్ష్‌కు తెలియచేశాడు. ఖుదాబక్ష్ మోతీబాయికి సమాచారమందచేసి, తను రఘు నాథసింహ్ దగ్గరకు వెళ్ళిపోయాడు.

మోతీబాయి రాణీనికలిసి 'సమయ మాసన్నమైంద'ని చెప్పి తనతో ఖుదాబక్ష్ చెప్పినవన్నీ చెప్పింది.

'అనుకున్న తారీకుకంటె ముందుగా జరగటం మూలాన కార్యక్రమ రూపమే మారిపోయింది. అయినా మనసేనని వెంటనే తయారుచేయవలసిన సమయం ఇదే! రఘునాథసింహ్‌కి కటీలీనుంచి జవాహరసింహ్‌ని పిలిపించ మని చెప్పు. వీలైనంతమంది విశ్వాసపాత్రులైన సిపాయీలను. ఇక్కడికి 8 మైళ్ళ దూరంలో ఉన్న 'రసీకా' దగ్గర పోగుచేసి అట్టెపెట్టమను

నా ఆజ్ఞ అయ్యేంతవరకు ఝాన్సీవైపుకు రావద్దని చెప్పు' అని చెప్పింది రాణి.

'రసీకా' అనే వూరు ఝాన్సీకి దక్షిణంగా ఉంది. దాని కిరువైపులా గుట్టలూ. పర్వతాలూ ఉన్నాయి.

మోతీ రఘునాథసింహ్‌కి రాణిగారి ఆజ్ఞ విన్పించింది. అతను ఖుదా బక్ష్‌ని తీసుకుని ఆ ఆజ్ఞను నిర్వర్తించడానికి వెళ్ళాడు.

ఆ రోజంతా సిపాయీలు కోటమీద దాడిచేస్తూనే ఉన్నారు. కాని మూసి ఉన్న కోటద్వారందగ్గర ఉన్న ఆంగ్లేయులు వారిమీద గుళ్ళవాన కురిపిస్తూ వారిని అక్కడనుంచి చెదరగొడుతున్నారు. రెండో రోజుకూడా యుద్ధం సాగుతూనే ఉంది. సాయంకాలానికి యుద్ధం కాస్త తగ్గుముఖం పట్టింది. ఆంగ్లేయుల దగ్గర తినటానికి ఏమీలేదు. వాళ్లు ఎలాగైతేనేం ఆ కబురు రాణికి అందచేశారు.

భవనంనుంచి కోటలోకి వెళ్ళేందుకు సొరంగం ఉంది. రాణి వెంటనే రెండు మణుగుల రొట్టెలు తయారుచేయించి కాశీబాయి, సుందర్, ముందర్ అనే చెలికత్తెలతో పంపుతూ-'మీకు సొరంగమార్గం తెలుసుగా? ఈ రొట్టెలు కోటలోకి చేరవెయ్యండి' అన్నది.

చెలికత్తెలకి రాణికున్నదయ తెలుసు. కాని ఆవిడ దయకు అంతులేదు. వాళ్ళకు ఆమె ఆజ్ఞ పాలించక తప్పలేదు.

కాశీబాయి నమ్రంగా అడిగింది. 'వీళ్ళకి మీరు ఎప్పటిదాకా ఇలా తిండి పెడుతూ ఉంటారు?'

రాణి ప్రేమగా 'మనసేన తయ్యారయేంతవరకు. తయారు కాగానే ఆంగ్లేయుల దగ్గరనుంచి ఆయుధాలు తీసుకొని వాళ్ళని సురక్షితమైన ప్రదేశంలో ఖైదుచేస్తాను' అంది.

ఆ ముగ్గురూ రొట్టెల మూటలు వీపునపెట్టుకొని సొరంగంగుండా కోట లోకి వచ్చారు. ముగ్గు రాంగ్లేయాఫీసర్లు వాళ్ళకి నమస్కరించారు. అక్కడ 'మార్టిన్' అనే ఆంగ్లేయు డొకడున్నాడు. అతను సొరంగమార్గం చూశాడు. సమయంచూసి బయటపడ్డాడు. అతను చాలా సంవత్సరాలు జీవించాడు. లక్ష్మీబాయి చూపించిన అపారమైన ఈ దయను గురించి అతను ఇంగ్లీషు పత్రికల్లో వివరంగా ప్రకటించాడు.

ఇప్పుడు యుద్ధం ముమ్మరంగా ఉంది. గార్డన్ ఉత్తరంవైపు ద్వారం పై కిటికీనుంచి తొంగిచూస్తూ గుళ్లు కురిపిస్తున్నాడు. సిపాయిలకి ఝాన్సీకి చెందిన ఒక విలుకాడు దొరికాడు. అతను ఒక రాయిచాటునుంచి గార్డన్ మీదికి బాణం వదిలాడు. గార్డన్ మెడమీద పడింది అది. అతను చచ్చి పోయాడు. ఆంగ్లేయుల్లో విచారం వ్యాపించింది.

అటువైపు రిసాల్‌దారే కాలేఖాన్ కోటకి ఉత్తర పశ్చిమాలుగా ఉన్న శంకర్‌గఢ్ అనే వైపునుంచి ఒత్తిడిచేసి తన సేనలోని ఒక భాగంతో కోటలోకి ప్రవేశించారు. ఆంగ్లేయులు తామెవరూ బ్రతకరని నిశ్చయం చేసుకొని ఆత్మసమర్పణ గావించుకున్నారు. కమిషనర్ కోట దక్షిణవైపు ద్వారం తెరిపించి 'మమ్మల్ని సాగర్ వెళ్ళిపోనివ్వండి' అన్నాడు. సిపాయిలు అందరినీ ఖైదు చేశారు. వాళ్ల నాయకుడు కాలేఖాన్ శిబిరానికి వెళ్ళి పోయాడు. కొంచెం సేపయినతర్వాత అక్కడి జైళ్ళ ఇన్‌స్పెక్టర్ బక్షిష్ ఆలీ వచ్చాడు. సిపాయిలతో అతను 'రిసాల్‌దార్ నాకు దోవలో కని పించాడు. వీళ్లందర్నీ ఝోకన్‌బాగ్ తీసుకెళ్లమని చెప్పార'న్నాడు.

ఝోకన్‌బాగ్ ఝాన్సీ రాజనగరుకు కాస్త దూరంలో ఉంది. సిపాయిలు వాళ్ళని అక్కడికి తీసుకువెళ్ళారు. బక్షిష్ ఆలీ - 'నన్ను ఈ కమిషనర్ చెప్పు మడమలతో కొట్టాడు. చూశారా ఏం జరిగిందో కాలేఖాన్ ఆజ్ఞ ఇచ్చాడు' అని వారందరినీ చూపించాడు. కాలేఖాన్ వచ్చి నిర్ఘాంత

పోయాడు. నుదురు కొట్టుకుని 'సరే అయిందేదో అయింది. ఇకముందు నాతో చెప్పకుండా ఏం చెయ్యద్దు. రాణి భవనానికి పదండి' అన్నాడు.

రక్తసిక్తమైన కత్తులతో సిపాయీలు రాణి భవనానికి వెళ్లారు. వారందరూ ఉద్రిక్తులై ఉన్నారు. వారి మనస్సంతా క్రోధంతోనూ, అసహ్యంతోనూ నిండి ఉన్నది. పిచ్చివాళ్ళలాగా ఉన్నారు. వారికంటె ముందుగా రాణి భవనంలోకి వారి హింసాకాండ గురించిన కబురు వెళ్ళింది. కాపలా వాడు ద్వారం మూసేశాడు.

సేనలోని కొంతమంది పట్టణాన్ని లూటీచేసే ఉద్దేశంలో ఉన్నారు. ఈ లోపల కాలేఖాన్ 'భగవంతుని ప్రపంచం వర్ధిల్లాలి. సామ్రాజ్యం వర్ధిల్లాలి. మహారాణీ లక్ష్మీబాయి వర్ధిల్లాలి' అనే నినాదం చెయ్యగానే సైనికులు ఆ నినాదం మళ్ళీమళ్ళీ చేశారు. భవనపుకిటికీ తెరుచుకుంది. చేతులు జోడించి లక్ష్మీబాయి. ఆమెవెనుక ఆయుధాస్త్రాలతో ఆమె చెలికత్తెలు కన్పించారు. లక్ష్మీబాయి రంగు గోధుమవన్నె. మెడలో వజ్రాలహారం. పెదవులు మూసుకునే ఉన్నాయి. సేన ప్రణామంచేసింది. రాణి నమస్కరించింది. నిశ్శబ్దంగా ఉండమని చేత్తో సంకేతం చేసింది.

బిగ్గరగా 'నువ్వా! రిసాల్‌దార్ కాలేఖాన్' అని అన్నది.

కాలేఖాన్ ముందుకువచ్చి ప్రణామంచేసి 'నేను తమ సేవకుణ్ణి కాలేఖాన్‌ని' అన్నాడు. రాణి తీక్ష్ణమైన దృష్టిని కాలేఖాన్ చూశాడు. కాలేఖాన్ కళ్లుమూసుకొని దృష్టిని, కిందకి వాల్చాడు. రాణి 'ఈ కత్తులకి రక్తం ఏమిటి' అని అడిగింది. కాలేఖాన్ జరిగిందంతా చెప్పాడు.

'ఇటువంటి పన్లుచేసి స్వరాజ్యాన్ని సంపాదించగలుగుతారా! సామ్రాజ్యం స్థాపించగలరా? చాలా ఘోరమైనపనిచేశారు' అంది రాణి.

కాలేఖాన్:- దేవీ!, రాణీ....

రాణి:- ఇంకా మీరు ఝాన్సీని లూటీచెయ్యాలని ఆలోచిస్తున్నారు.

కాలేఖాన్:-ప్రభువుల ఆజ్ఞను ధిక్కరించి మే మేమయినాచేస్తే ఫిరంగులతో మమ్మల్ని కాల్చెయండి.

రాణి:-నేను మిమ్మల్ని శిబిరానికెళ్లమని చెప్పుతున్నాను. వెళ్లండి. ఆలోచించినపిమ్మట మీరు ఇకముందేమి చెయ్యాలో సాయంకాలానికి కబురు చేస్తాను.'

కాలేఖాన్ సిపాయిలతో మాట్లాడుతున్నాడు వారితో మాట్లాడి రాణితో 'దేవీ! సిపాయిలు చాలా ఆకలిగా ఉన్నార'ని చెప్పాడు.

రాణి అంతా తెలుసుకుంది. ఆమె చాలా నిశితంగా ఆలోచించింది. 'మాదగ్గర ఆంగ్లేయు లేమీ డబ్బు ఉంచలేదు' అంది.

కాలేఖాన్:-దేవీ! మాదగ్గరేం లేదు. అందుకనే సిపాయిలు నగరంలో డబ్బుని కొల్లగొడుదా మనుకున్నారు.

రాణి తన మెడనుంచి ముత్యాలహారంతీసి కాలేఖాన్ దోసిట్లోకి విసిరేసి 'దీనితో మీ అవసరాలన్నీ తీరిపోతాయి. అల్లరీ అదీ ఏమీ చెయ్యకుండా తిన్నగా ఢిల్లీకి వెళ్ళండి. దోవలో ఎక్కడా దోపిడీలు అవీ చెయ్యద్దు. హిందువులకి గంగమీద ఒట్టు. ముసల్మానులకు వారి మతంమీద ఒట్టు' అన్నది.

వారంతా కృతజ్ఞతాపూర్వకంగా శిరస్సులను వంచారు. శాంతంగా శిబిరాని కెళ్ళిపోయారు. అక్కడనుంచి సైన్యపుసామగ్రి, ఫిరంగులు తీసుకొని ఢిల్లీకి బయలుదేరారు. కొద్దిమంది మాత్రం రాణిదగ్గర నౌకర్లుగా బతిమాలగా రాణి అందుకు అంగీకరించింది.

రాణి వెంటనే 'రక్సా' నుంచి దివాన్ జవాహర్‌సింహ్‌ని ససైన్యంగా పిలిపించింది. రాత్రికి జవాహర్‌సింహ్ సైన్యసమేతుడై వచ్చాడు. రాణి 'నగరం, కోట-ఈ రెంటి ఏర్పాట్లు చూడు. రేపు పగలు తరువాత కార్యక్రమం గురించి ఆలోచిద్దామని' కబురుచేసింది.

# 15

రాణీ లక్ష్మీబాయి ప్రణాళికానుసారం మరునాడు చాలామంది భవనంముందర పోగయ్యారు. సేనతోను, పరిపాలనతోను సంబంధమున్న చాలామంది సర్దారులు, జాగీర్దారులు, ప్రజానాయకులు, పంచాయతీ ప్రెసిడెంట్లు, షాహూకార్లు మొదలైనవారంతా వచ్చారు.

రాణి తెరచాటున కూర్చుంది.

'నిన్న అతికష్టంమీద మననగరం లూటీనుంచి బయటబడింది. సిపాయిలు ఇక్కడనుంచి వెళ్ళిపోయారు. బందిపోటుతనం, కొల్లగొట్టటం వంటివి ఎక్కువ కావచ్చుననేభయం లేకపోలేదు. ప్రజలకి ఏవిధమైన కష్టనష్టాలు కలుగకూడదని నా అభిప్రాయం. అందుకనే మిమ్మల్నందర్నీ ఇక్కడికి పిలిపించాను' అన్నది రాణి.

గార్డన్ శిరస్తాదారుకూడా అక్కడికి వచ్చాడు. అందరికంటె ముందు అతను మాట్లాడాడు—

'తిరుగుబాటు గురించి జబల్ కమిషనర్‌కి తెలియచేసి రాజ్యవ్యవహారాలన్నీ నిర్వహించబడితే మంచిది.'

వెంటనే దీన్ని ప్రతిఘటిస్తూ కూరగాయల వ్యాపారస్థుల నాయకుడు బిగ్గరగా 'మాకు పరాయివాళ్ళ పరిపాలన అక్కర్లేదు. మా మహారాణీ రాజ్యం చెయ్యాలి' అని అరిచాడు.

నూనె వ్యాపారస్థుల నాయకుడు 'మాకు మా పూర్వపురాజ్యం ఇయ్యాలి' అన్నాడు.

ఒక గొప్ప షాహూకారు 'ఎన్నినోములు, వ్రతాలుచేసిన తర్వాతో మా మహారాణి మా రాజ్యం నిర్వహించేసమయం వచ్చింది' అన్నాడు.

మాదిగల నాయకుడు 'మాకు పరదేశీయుల రాజ్యపాలన అక్కర్లేదు. మహారాణీ మాత్రమే రాజ్యం చెయ్యాలి' అన్నాడు.

మోరోపంత్ ప్రజల అభిప్రాయాన్ని సమర్థించాడు. వయోవృద్ధుడైనా చాలా ఆరోగ్యంగా దృఢంగా ఉన్న నానాభోపట్కర్ కూడా అక్కడే ఉన్నాడు. 'శిరస్తాదారు మాటగురించికూడా ఆలోచిద్దాము. కాని రాజ్య పరిపాలన కంతటికీ రాణి శాసకురాలిగా ఉండాలి. ప్రజలంతా తామంతా ఆమె ప్రజలమని దృఢంగా నిశ్చయించుకొని జీవనాల్ని సాగించాలి' అన్నాడాయన.

చాలా సంతోషంగా అక్కడున్న ప్రజలంతా ఈ అభిప్రాయంతో ఏకీభవించారు.

'మీరు నాకు అప్పగించిన ఈ భారాన్ని నేను సన్మానంగా భావిస్తాను. భగవంతుడి దయవలన అది నిర్వహించ గలుగుతాను' అన్నది రాణి.

బిగ్గరగా ప్రజలంతా జయజయధ్వానాలు చేశారు.

గులామ్ (బానిస) గౌస్‌ఖాన్ తోపచీ. రాజ్యానికి పూర్వకాలం నుంచీ ఫిరంగులుచేసి ఇచ్చేవాడు. అతను రాణిముందుకు వచ్చి నిలబడ్డాడు.

'గౌస్‌ఖాన్ నువ్వే ఫిరంగి చేసేవాళ్ళకు నాయకుడిగా నియమించ బడుతున్నావు. అన్నింటిని సరిగాచూసుకో! ఆంగ్లేయులు పాడుచేసిన మన ఫిరంగులను బాగుచెయ్యి' అంది రాణి.

గౌస్‌ఖాన్ గద్గదకంఠంతో 'తల్లీ! ఒక విన్నపం ఉంది' అన్నాడు.

రాణి:-ఏమిటది?

'తల్లీ! ఇవాళ మనకి చాలా శుభదినం. అందుకుగాను గౌరవ సూచకంగా ఫిరంగు ౨ కాల్చాలి.'

అక్కడున్న వారంతా ఏకగ్రీవంగా ఆమోదించారు.

కాసేపటికి నమస్కార సూచకంగా కొన్ని ఫిరంగులు పేల్చడానికి వీలుగా ఉన్నవి పేల్చబడ్డాయి. చాలా ఫిరంగులు ఆంగ్లేయులచేత పాడు చేయబడి పనికిరాకుండా పడి ఉన్నాయి.

ప్రజలంతా వెళ్ళిపోయిన తర్వాత రాణి తన సర్దారులతో పరామర్శ జరిపింది. కోటమీద కాషాయరంగు జండా ఎగురవేయబడింది. ఆ యా పదవులకు అధికారులు నియమింపబడ్డారు. లాలా బావూ బక్షికి జీతాలు పంచడం, ఫిరంగులు పోతపోసేపని అప్పజెప్పబడ్డాయి. ప్రధాన సేనానాయకుడుగా దివాన్ జవాహర్‌సింహ్ నియమింపబడ్డాడు. దివాన్ రఘునాథ సింహ్, మహమ్మద్ జమాఖాన్, ఖుదాబక్ష్ - ఈ ముగ్గురూ కర్నల్స్‌గా నియమింపబడ్డారు. అశ్వదళాన్ని స్వయంగా రాణి చూస్తుంది. తోడుగా సుందర్, ముందర్, కాశీబాయి కర్నల్స్‌గా ఉంటారు. గూఢచారి విభాగం అంతా మోతీబాయి అధీనంలో ఉంటుంది. జోహీ వారందరికీ ప్రతినిధి. పోలీసు సామాన్ల విభాగానికి, (పూర్వం ఈ పోలీసుల్ని కొత్వాల్ అనేవారు) దానధర్మాల విభాగానికి ఉద్యోగులను నియమించారు. ఉద్యోగులంతా తమతమ విధులను జాగ్రత్తగా నిర్వహించాలని రాణి ఆజ్ఞ జారీ చేసింది.

రెండవ రోజునుంచి అశ్విక, పదాతి దళాలకి కవాతుచేయడం, గురి చూసి కొట్టడం మొదలయినవిద్యల్లో సాధన మొదలైంది. విజిల్ ఊద బడింది. సరియైనవేళకు పని జరగటం మొదలెట్టింది. సేనలోకి పూర్వపు సైనికులుకూడా వచ్చి చేరాయి. కొత్తవాళ్లు చాలామంది వచ్చిచేరారు. అన్ని జాతులవారు, అన్ని వర్గాలవారు సేనలోకి తీసుకోబడ్డారు. సైన్యాన్ని ప్రజలంతా తమదిగా భావించాలని రాణి ఆదేశించింది.

ఝాన్సీ రాజ్యాన్ని వశపర్చుకున్నతర్వాత ఆంగ్లేయులు దాదాపు ఫిరంగులన్నిటి చీలలు ఊడదీసి పనికిరానివిగా చేశారు. వీటిల్లో ఒకదానిపేరు

భవానీశంకర్. దీన్ని ఓర్ఛా రాజా ఉదేత్‌సింహ్ 1781 లో పోత పోయించాడు. దాన్ని తయారుచేసినవాడు జయరామ్ అనే పనివాడు. గులామ్ గౌస్ ఖాన్ రెండురోజుల్లోపల ఫిరంగులన్నింటిని బాగుచేశాడు. ఆయుధాల తయారీ కూడా మొదలయింది. ఇదీ ఒకందుకు మంచిదిగానే కన్పించింది. ఎందుకంటే రాజ్యారోహణ తర్వాత సరిగా అయిదురోజులకు ఝాన్సీనుంచి 20 మైళ్ల దూరాన ఉన్న కరేరా కోటమీద సదాశివరామ్ బాల్‌కర్ అనే సర్దారు ఆక్రమణ జరుపుతున్నాడు. మోతీబాయి రాణికి ఈ సమాచారం అందచేసింది. సదాశివరావు రాజా గంగాధరరావు వంశీకుడు. దూరం బంధువు. అతను తనని ఝాన్సీకి రాజుగా ప్రకటించుకున్నాడు. అతను ఝాన్సీలో ఉంటూండేవాడు. సిపాయిల విద్రోహపు చర్యలప్పుడు బయటకు వెళ్ళిపోయాడు. సదాశివరావు లక్ష్మీబాయిని కేవలం స్త్రీగా తలచి ఏంచేస్తుంది లెమ్మనట్లున్నాడు. తనకి పట్టాభిషేకం చేయించుకున్నాడు. మహారాజా సదాశివరావుగా తనకి తాను ప్రకటించుకున్నాడు.

రాణి ఈ వార్త వింటూనే తయారై పోయింది. ఆమె సేన ఇంకా శిక్షణ పూర్తిగా పొందలేదు. అయితేనేం నాయకులు చతురులు. వెంటనే కరేరా వైపు ప్రయాణం సాగింది. ప్రయాణం అయ్యేముందు రాణి తన ముగ్గురు కర్నల్ చెలికత్తెలతో నవ్వి 'మీ కర్నల్స్ ముగ్గురి పరీక్ష మహారాజా సదాశివరావు ముందు జరుగుతుంది' అంది.

'మహారాజుగారు మా జనరల్ పేరు విని పారిపోకుండా ఉన్నట్ల యితే' అంది ముందర్. రాణి ముత్యాలకాంతి వెదజల్లినట్లుగా నవ్వింది.

'నేను వెనకే ఉంటాను. మీరు ముందుకు వెళ్ళి అతన్ని ఎదుర్కొనండి' అంది రాణి.

'బాయిసాబ్ ! ఆ వేళకి మీ గుఱ్ఱం ఒప్పుకోకపోవటమో, మీరు ఒప్పుకోకపోవటమో జరుగుతుంది.'

రాణి తన సేనతో ప్రయాణం చాల వేగంగా చేసింది. అశ్వికదళాన్ని వెంటపెట్టుకొని మహారాజా సదాశివరావుకి యుద్ధం చేసే వ్యవధికూడా లేకుండా ఉండేటట్లు వెళ్ళింది. రాణీ వెడుతూనే కోటని చుట్టు ముట్టడించ దంతో సదాశివరావు కష్టంమీద ప్రాణాలు కాపాడుకోవడానికి పారిపోయాడు. సింధియా రాజ్యంలోకి వెళ్ళి ఆ రాజుని సహాయం చెయ్యమని యాచించాడు. 'నేను అంగ్లేయులతరఫున ప్రతినిధిగా పనిచేస్తున్నాను' అని చెప్పాడు. సింధియారాజు మైనర్. అతని మంత్రి కొంత సేనను పంపాడు కాని అది ఓడిపోయింది. రాణి సింధియావెళ్ళి సదాశివరావుని పట్టుకొని బంధించింది.

రాణి పరాక్రమం ప్రజలలో చాలావరకు వ్యాపించింది.

# 16

వింధ్యఖండ్‌లోని మొత్తం ప్రజలలో కల్లోలం బయలుదేరింది. ఇక్కడి ప్రజలు ఎప్పుడూ అత్యాచారాలను చేసే శాసకుణ్ణి అంత తేలికగా ఒప్పుకో లేదు. వింధ్యఖండ్‌లో చిన్నచిన్నరాష్ట్రాలు ఎక్కువ. వీనిలో రెండు విప్లవ దళంలో చేరాయి. బాన్‌పుర్ ఒకటి, రెండవది శాహీగఢ్. బాన్‌పురికి రాజు రాజామర్దన్‌సింహ్. శాహీగఢ్‌కి రాజు బఖ్తబలీ. ఇద్దరికీ లక్ష్మీబాయి, విప్లవంలో పాల్గొనమని ఉత్తరం రాసింది. వారు అందుకు సమ్మతించారు.

ఇదేవిధంగా ఆమె చాలా రాష్ట్రాలకి ఉత్తరాలు పంపింది. కొన్ని పెద్ద రాష్ట్రాల రాజులు మైనర్లు. కొంతమంది ఆంగ్లేయుల అధీనంలో ఉన్న వారు. ఈవిధంగా రాణి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే పరిపాలనా విషయాలనుగురించి ఉద్యోగస్థులతో సమావేశాలు జరుపుతూ అప్పుడప్పుడు కచేరీకూడా నడుపుతూవుండేది. చాలా ముఖ్యమైన కేసులను తను స్వయంగా విని తత్‌క్షణమే తీర్పు చెప్పుతూండేది. అప్పుడప్పుడు తను స్వయంగా పిల్లల్ని, స్త్రీలను బాధించినవారిని దండిస్తూ ఉండేది. కచేరిలో ఇనుపటోపీ మీద ఎఱ్ఱని పట్టు రుమాలు కట్టుకుని కూర్చుండేది.

వర్షాలు చాలా ఆలస్యంగా కురిసినా బ్రహ్మాండంగామాత్రం కురిసాయి. అయినా వారి కార్యక్రమాల కేమీ అంతరాయం కలగలేదు. ఆ రోజు వర్షం కురిసినరోజు - సాగరసింహ్ అనే బందిపోటు దొంగ చాలా ఉధృతాన్ని కలిగించాడని రాణి విన్నది. అతను బరవాసాగర్‌నుంచి 5, 6 మైళ్ళ దూరంలో ఉన్న రావల్‌గావ్ అనే ఊరిలో ఉండేవాడు. బరవాసాగర్ ఝాన్సీకి తూర్పుగా 12 మైళ్ళ దూరాన ఉన్నది. రాణి మోతీబాయితో చెప్పి ఖుదాబక్ష్‌ను వెంటనే పిలిపించింది.

'నువ్వు ఇప్పుడే 25 మంది సైనికులతో వెళ్ళి సాగరసింహ్‌ని ప్రాణా లతోగాని, ప్రాణాలు తీసిగాని పట్టుకురా' అని రాణి ఖుదాబక్ష్‌కి ఆజ్ఞ ఇచ్చింది.

ఖుదాబక్ష్ తలవంచి చేతులు జోడించి నిలబడగానే 'ఈ పని ఎన్ని రోజుల్లో పూర్తి చెయ్యగలవు ? ఒక నెలలోనా ?' అన్నది రాణి.

'తల్లీ ! సాధ్యమైనంత తొందరగా చేస్తాము. కాని వర్షం మూలంగా కాస్త కష్టమవుతుంది.'

'సాగరసింహ్ ఇంతవర్షాల్లో అడవిలో ఉండడు. తన కేంద్రంలోనో, ఇంట్లోనో ఉంటాడు. ఇంకా కొంతమంది సిపాయిలు కావాలా ?'

'అక్కర్లేదు తల్లీ, వీళ్లు చాలు' అంటూ ఖుదాబక్ష్ వెళ్ళిపోయాడు.

రాణి ఏకాంత మందిరంలోకి వెళ్లి తన చెలులను 'బాగా వర్షం కురి సేప్పుడు గుఱ్ఱం నీళ్ళలో పరిగెత్తగలదా !' అని అడిగింది.

'ఒకవేళ ఖుదాబక్ష్‌కి సాగరసింహ్ దొరకనట్లయితే మనం బరూసాగర్ వెళ్లటమో లేదా, ఖుదాబక్ష్ ఏ సంగతీ చెప్పినతర్వాత నిశ్చయించాలి.'

ఖుదాబక్ష్ ఆరోజే వెళ్లిపోయాడు. బరవాసాగర్ వెళ్ళి అక్కడి ఠాణే దార్‌తో మాట్లాడాడు. సాగరసింహ్ చాలా సాహసవంతుడు, మొనగాడు. అతని అనుచరులు చేసిన దుష్కృత్యాల సంఖ్య, దోపిడీల సంఖ్యకూడా చాలా ఎక్కువగా ఉండేది.

రెండవరోజు వాన కాస్త తెరిపిచ్చింది.

ఖుదాబక్ష్ బరవాసాగర్ ఠాణేదారుతో కొంతమంది సిపాయిలను జాగ్రత్తగా తాను కాపలాగా ఉంటూ సాగరసింహ్‌మీద దాడి చెయ్యటానికి రావల్‌కి వెళ్లాడు. దోవ సరిగాలేదు. మధ్యాహ్నానికి అంతా అక్కడికి చేరారు. సాగర సింహ్ ఇంట్లోనే ఉన్నాడు. భవనమని చెప్పబడుతున్న ఇల్లు ఒక ఎత్తైన పర్వతంమీద ఉంది. అన్నంతిని అతను కునుకు తీస్తుండగా ఖుదాబక్ష్

అతనిమీద దాడిచేశాడు. సాగరసింహ్ తన ద్వారాన్ని మూసివేశాడు. అతని ఇంట్లో కొంతమంది అనుచరులున్నారు. రెండువైపులనుంచి తుపాకీలు పేలుతున్నాయి. ఖుదాబక్ష్ అనుచరులు కొంతమంది గాయపడ్డారు. ఇంటి మీద దాడిచెయ్యమని తన అనుచరులకు ఆజ్ఞయిచ్చి వారితోపాటు తాను వెళ్ళాడు. తుపాకులు పనికిరాలేదు. సాగరసింహ్ కత్తితీసుకువచ్చాడు. ఖుదాబక్ష్ అతని అనుచరులు ముంగిట్లోకి ఉరికారు. ఖుదాబక్ష్ కత్తియుద్ధంలో గాయపడి కిందపడిపోయాడు. సాగరసింహ్ తన అనుచరులతో ద్వారం తెరిచి పారిపోయాడు.

ఖుదాబక్ష్ గాయం ఏమంత పెద్దది కాకపోయినప్పటికీ రక్తం ఎక్కువగా కారుతోంది. స్పృహతప్పి పడిపోయాడు. ఠాణేదారు ఎద్దుబండి మాట్లాడాడు. వారంతా సాయంకాల మయ్యేసరికి బరవాసాగర్ వెళ్ళిపోయారు. ఆ రాత్రి గాయాలకు పట్టీవేశారు. మరునాడు ఉదయం ఈ సంఘటనను గురించి ఝాన్సీకి కబురు అందింది. ఆ రోజు మబ్బుగా ఉంది చల్లటిగాలి వీస్తోంది. వాన తుంపర తుంపరగా పడుతూనే ఉంది. ఆ సమయంలో రాణి కళ్ళు మూసుకొని మోతీబాయి భజన వింటోంది. అప్పటిదాకా జాగ్రత్తగా మేలుకొన్న ముందర్ గోడకానుకొని కునుకు తీస్తోంది. సుందర్ ఆవలిస్తోంది. భజన అయిపోగానే రాణి ధ్యానం చెదిరింది. సుందర్ ఆవలింతలు, ముందర్ నిద్రామగ్నత చూసింది. నవ్వుతూ—చూడు సుందర్ 'ఆ ఎలుగుబంటి ఎక్కడనుంచి వస్తోంది' అంది. సుందర్ గాబరా పడుతూ లేచింది. కనుబొమ్మలు ముడేసి 'ఏది ఎక్కడుంది ఎలుగుబంటి బాయీసాబ్' అంది.

'ఎలుగుబంటి వెతికితేగాని, దొరకితేగాని కనపడని అసామాన్యమైంది' సుందర్ సిగ్గుపడి చేతులు జోడించి 'తల్లీ! పగలంతా అలిసి ఉండటం మూలాన కాస్త నిద్రపట్టింది' అంది.

అదే సమయానికి కాపలావాడు బరవాసాగర్ నుంచి అర్జంటైన వార్త వచ్చిందని చెప్పాడు.

రాణి ఇంకోగదిలోకి ఆ వార్త తెచ్చినవాణ్ణి పిలిచింది. అక్కడ మోతీ బాయి, ఇంకా కొంతమంది చెలికత్తెలున్నారు.

'తల్లీ! రావలీ దొంగల నాయకునికి, ఖుదాబక్ష్ సర్దారుకి నిన్న యుద్ధం జరిగింది. వారు, మరి ఏడుగురు సిపాయిలు గాయపడ్డారు. సర్దారుకి కత్తి గాయాలు తగిలాయి. సిపాయిలకి గుళ్ళదెబ్బలు తగిలాయి. ప్రాణాపాయం ఎవరికీ లేదు. సాగరసింహ్ ఇంటిమీద దండెత్తారు. అతను పారిపోయాడు. గాయాలకి మలాం పట్టీలు వేశారు' అని చెప్పాడు వార్తాహరుడు.

మోతీబాయి మొహం పాలిపోయింది.

ఖుదాబక్ష్‌కి దెబ్బ ఎక్కడ తగిలిందని రాణి అడిగింది.

'చేతులకు, తొడలకు తగిలాయి. సిపాయిలకు గాయాలు కాస్త బాగానే తగిలాయి.'

'త్వరలోనే కష్టాలుతీరే ఉపాయం ఆలోచిస్తాం' అని రాణి అతనికి సెల విచ్చింది. మోతీబాయి వాళ్ళంతా మళ్ళీ తమగదిలోకి వచ్చారు. రాణి రేపు బరవాసాగర్ వెళ్ళాలంది.

కాశీబాయి వినయంగా 'బాయీసాబ్! బేతవానదికి వరదవచ్చింది. ఇంకా వర్షం వచ్చేసూచనలు ఉన్నాయి. మేము వెళ్ళివస్తాం. మీరిక్కడే ఉండండి' అంది.

మోతీబాయి విచారంగా ఉండటం రాణి గమనించింది. దానికి కారణం తెలుసుకుంది. అదీగాక ఆవిడ స్వభావసిద్ధమైన ప్రతాపం ఉప్పొంగింది.

'మన కర్తవ్యాన్ని నిర్వర్తించటం మన విధి. ఏనుగులమీద వెళ్ళవచ్చు. కాని గుర్రాలయితే త్వరగా పరుగెత్తుతాయికదా!' అంది రాణి.

కాశీబాయి:-ప్రభువులు చక్కగా చెప్పారు. నేనుకూడా వెంటవస్తాను.

మోతీబాయి:-అనుజ్ఞ అయితే నేనుకూడా వస్తాను.

రాణి:-నదిలో వరదమూలంగా పడవ నడవకపోతే గుఱ్ఱపుస్వారీ చెయ్యాల్సి ఉంటుంది.

మోతీబాయి:-ప్రభువుల సేవలో ఉంటూ కాస్త నేర్చుకున్నాను. పీళ్లగిళ్లు అంటే ఏమీ భయంలేదు.

రాణి తన చెలులందరి కోర్కెలను మన్నించింది.

రాత్రి వానకాస్త కురుస్తోంది. తెల్లవారుఝాము అయిన తర్వాత కాస్త తెరపిచ్చింది. రాణి చెలులతోకూడా గుఱ్ఱాలమీద 25 మంది అశ్వికులను వెంటబెట్టుకొని వెళ్లింది.

బేతవా నదీతీరానికి వెళ్లేసరికి అది ఉధృతంగా పొంగుతోంది. గాలివీచే లక్షణంచూస్తే తుపాను వచ్చేటట్లుగా ఉంది. పల్లెవాళ్ళకి పడవెయ్యటం చేతకాని పని. చాలామంది అశ్వికులు వికల మనస్కులయ్యారు.

అవతలపక్క పర్వతపంక్తులు పచ్చని అడవులతో నిండి ఉన్నాయి. తెల్లని మేఘమాలికలు పర్వతశిఖరాలను, పచ్చని అడవులను తాకుతూ పోతున్నాయి. బేతవానది వరదచప్పుడు తుపానుగాలితో కలిసి మేఘమాలికలను అభినందిస్తున్నట్టుగా ఉంది.

రాణి 'దూకండి' అందీ. అందరికంటె ముందుగా తాను దూకింది. వెంట చెలులు, అశ్వికదళం ధారని చీల్చుకుంటూ పరుగెత్తించారు. రాణి అందరికంటె ముందుంది. బేతవా నదీప్రవాహం పుంజలు పుంజలుగా అడ్డూ అపూ లేకుండా నురుగులుకక్కుతూ బుడగలుతేలుతూ ప్రవహిస్తోంది. నురుగు పెద్దరాశిలా ప్రవహిస్తోంది. గుఱ్ఱాలు కళ్లు పెద్దవిచేసి ముక్కుతాళ్లతో ప్రవాహాన్ని చీల్చుకుంటూ ముందుకు పరుగెత్తుతున్నాయి. అశ్వికులచుట్టూ తుమ్మెదలు ఎగురుతున్నాయి. రాణిని ఆవిడ చెలులను ముందుకు సాగటం

చూపిన అశ్వికులు రెట్టింపు ఉత్సాహంతో తామకూడా త్వరగా వరుగెత్తు తున్నారు.

ప్రవాహంలో పొదలు, తుక్కు అంతా కొట్టుకొస్తోంది. రాణి వీపుమీద అలల మరుగుతో ఇవికూడా చిక్కుకోవటం మొదలుపెట్టాయి. అయినా ఆమె లక్ష్యపెట్టక తన అనుచరులను ప్రోత్సహిస్తూ మెచ్చుకుంటూ ముందుకు పొగుతోంది. పర్వతశిఖరాలకు కాస్త కిందుగా తెల్లని కొంగల పంక్తులు కన్పించాయి. అంత కష్టంలోను లక్ష్మీబాయి అనుచరులు వాటిని చూపి సరదాపడ్డారు. ఆ ఉధృత ప్రవాహానికి కాస్త దూరంలో తీరం కన్పించింది.

రాణి బిగ్గరగా 'చూశారా ఒడ్డు వచ్చేసింది. ఆశ్రయం చిక్కింది.'

కొంచెం సేపట్లోనే సేనంతా నది దాటింది. అంతా తడిసిపోయారు. కాని జాగ్రత్తగా ఉండటంమూలాన వీపున ఉన్న ఆయుధాలు తడవలేదు. ఒడ్డుకు చేరి అంతా బట్టలు మార్చుకుంటూ, ఎండపెట్టుకుంటూ కాసే పున్నారు. గుఱ్ఱాలకు కాస్త విశ్రాంతి నిచ్చారు. తిరిగి తొందరగా బయలుదేరి దాదాపు మధ్యాహ్న మయ్యేసరికి బరవాసాగర్ వెళ్ళారు.

బరవాసాగర్ కోట విశాలమైన చెరువుమీద నిర్మించబడింది. దీన్ని కొన్నివందల సంవత్సరాలకు పూర్వం చందేలులు కట్టించారు. శిథిల మవు తున్న దీనిని ఓరఛారాజు రాజా వీరసింహ్‌దేవ్ పునరుద్ధరించి కొండమీద కట్టించాడు. కాస్తదూరంలో బరవా అనే పెద్ద కాలువ ఒకటి ఉంది. దాన్ని ఆపేసి కట్టకట్టారు.

ఖుదాబక్ష్, అనుచరులూ కోటలో పడి ఉన్నారు.

# 17

రాణి వెంటనే గాయపడినవా రందరినీ పరిశీలించింది. వారి శిరస్సులమీద చేతులువేసి నిమిరింది. మలాం పట్టీలు సరిగా ఉన్నాయో లేవోనని చూసింది. రాణి ప్రేమాభిమానులకు సైనికులు ముగ్ధులయ్యారు.

రాణి ఖుదాబక్ష్ దగ్గరకు చేరగానే అతను చిన్న మంచంమీదినుంచి లేవటానికి ప్రయత్నించాడు, కాని లేవలేకపోయాడు. రాణి అతని తలమీద చేయి ఉంచింది. దగ్గరలో ఉన్న కుర్చీ పీటమీద కూర్చుంది. చెలులు వెనక నుంచున్నారు. మోతీబాయి ఆమె వెనకనుంచి ఖుదాబక్ష్‌ను అదేపనిగా రెప్ప వెయ్యకుండా చూస్తోంది.

ఖుదాబక్ష్ ఉండుండి సాగరసింహ్‌మీదకు దండెత్తిన సంగతి, అవీ చెప్పాడు.

'ఇప్పు డతను ఎక్కడున్నాడో తెలిసిందా ?' అని అడిగింది రాణి.

'రాణీ ! గ్రామస్థులు భయంతో ఏమీ చెప్పటంలేదు. కాని పక్కనున్న అడవిలో తన అనుచరులతో ఉన్నాడని తెలిసింది.'

'పర్వాలేదు, అతని సంగతి నేను చూస్తాను. బాధపడకు.'

'ప్రభువులు ఇక్కడికి వచ్చినతర్వాత బాధపడాల్సిన పని లేదు. రేపో, మాపో నా గాయం మానిపోతుంది. మీ వెనకే ఉంటాను' అన్నాడు.

రాణి అతన్ని విశ్రాంతి తీసుకోమని చెప్పి వెళ్ళిపోయింది. మోతీబాయిని అతనిని కనిపెట్టి ఉండమని చెప్పింది.

మోతీబాయికి కళ్ళవెంట ధారాపాతంగా నీళ్లు వస్తున్నాయి. ఏదో చెప్పాలనుకుంటున్నది. కంఠం పెగలటం లేదు. ఖుదాబక్ష్ చూశాడు. 'అరే ! ఎందుకీ కన్నీళ్లు. నువ్వు గర్వించాలి, సంతోషించాలి. ఎందుకంటే నీ ఖైదీ,

అహం, కాదు మహారాణీ ప్రభువుల సేవకుడు కాస్తయినా పని చేయగలిగి నందులకు' అన్నాడు.

మోతీబాయి కళ్లు తుడుచుకొని 'నెప్పి ఎలా ఉంది' అని అడిగింది.

'ఏమీ లేదు - అమ్మ నా తలమీద చేయివేసి నిమిరి అమృతం కురిపించింది. ప్రభువులు గాయం బాగయ్యేవరకు ఇక్కడ ఉండరేమో!'

మోతీబాయి:-ప్రభువులు ఇప్పుడు బందిపోట్ల ఆచూకీ తీస్తున్నారు.

'వస్తూనే పని మొదలుపెట్టారన్నమాట. మీ రెంత ధన్యులు మహారాణీ!'

'ఎక్కువ మాట్లాడకు, నేను పట్టీ వేస్తాను.'

అతడు స్నేహపూరితమైన కృతజ్ఞతతో అంగీకరించాడు.

సాయంకాలానికి కాస్త ముందుగా గ్రామనాయకుడు పంచాయతీ ప్రెసిడెంటు రాణీని కలవడానికి వచ్చారు. వారు ఆచారప్రకారం వందనం చేశారు. రాణిని కుశలప్రశ్న లడిగారు.

ఠాణేదారుకూడా వాళ్ళతో వచ్చాడు. సాగరసింహ్, అతని అనుచరులు బరవాసాగర్‌కు 12 మైళ్ళ దూరంలో ఉన్న ఖిసినీ అనే అడవిలో దాక్కున్నారని అతను సమాచారం అందచేశాడు. రాణి 'పొద్దున్నే ఎనిమిది గంటలకల్లా తయారుగా ఉండు, కాని ఎవ్వరికీ తెలియనివ్వకు'మని చెప్పింది. రెండవరోజు ఎనిమిది గంటలకల్లా అంతా తయారయ్యారు. తక్కిన చెలులతోపాటు మోతీబాయికూడా వస్తానని పట్టు పట్టింది. ఖుదాబక్ష్‌కి మలాం పట్టీ వేయటం అయింది. అతను కాస్త కులాసాగానే ఉన్నాడు. రాణి ఒప్పుకుంది. ఆశ్వికులను తీసుకొని వెళ్ళింది.

ఆమె తన సేనని రెండు భాగాలుగా చేసింది. వెంట రఘునాథసింహ్ కూడా వచ్చాడు. ఒక భాగాన్ని అతని నాయకత్వంలో రావలీగ్రామం వెళ్ళమనీ ఆజ్ఞ ఇచ్చింది. రెండోభాగాన్ని తీసుకొని తను ఖిసినీ అడవివైపు వెళ్లింది.

రఘునాథసింహ్, సాగరసింహ్ భవనాన్ని చుట్టుముట్టారు. కాని అత నక్కడ లేడని తెలిసింది. వెంటనే ఈ వార్త రాణికి అందజేయబడింది. ఇంక అతను ఖిపిసీ అడవిలో వున్నాడని రాణి ధ్రువంగా తెలుసుకుంది. అతన్ని ఎలా చుట్టుముట్టాలో పథకం వేయటం ప్రారంభించారు. వివరాలు తెలుసుకోటానికి ఒక గూఢచారిని ముందే పంపారు.

ఓ గంటయినతర్వాత 'రెండు కొండచరియలమధ్య ఆకులతో కుటీరం ఏర్పరుచ్చుకొని. దొంగ భోజనంచేసే ప్రయత్నంలో ఉన్నాడు. అతని దగ్గర కొన్ని గుఱ్ఱాలున్నాయి' అని గూఢచారి కబురు పెట్టాడు.

రాణి రెండు కొండలమీద ఎత్తైన ప్రదేశంలో తుపాకులు పెట్టింది. కొండచరియమీదకి కొంతమంది సిపాయిలను పంపింది. పై భాగం ఎక్కువ దూరం లేదు. అడవి దట్టంగా ఉంది. తన చెలులతో - మోతీబాయితో కూడా ద్వారం దగ్గర రెండువరుసల్లో పెద్ద బండరాళ్లను చాటు చేసుకొని గుఱ్ఱాలతో నుంచుంది. పైన సిపాయిలు కొండచరియలో కప్పువైపు సాగి. దొంగలకి దగ్గరకాగానే పేల్చెయ్యాలని ఆమె ఆజ్ఞ. అలాగే జరిగింది.

దొంగలు కంగారు పడ్డారు. తినే సామాను వదలి గుఱ్ఱంమీద జీను అదీ లేకుండానే కూర్చుని ద్వారంవైపు పరుగెత్తారు. అక్కడికి పోగానే పైనుంచి. ఎదుటినుంచి తుపాకీగుండ్లు కురవసాగాయి. గుఱ్ఱం చచ్చిపోయింది. దొంగలు గాయపడ్డారు. తప్పించుకున్న వారిమీద తుపాకులు పేల్చబడ్డా ఫలితం లేక పోయింది. దొంగలు అటూ యిటూ పారిపోయారు. కాశీ, సుందర్, మోతీ వేరుగా వెంబడించారు. రాణి, ముందర్‌ల ముందునుంచి ఒక దొంగ గుఱ్ఱంమీద చాలా జాగ్రత్తగా, అప్రమత్తుడై, చేతిలో కత్తితో బయలు దేరాడు. అతనిమెడలో ముత్యాలదండ ఉంది. ఇతనే సాగరసింహుడని రాణి అనుకుంది. రాణి ముందర్‌కి సౌంజ్ఞ చేసింది. ఆమె ఉన్నట్టుండి అతనిమీద పడింది. దొంగ, గుఱాన్ని పరుగెత్తించాడు. రాణి, ముందర్

అతని వెంబడించారు. కొంతదూరం వెళ్ళినతర్వాత అతని గుఱ్ఱం ఆగిపోయింది. దొంగని ఒక పక్కనుంచి ముందర్, రెండవ పక్కనుంచీ రాణీ అటకాయించారు. రాణి తన కత్తిని, అతని కత్తి విరిగిపోయేటంత వేగంగా తిప్పింది. దానితో అతని కత్తి రెండు ముక్కలైంది. రాణి, ముందర్ ఒక్క ఊపున అతన్ని తమచేతులతో బంధించారు. అతను తన పళ్ళతో కొరకటానికి ప్రయత్నించాడు కాని వీలుపడలేదు.

రాణి 'జాగ్రత్త! కత్తిమొనతో నోట్లో పొడుస్తాను' అంది. దొంగ ఆ గట్టి పట్టునుంచి విడిపించుకోలేక పోయాడు. రాణి, చెలులు, కొంత మంది సిపాయిలు వచ్చారు. దొంగవి తాడుతో కట్టేశారు. అతనే సాగర సింహ్ అని తెలిపింది. రాణి విజిల్ వేసింది. ఆమె సేవంతా వచ్చి వాళ్లని చేరింది.

రాణి రఘునాథసింహ్‌కి, సాగరసింహ్ అనుచరులు దొరకలేదని, ఐనా అతను దొరకటంమూలాన సంతోషంగా వుందని కబురు చేసింది. ఆమె గట్టి కాపలాతో అతన్ని బరవాసాగర్ పంపింది.

రాణి తన అనుచరులతో సాయంకాలానికి ముందే బరవాసాగర్ చేరుకుంది. రాణి, సునిశిత బుద్ధి, వీరత ఇంటింటా గానం చేయబడింది. మరునాడు ఈ విషయం చాలాదూరం వ్యాపించింది.

పగలు తగిన సమయంచూసి సాగరసింహ్ రాణీ ఎదుట ప్రవేశపెట్టబడ్డాడు. అతను నమస్కారంచేసి రాణి కాళ్లమీద పడుతుండగా సిపాయిలు పట్టుకున్నారు.

'నీ పేరేమిటి?'

'సాగరసింహ రాకుమారుడు రాణీ!'

'రాకుమారుడవై కూడా ఇంత నీచమైన, నికృష్టమైన పని యెందుకు చేస్తున్నావు?'

సాగరసింహ్ వినయంగా సమాధానమిచ్చారు—

'మా వంశము ఎప్పుడూ యుద్ధాల్లో పాల్గొంటూ ఉండేది. ఓరఛా రాజా సేనలో, ఛత్రసాల్ రాజాసేనలో ఉండి పోట్లాడాము. ఆంగ్లేయుల అధికారాన్ని స్వీకరించని వారిలో మేముకూడా ఉన్నాం. ఇలా అణగారిపోవడంతో మంచితనం మాని దొంగతనాలు చేస్తున్నాం. నేను, నా అనుచరుల తరపునా, గంగమీద ఒట్టేసి చెపుతున్నాను, మేము స్త్రీలను, వృద్ధులను, బాలలను, పేద ప్రజలను ఎన్నడూ బాధించలేదు.'

రాణి:-నువ్వు ఇప్పుడు దొంగిలించింది మా ప్రజలసొమ్ము. ఆంగ్లేయుల ప్రజలది కాదు. దొంగతనానికి తగిన శిక్ష ప్రాణం తీయటం. నిన్ను, నీ అనుచరులను గొయ్యి తియ్యించి మట్టిలో కలిపేస్తా జాగ్రత్త!

సాగరసింహ్ రాణివైపు కొనకళ్లతో చూశాడు. అతను ఎప్పుడూ ఇంత తీక్ష్ణమయిన పెద్దకళ్లను చూడలేదు. అతనికి రాణి అపరదుర్గగా కనిపించింది.

సాగరసింహ్ 'తల్లీ! నన్ను తుపాకి గుండుతోనో, కత్తితోనో చంపెయ్యండి. ఉరిశిక్ష తీసారంటె నాకు, నా జాతకి అవమానం' అని ప్రార్థించాడు.

రాణి ఒక్క క్షణం ఆలోచించి, 'నిన్ను వదలిపెడితే ఏం చేస్తా'వని అడిగింది.

సాగరసింహ్ 'ప్రభూ! మీ ఎదుట అబద్ధం చెప్పను. ఒకవేళ వని దొరక్కపోతే దొంగతనం చేస్తాను. కాని మీ రాజ్యంలో కానేకాదు - కానే కాదు' అని చెప్పాడు.

రాణి:-నువ్వు దొంగతనాలు పూర్తిగా మానేస్తే, దానికిబదులుగా ఏం కోరుకుంటావు?

సాగరసింహ్:-ప్రభు పాదసేవ.

రాణి:-నీవెంట ఎంతమంది వున్నారు.

సాగరసింహ్:-అడవిలో 15, 16 మంది వున్నారు. ఊళ్లో 60, 65 మంది కనిపించని వీరులు—నా బంధువులు ఉన్నారు.

రాణి.-వాళ్లేం చేస్తారు?

సాగరసింహ్:-మీ అనుజ్ఞ అయితే మీ సేనలో నాతోపాటు అనుచరులుగా వుంటారు.

రాణి:-నువ్వు అందరికంటె ఎక్కువగా ఎవరిమీద ఆన పెట్టగలవు.

సాగరసింహ్:-గంగానది, ప్రభువుల పాదాలు, ప్రభువుల కత్తి, వీటన్నిటి మీద పెట్టగలను.

రాణి:-ఒట్టెయ్యి, వాగ్దానం చెయ్యి సాగరసింహ్! నిన్ను ఒదలి పెడతాను. నువ్వు నీ అనుచరులతోకూడా మా సేనలో ప్రవేశించి ఝాన్సీలోనే ఉండు.

సాగరసింహ్ కృతజ్ఞతాభావంతో పరవశించిపోయాడు. అతను ఒట్టేసుకున్నాడు. రాణి వదలిపెట్టింది. అతను ఆమె కాళ్లమీద పడ్డాడు. 'తల్లీ! నేను ఝాన్సీ వస్తాను. అక్కడ సేనలో చేరినతర్వాత తిరిగి ఇంటికొచ్చి నా అనుచరులను, యువకులుగా ఉన్న నా బంధువులను పోగుచేసి ఝాన్సీకి తీసుకువస్తాను. వాళ్లందర్నీకూడా సేనలో చేర్పిస్తాను' అన్నాడు.

రాణి:-ఉహూ! అలా కాదు. వాళ్ళంతా వచ్చి వాగ్దానం చేసినతర్వాతే వదలిపెడతాను. లేకపోతే వాళ్లను పట్టుకొని దండించవలసి వస్తుంది.

సాగరసింహ్:-తల్లీ! వా రందరినీ మీ ముందు హాజర్ పరచకపోతే నాపేరు ముందుగా మీకు చెప్పినట్లు సాగరసింహ్ రాజకుమారుడే కాదు!

'రాజకుమారుడు' అనే శబ్దం విని రాణి నవ్వింది. సాగరసింహ్ సిగ్గుపడ్డాడు.

రాణి:-నీ పేరుకు తగినట్లు ప్రవర్తించు. కాని ముందుగా నీ మీదికి దండెత్తి గాయపడ్డ ఖుదాబక్ష్‌కి 'రాకుమారుడు' అనే బిరుదు ఇస్తున్నాము.

సాగరసింహ:-అతను ఇప్పు డెక్కడున్నాడు? అతనిని క్షమించమని అడుగుతున్నాను.

రాణి ఖుదాబక్ష్ ఆరోగ్యాన్నిగురించి సమాచారం తెలుసుకుంది. అతను ఇప్పుడిప్పుడే కొత్త నడవగలుగుతున్నాడు. అలాగే రాణిదగ్గరకు నెమ్మదిగా నడచివచ్చాడు.

రాణి:-ఎలా ఉంది?

ఖుదాబక్ష్:-ఉత్సాహంగా 'ఇంత గొప్ప స్వామిరక్ష నాకుండగా నా ఆరోగ్యానికేం భయం లేదు. ప్రభువుల శౌర్యపరాక్రమాలు వింటూనే నా బాధ కలలా ఎగిరిపోయింది' అన్నాడు.

రాణి:-నేను దోషిని వదిలానని నువ్వు వినే ఉంటావు.

ఖుదా:-ప్రభువుల దయగురించి విన్నాను.

రాణి:-నేటినుంచి నువ్వు ఖుదాబక్ష్ రాకుమారుడు (కువరే ఖుదాబక్ష్)గా పిలవబడతావు. ఇతను సాగరసింహ రాకుమారుడు.

ధైర్య సాహసాలను ప్రదర్శించి పనిచేసిన ప్రతివారు రాకుమారులని పిలవబడుతారు. వారందరినీ 'రాకుమార మండలి' అనే పేరుతో రాజ్య వ్యవహారాల పత్రాలలో వ్రాయడం జరుగుతుంది.'

ఖుదాబక్ష్ కంఠం రుద్ధమైంది. అతను రాణి కాళ్లు పట్టుకున్నాడు. 'తల్లీ! మీ సేనలో మేము మరణించినప్పుడే మాకు 'రాకుమార మండ'లనే పేరు సార్థకమవుతుంది.'

సాగరసింహ ఖుదాబక్ష్‌ని క్షమాపణ కోరాడు. 'ప్రభువుల సేనలోకి వచ్చినప్పుడే తప్పులన్నీ క్షమింపబడ్డ'య్యన్నాడు ఖుదాబక్ష్.

ఇన్నాళ్లు బందిపోటుగా వ్యవహరిస్తూన్న సాగరసింహ్‌లో ఏ మూలో పవిత్రతకూడా ఉందనిపిస్తుంది.

'ప్రభువుల దయవలన నేను మనిషి నవిపించుకునేందుకు ప్రయత్నిస్తాను.'

రాణి ఖుదాబక్ష్‌ని విశ్రాంతి తీసుకోమని అతని గదిలోకి పంపి సాగర సింహుని వాగ్దానంప్రకారం వదలిపెట్టింది.

బరవాసాగర్‌లో రాణి రెండువారా లుంది. సాగరసింహ్ అనుచరులంతా తమ ఆయుధాలు విసర్జించి ఆమెను శరణు జొచ్చారు. తర్వాత వారుకూడా సేనలో చేరారు. ఖుదాబక్ష్ పూర్తిగా ఆరోగ్యవంతుడయ్యాడు. రాణి సైన్యంతోకూడా ఝాన్సీకి వెళ్ళిపోయింది. ఝాన్సీ ప్రజలంతా ఆమెకు ఉత్సాహంతో స్వాగతం చెప్పారు. స్త్రీ పురుషులంతా ఆమె సైన్యంలోని వారమనే అనుకుంటున్నారు.

నవాబ్ అలీ బహదూర్ ఆమెను అభినందించడానికి వచ్చాడు. తాంబూలం, అత్తరు స్వీకరించి వెళ్ళాడు. రాణికి, ఆమె చెలికత్తెలకు అతను నిజంగా అభినందించడానికి వచ్చినట్లు కన్పించలేదు.

## 18

నవాబ్ అలీ బహదూర్‌గురించి వా రనుకున్నది అబద్ధం కాదు.

అలీ బహదూర్ అదేరోజున పీర్ అలీ సలహా తీసుకున్నాడు.

'ఈ సాగరసింహుడు ఝాన్సీ జైలునుంచి పారిపోయినవాడేనని అలీ గుర్తించాడు. రాణి అతన్నే కాక అతని అనుచరులనుకూడా సైన్యంలో చేర్చుకుంది. ఆంగ్లేయులకు విరుద్ధంగా చేస్తున్నందుకు నిదర్శనం ఇది. ఉన్నదున్నట్టుగా ఈ వార్తని జబల్‌పూర్ కమీషనర్‌కి చెప్పాలని అను కున్నాడు అలీ.

పీర్ అలీ:-తప్పకుండా। విశేషమేమిటంటే ఆవిడ పాత, కొత్త నౌకర్లు అంతా ఝాన్సీ రాజ్యం గొప్పగా చెయ్యబడుతున్నదని ఆంగ్లేయులను మోస గించ చూస్తున్నారు.

అలీ:-ఈ మోసాన్ని అరికట్టాలి. టీక్‌మఢ్ రాష్ట్రపు దివాను నత్తేఖాన్ ఆంగ్లేయులతో కలిశాడు, నాకు తెలుసు ఆయన. అతనిద్వారా కబురు జబల్‌పూర్ పంపాలి. కలెక్టరుగారి పేష్కారు నా దగ్గరున్నాడు కదా। అతనిలో దివాన్ ఖాన్‌కి ఉత్తరం పంపుతాను. ఆటంకమేమయినా వస్తే జబల్‌పూర్ వెళ్ళిపోతాడు.

నవాబు దూత టీక్‌మఢ్ వెళ్లటం నిశ్చయమైంది. టీక్‌మఢ్ రాజా చిన్న వాడు. అతను జబల్‌పూర్ కమీషనర్‌దగ్గరికి వార్త పంపి ఝాన్సీమీద యుద్ధానికి ఏర్పాట్లు చేయసాగాడు. ఒకపక్క ఆంగ్లేయులంటే పక్షపాతం. ఇంకో పక్క రాజ్య దాహం. కొన్ని యుగాలకుపూర్వం ఝాన్సీ ఓరఛా రాజ్యంలోని ఒక భాగం. దాన్నే టీక్‌మఢ్ అనేవారు. ఆంగ్లేయుల ఆసరా చూసుకొని నత్తేఖాన్ పూర్వం సమసిపోయిన వ్యవహారాన్ని పైకి లాగు తున్నాడు.

నత్తేఖాన్ 20 వేల సైన్యాన్ని తీసుకొని టీకమఢ్‌నుంచి ఝాన్సీకి 8, 9 మైళ్ల దూరంలోవున్న ఓరఛాకి వచ్చాడు. అతను రాణీదగ్గరికి దూతద్వారా పంపిన లేఖలో ఇలా ఉంది—

'ఝాన్సీ పూర్వం ఓరఛాలో ఒక భాగంగా ఉండేది. అది ఇప్పుడు తిరిగి ఇచ్చెయ్యాలి. రాణికి ఆంగ్లేయులిచ్చే 5 వేల రూపాయలూ ప్రతి నెలా ముడుతూనే ఉంటాయి. కోట, పట్టణం, ఆయుధాలు మా స్వాధీనం చెయ్యాలి.'

రాణి ఉద్యోగు లందరితోను సంప్రదించింది. నత్తేఖాన్, వీళ్ల సైనిక శిక్షణ పూర్తి కాకమునుపే యుద్ధానికి వచ్చాడని అందరూ భయపడు తున్నారు.

'గాభరా పడవద్దు. సేనని నేను నడిపిస్తాను. నత్తేఖాన్ ఓడి సందులూ, గొందులూ పట్టాల్సిందే!'

నానా భోపట్‌కర్ ఆ రాష్ట్రంలోని ఒక వయోవృద్ధుడు. పెద్ద ఉద్యోగి, దూరపుచూపు కలవాడు. అతడు రాణి అన్నమాటలను సమర్థించాడు— ప్రభువులు విజయం మూర్తీభవించినవారు. యుద్ధపు అంతిమ పరిణామాన్ని గూర్చి సందేహం లేదు. ఎందుకంటే జయం మనదే! నా దొక విన్నపం - ఆంగ్లేయులు తమ జండాని కోటలో వదలి వెళ్ళారు. దాన్ని కోటమీద మన కాషాయరంగు జండాతోపాటు ఎగరేస్తే బాగుంటుందేమో!

'ఈ రాజనీతి ఎన్నాళ్లు సాగుతుంది భోపట్‌కర్! ఎలాగైనా మనం స్వరాజ్యాన్ని స్థాపించాల్సిందే కదా!'

భోపట్‌కర్:-రాణీ! రాజనీతిప్రకారం మన ఉద్దేశాన్ని కొంతకాలం దాయాలి.

లాలా భావూ బక్షీ:-రాణీ! తినే పళ్లు వేరే చూపించేవి వేరే. అంటే ఉన్నది ఉన్నట్టుగా కప్పించకూడదని భోపట్‌కర్ భావం.

రాణి నవ్వింది. సభాసదులందరూ ఆమె ఏదో దృఢంగా నిర్ణయించు కున్నదని తెలుసుకున్నారు.

రాణి:-నానా మాటలు కాదనటానికి వీలు లేదు. కాని కాషాయరంగు జండా, గోధుమవన్నె జండా అన్నింటికన్న పై బురుజుమీద వుండాలి. ఆంగ్లేయుల జండా అన్నింటికంటె కింద ఉండాలి.

అందరూ దీని కంగీకరించారు.

'ఫిరంగులు వెంటనే ఏర్పాటు చేయించాలి. అన్ని ముఖద్వారాలు మూయించాలి. వాటి బురుజులు ఫిరంగులతో నింపెయ్యాలి. వెంటనే చెయ్యండి. కోట బురుజులమీద తయారుచేయబడ్డ ఫిరంగు లున్నాయి. మేము కొంతమంది స్త్రీలకు ఫిరంగులు పేల్చడం నేర్పాము. మరి కొంత మంది నేర్చుకుంటున్నారు. ప్రజలందరినీ నిశ్చింతగా వుండమనండి. కాని గుంపులు, గుంపులుగా తిరగొద్దనండి' అంటూ రాణి ఆజ్ఞ యిచ్చింది.

ఆజ్ఞ శిరోధార్యమయింది.

'మహారాణి ఆంగ్లేయులతరపునే ఏర్పాట్లు చేస్తున్నది. టీక్‌మఢ్ ఆంగ్లే యుల మిత్రరాజ్యమవటం మూలాన ఝాన్సీమీద ఆక్రమణ చెయ్యటం కేవలం అనుచితమే అవుతుంది. ఒకవేళ చేసినా ఝాన్సీ తనని రక్షించుకో గలదు' అని నత్తేఖాన్‌దూతకు జవాబు చెప్పారు. దూత జవాబు తీసుకొని వెళ్ళిపోయాడు.

ఆ రోజు అనంత చతుర్దశి కావటంమూలాన రాణి పూజ చేసుకుంటుం డగా నత్తేఖాన్ ఝాన్సీమీద దండెత్తివచ్చాడు. వాళ్లు పేల్చిన గుండొకటి ఒక ఇంటిమీద పడింది. రాణి వెంటనే పూజ చాలించింది. దామోదరరావుకి అనంతరక్ష తాయెత్తు కట్టింది.

గుఱ్ఱంమీద వెంటనే గుఱ్ఱపుస్వారీ చేయగల తన చెలులతో ఓరఛా ద్వారంవైపు వెళ్లింది రాణి. గులామ్ గౌస్‌ఖాన్‌కి— 'శత్రువులు ఇటువైపు

వున్నారు, గుళ్ల వర్షం విడవకుండా కుర్పించ'మని ఆజ్ఞయిచ్చి పద్ధతికూడా చెప్పింది.

గౌస్‌ఖాన్ ఓరఛా ద్వారపు బురుజుమీద వెంటనే చిన్నచిన్న ఫిరంగులు పెట్టించాడు. గుళ్లు కురిపిస్తున్నారు. మొదటి ఫిరంగు పేలుస్తుండగానే తతిమ్మావి మందుతో నింపసాగారు.

రాణి మిగతాద్వారాలవైపుకు వెళ్ళింది. ఓరఛా ద్వారంకంటె ముందు ఉత్తరంవైపు సాగర్ కిటికీ అనే శిథిలమైన చిన్నద్వారం ఉంది. దానిమీద కూడా ఒక బురుజు వుంది. ఈ ద్వారంనుంచి కాస్త దూరంలో బురుజు కిందనుంచి నీళ్లు బయటికి పోవటానికి దోవ వుంది. ఆ దోవగుండా ఓ పొట్టి మనిషి పోవచ్చు. బురుజుమీద దుల్హాజీ అనే ఫిరంగులు పేల్చేవా డున్నాడు. శత్రువులు మోసపోయేట్లు గుళ్లు కురుపించమని అతన్ని హెచ్చరించింది. ఆవిడ తన రణకుశలతను చక్కగా ప్రదర్శించింది. ఆవిడ అనుకున్నచోటే యుద్ధం జరిగింది. నత్తేఖాన్ సేన చాలవరకు హతమైంది. ఎవరితో పోట్లాడేదీ నత్తేఖాన్ మొదటిరోజే తెలుసుకున్నాడు.

దివాన్ రఘునాథసింహ్ ఆ రోజున పనిమీద ఝాన్సీకి ఉత్తరాన 11 మైళ్ల దూరాన ఉన్న 'ఉన్నావ్' అనే ఊరు వెళ్లాడు. మరునాడే వచ్చాడు. ఇప్పుడు రెండోసారి నత్తేఖాన్‌కి ఆపదొచ్చిపడింది. లోపలినుంచి రాణి నడిపే యుద్ధం, బయటనుంచి రఘునాథసింహ్ నియమించిన మల్లయోధులు నత్తేఖాన్ తన ఫిరంగులు, మిగత సామాను వదలి వెళ్ళిపోయాడు. మిగిలిన సేనవి ముక్కలు, ముక్కలుగాచేసి విసిరేశారు. రాణిసేన వెంటబడి మిగిలినవారిని తరిమేశారు.

నత్తేఖాన్ పారిపోలేక నవాబు అలీ బహదూర్ భవనంలో దాక్కున్నాడు. నవాబుకి అతను అక్కడికి రావటం ఇష్టంలేదు. అయినా తప్పలేదు. రాణి సేనకి నత్తేఖాన్ ఆచూకి తెలిసి ఒక సైనికదళం దండెత్తగానే అతను

పారిపోయాడు. ఇప్పుడు నవాబు ఆలీకి పెద్ద కష్టం వచ్చింది. మెహిందీబాగ్ అనే తోటలోకి కోటద్వారా సొరంగం ఉంది. విలువైన వస్తువులు తీసుకొని పీర్ ఆలీ, భార్యాబిడ్డలతో సహా ఆ సొరంగంద్వారా నవాబు బయట పడ్డాడు.

'వేషం మార్చుకొని ఎద్దుబండిలో భాండేర్ వెళ్ళిపోండి. నే నిక్కడే వుంటాను. రాణి సేనతో కలిసిపోయి కోటమీద దాడి చేస్తాను. వాళ్ళకి సన్నిహితంగా వుంటాను. రాణి రాజ్యం ఇం కెన్నాళ్లో వుండదు. మీకు భాండేర్‌కి కబురు అందజేస్తుంటాను' అని పీర్ ఆలీ సలహా చెప్పాడు.

నవాబ్ వ్యాకులచిత్తుడై నాడు, ఆలోచిస్తున్నాడు.

'ఇప్పటికి ఎలాగో సహించాలి మరి. రాత్రిపూటకదా! బళ్లుమాత్రం దొరుకుతాయి' అని నచ్చచెప్పాడు పీర్ ఆలీ.

నవాబు ఒప్పుకొని పీర్ ఆలీ సాయంతో వెళ్ళిపోయాడు. పీర్ ఆలీ అడ్డదోవన వెళ్ళి రాణి సేనని కలిశాడు. వాళ్లంతా చంపటానికి తయారయ్యారు.

పీర్ ఆలీ 'అయ్యో! నన్ను చంపకండి, నేను మీ స్నేహితుణ్ణి. పొట్ట నింపుకోటం కోసం నవాబుదగ్గర నౌకరీ చేసినమాట నిజమే! కాని రాణిగారి సుఖం కోరేవాణ్ణి. నవాబుగారికి నచ్చచెప్పాను కాని వినలా! అందుకే ఇప్పుడు అనుభవిస్తున్నాడు. నేను మీ సేవ చేయాలని వచ్చాను ఈ కోటని (నవాబు ఆలీది) గుళ్లతో పేల్చటం కాదు, తగలెట్టండి. అదే తెరుచుకుంటుంది. లోపల ఏమేమి ఎక్కడుందో నాకు తెలుసు. అన్నీ చెప్తాను.'

ఆ దళాధిపతి సాగర్‌సింహ్ 'నవా బెక్కడ' అని అడిగాడు.

'లోపల ఉండి ఉంటాడు పట్టుకోండి' అని అరిచాడు.

ద్వారం తగలెట్టారు. లోపలికి వెళ్లటానికి దోవ ఏర్పడింది. పీర్ ఆలీ కొత్త సామాను సిపాయిలకి వెతికిచ్చాడు. నవాబుమాత్రం లేదు. ముందే

పారిపోయాడని చెప్పాడు పీర్ ఆలీ. అతను వాళ్ళకి స్నేహితుడిగా వుంటున్నాడు. మరునాడు ఈ వార్త పాకిపోయింది. ప్రజలంతా ఆశ్చర్యపడసాగారు. మోతీబాయికి అనుమానం వచ్చింది. అయినా మెదలకుండా ఊరుకొంది.

# 19

తూర్పు ఉత్తరదేశాలు రెంటిలోను ఆంగ్లేయులు ఓడుతూ, గెలుస్తూ ఉన్నారు. లక్నోలో ఓడిపోయిన తర్వాత మళ్ళీ గెలిచారు. కాన్‌పూర్‌ని మాత్రం తాంత్యాతోపే చిక్కించుకున్నాడు. అతను గ్వాలియర్ వెళ్ళాడు. అక్కడ ఆంగ్లేయసేనలోవున్న భారతీయులను తనసేనలో కలుపుకున్నాడు. కాన్‌పూర్ జనరల్ బింటమ్‌ని ఓడించాడు. కాని ఆంగ్లేయులు 70 వేల తెల్లవాళ్ళని, చాలామంది భారతీయ పదాతిదళాన్ని తీసుకుని లక్నో వెళ్లారు. ఎవరికి వారు గెలవాలనే పట్టుతో యుద్ధం చేశారు. చివరకు బిహార్ ఓడిపోగానే కాన్పూరు తిరిగి ఆంగ్లేయుల వశమైంది. తాంత్యా కలాపీకి దగ్గర్లోనే యుద్ధం చేస్తున్నాడు, విప్లవాగ్ని అన్నివైపులకు వ్యాపించింది.

ఆ రోజుల్లో రోజ్ ఆంగ్లేయుల సేనానాయకులలో గొప్పవాడు. అతను మధ్యప్రదేశ్‌లో తన పని తాను చేసుకుపోతున్నాడు. అతను తన సేనని రెండుభాగాలుగా చేశాడు. ఒకభాగాన్ని మహూ గుడారంవైపు పంపి, రెండోదాన్ని తీసుకొని సాగర్‌వైపు వెళ్ళాడు. సాగర్‌నుంచి ఝూన్సీ 125 మైళ్లు ఉంది.

నర్మదానదికి ఉత్తరంవైపునున్న భాగం చాలావరకు విప్లవకారుల చేతుల్లో ఉంది. వారిని అణిస్తేకాని ఝూన్సీమీద దాడి చెయ్యటానికి వీల్లేదని రోజ్‌కు తెలుసు. రహత్‌గఢ్ పఠానులను ఓడించి, బానాపూర్ మర్ధన్ సింహ్‌తో, శాహీగఢ్ బఖత్‌బలీతోనూ యుద్ధం చెయ్యటానికి బయలుదేరాడు. ఝూన్సీనుంచి సాగర్ వెళ్ళేదోవలో నార్‌హట్, బఖత్‌బలీ, మదన్‌పూర్ అనే చారిత్రక స్థలంలోగాని, రోజ్ వచ్చి ఆగిన చోటులోగాని యుద్ధం జరుగుతుందని అనుకున్నారు. రోజ్ రణచాతుర్యంలో వారిద్దరి యుద్ధ

ప్రణాళికలు విఫలమయ్యాయి. వాళ్లు చాలా ధైర్యసాహసాలతో యుద్ధం చేసినా రోజ్ నియమించిన మల్లయోధులతో గెలవకపోయారు. రోజ్ ఝాన్సీవైపుకు వెళ్ళాడు.

మర్దన్‌సింహ్ ఈ పరాజయ విషయం, నరసంహారవిషయం ఝాన్సీకి తెలియచేశాడు.

ఝాన్సీలో, రాష్ట్రంలోని మిగతా నగరాల కోటల్లోనూ యుద్ధపు తయారీలు వెంటనే అమలు పరచబడ్డాయి. పీర్ అలీ ప్రొద్దున్నే ముఖ్యమైన విషయాలన్నీ జాగ్రత్తగా నవాబ్ అలీ బహదూర్‌కి పంపుతున్నాడు. అతను భాండేర్‌లో ఉన్నాడు. నవాబు, పీర్ అలీ పంపిన ముఖ్యమైన విషయాలు ఆంగ్లేయులకి అక్కడినుంచే పంపుతున్నాడు. రోజ్‌కి, ఆంగ్లేయ పరిపాలకులకి ఝాన్సీ శక్తి తెలుసు. రోజ్ సేన అందర్నీ చంపుతూ అగ్నివర్షం కురిపిస్తూ 12 మార్చి 1858 తాల్‌బేహట్ అనేచోటికి వచ్చింది. ఈ తాల్ బేహట్ ఝాన్సీకి దక్షిణంగా దాదాపు 32 మైళ్ల దూరాన ఉంది. తాల్ బేహట్‌లో కోట వుంది. విప్లవకారులు ఎంతోసేపు అతని ధాటికి నిలవలేకపోయారు. తాల్‌బేహట్‌నుంచి చరిత్ర ప్రసిద్ధమైన చందేరే 20, 25 మైళ్ళ దూరాన ఉంది. అక్కడ చౌనాపూర్ రాజా సైనికదళం ఒకటి వుంది. రోజ్ పక్కలో బల్లెంలాంటి వీళ్ళని ఓడించి ఝాన్సీమీద దండెత్తటానికి నిశ్చయించాడు. అంతకుముందు ఝాన్సీరాణికి ఒక ఉత్తరం పంపాడు.

మీరు మీ దివాన్ లక్ష్మణరావు, లాలా బావూ బక్షీ, మోరోపంత్ తాంబే (మీ తండ్రి), దివాన్ జవాహర్ సింహ్, రఘునాథసింహ్, ఖుదాబక్ష్, మోతీలతో శస్త్రాలనువదలి రాకపోతే ఘోరమైన యుద్ధం తప్పదని ఆ ఉత్తరం లోని సారాంశం.

ఇటువంటి బెదరింపు లొస్తాయని రాణికి తెలుసు. అయినా వీటికికూడా సిద్ధంగానే ఉంది. కాని జనరల్ రోజ్ కోరిన మోతీస్వామి గురించి సభలో

నవ్వులు చెలరేగాయి. ఒకరోజు రాణి నానా భోవట్‌కర్‌ని పిలిచి 'నానా సాబ్! ఈ మోతీస్వామిని ఎక్కడనుంచి తేను?' అంది.

నానా అతి కష్టంమీద వచ్చే నవ్వు నాపుకుంటూ 'ప్రభువులదగ్గర కృత్రిమ మైన అచ్చు ఉంటే ఎవరికైనా సరే స్వాములవేషం వేస్తే సరిపోతుంది' అన్నాడు.

మోతీ అక్కడే ఏర్పాటు చేయబడ్డ ప్రత్యేకసభలో వుంది. మండి పడుతూ 'రాణీ! దూతని పిలిచి మోతీస్వామికి ఏ యే గుర్తులుంటాయో కను క్కొండి' అంది.

మోరోపంత్—అతనికి పొడవైన గడ్డం ఉంటుంది, పెద్ద జుట్టు, ఎర్రగా ఉండే కళ్లు ఉంటాయి. విప్లవాన్ని రేకెత్తించటంలో స్వాములు, సాధువులు కూడా సాయపడుతున్నారు. అందుకనే ఆంగ్లేయులకు ఒక స్వాములవారు కావలసివచ్చారు.

'ప్రభువులు తొందరగా సమాధాన మివ్వాలి. ఆంగ్లేయుల రాయబారి ఎవరిదగ్గరా ఇంతసేపు ఉండటానికి ఇష్టపడడని' దివాన్ రాణికి విన్న వించాడు.

బాపూ బక్షీ దీన్ని సమర్థిస్తూ 'ఆంగ్లసేన ఇక్కడికి దగ్గర్లోనే ఉండి ఉంటుంది. బహుశా దూత వెనకాలే వస్తుందేమో!' నన్నాడు.

మోతీబాయి 'ఈ మోతీస్వామి విషయం ఏమిటి? దీని కేమని సమాధాన మిస్తారు?' అంది.

రాణి నవ్వాపుకుంటూ 'నేను చెప్తానులే' అంది.

రాణి జనరల్ రోజ్‌కి ఈ ప్రకారంగా ఉత్తరం వ్రాయించింది—

'ఝాన్సీలో నాయకులందరినీ, అన్నిజాతుల నాయకులనూ పోగుచెయ్యి. వారంతా ఏకకంఠంతో చెపితే నేను ఝాన్సీవదలి ఒంటరిగా శస్త్రాలు ఏమీ లేకుండా వెళ్ళిపోతాను.'

అందరి సలహాతో ఉత్తరాన్ని ఈ విధంగా పొడిగించింది. 'కలుసుకోమని నువ్వు కబురుచెయ్యటంలో ఏదో మోసం ఉంది. నేను ఒంటరిగా ఎలా వస్తాను. దివాన్, బక్షీ అందరితో ససైన్యంగా వస్తాను' అని వ్రాసింది.

రాయబారి వెళ్లిపోయాడు.

పీర్ఆలీ-ప్రభువుల ఆజ్ఞ అయితే నేను ఆంగ్లేయుల కంటోన్మెంటికివెళ్ళి వాళ్లు ఎంతమంది ఉన్నదీ, ఎన్ని ఫిరంగులున్నవీ, వాళ్లు ఎలా ఝూన్సీమీద ఆక్రమణచేస్తారో తెలుసుకువస్తానని కబురుచేశాడు. అతనిమీద అనుమాన మేమీలేదు కనుక రాణీ, మోతీబాయికూడా అతను అక్కడికి వెళ్లటానికి ఒప్పుకున్నారు.

సభికులంతా వెళ్ళిపోయారు.

రాణి మోతీబాయితో 'నీ పేరు ఎంత అందంగా మలిచారు ఆంగ్లేయులు? మన గూఢచారిశాఖ సర్దారునే స్వామిగా చేశారు' అంది.

'ప్రభువుల ఎదుట తిట్లు రావుగాని....ఎప్పుడైనా ఎక్కడైనాసరే మొహం మాడిన రోజ్ కనిపిస్తే ఫిరంగు, తుపాకీ, లేకపోతే కత్తితోనైనాసరే దండించి పేరు సరిగ్గా చెప్పేదాకా వదలను' అన్నది మోతీబాయి.

'నేను దర్బారులో అతి కష్టంమీధ నవ్వాపుకున్నాను మోతీసాయీ.... మోతీసాయి ఎంత చక్కటిపేరు' అంది రాణి నవ్వుతూ. మోతీకూడా నవ్వుతూ 'దేవీ! నాకు అధికారం లేదుగాని-ఉంటేనా....ఆ రోజ్‌కి-శ్రీమతి రోజ్‌కి మోతీస్వామి ప్రణామాలు. మెదలకుండా తమరు భారతదేశానికి వీపు చూపించి (ఓడిపోయి) తమదేశానికి వృధాగా కాలంగడపక వెళ్లిపోవలెను- అని రాస్తాను.'

కాసేపటిదాకా నవ్వుతూనే ఉన్నారు.

వెంటనే రాణి గంభీరంగా 'పీర్ ఆలీ రేపటికి వస్తాడనుకుంటాను' అంది. 'తోవలో ఏమీ ఆటంకం కలగకుండా ఉంటే.'

'చాలా తెలివైనవాడే!'

'దేవీ! అతను చాలా ధూర్తుడు అయినా నేర్పరి. నాకుకూడా అనుమానం అతనిమీద అప్పుడప్పుడు కలుగుతుంటుంది. కాని కొంత కాలంనుంచి శ్రద్ధగా పనిచెయ్యటంతో నమ్మకం కలుగుతోంది.'

'ఆంగ్లేయులవెంట భారతీయ సైనికులున్నారని తెలిసింది.'

'అవును. భోపాల్, హైదరాబాదు రాష్ట్రాల దళాలున్నాయి. మిగతావారు ఆంగ్లేయులే.'

'అంతాకలిపి ఎంతమంది?'

'ఇంకా సరిగ్గా తెలియదు. ఎన్నో వేలని విన్నాము. పీర్అలీ వస్తేకాని నిజం తెలియదు.'

'అతను ఆచూకీ కనుక్కోలేకపోతే మోతీస్వామిగారూ! తమరు కాస్త చమత్కారం ఉపయోగించి కనుక్కోవాలి' అంటూ రాణి బిగ్గరగా నవ్వింది.

మోతీబాయికూడా నవ్వింది.

# 20

పీర్ అలీ చాలా వేగంగావెళ్లి జనరల్ రోజ్ దూతని దారిలోనే కలిశాడు. ఆంగ్లేయుల కంటోన్మెంటికి వెళ్లగానే రోజ్ని కలిసేటందుకు వినతిపంపాడు. రోజ్కి నవాబు అలీ బహదూర్, పీర్ అలీ సంగతి ముందే తెలుసు. పీర్ అలీని చూసి రోజ్ ప్రసన్నుడయ్యాడు. పీర్అలీ అతనితో ఝాన్సీలో విన్నవీ, విననవీ అన్నీ చెప్పాడు. స్త్రీ సేనగురించిన వివరాలువిని రోజ్ గాభరాపడ్డాడు. భారతస్త్రీలు ఫిరంగులుకూడా నడపగల సైనిక చాతుర్యం కలవారని తెలుసు కున్నాడు. అతను బొంబాయి వచ్చినతర్వాతే విప్లవకారుల్లో ఝాన్సీరాణి కూడా ఉందని తెలుసుకున్నాడు. ఆ సంగతులన్నీ వాళ్ల నవాబు అలీ ఉత్తరాల ద్వారా తెలిసింది. అదీగాక పీర్అలీ వివరాలు చెప్పనే చెప్పాడు.

రోజ్ పీర్ అలీని 'రాణి ఆంగ్లేయ స్త్రీలని, పిల్లల్ని చంపించిందా ఏమిటి'ని అడిగాడు.

'లేదు. ఎప్పటి కలాచెయ్యదు. కాని మీతో పోరాడటానికి మాత్రం సన్నద్ధులవుతున్నారు రాణి. ఆంగ్లేయుల పిల్లల్ని, స్త్రీలని అక్కడి సిపాయిల నిర్దయ కోపావేశం చంపివేశాయి. రాణిగారికి దానితో ఏమీ సంబంధం లేదు' అని చెప్పాడు పీర్ అలీ.

ఝాన్సీ గడ్డమీద సిపాయిలు చేసిన అత్యాచారాలు, రాణి విప్లవకారులతో కలసి స్వాతంత్ర్యంకోసం చేసిన ప్రయత్నం విని రోజ్ ఝాన్సీని అణగ ద్రొక్కెయ్యాలని లోపల లోపల మండిపడుతూ నిశ్చయించుకున్నాడు.' రాణి ఇచ్చిన సమాధానంతో ఈ నిశ్చయం మరింత గట్టిపడింది. దీనికోసం పీర్ అలీ సాయం ఎలా చెయ్యాలనే విషయం నిర్ణయమయింది. ఆ తర్వాత అతను వెళ్ళిపోయాడు. రోజ్ మార్చి 17 న యాలాబేహట్ మీదుగా బేతవా

నది దాటాడు. అతను చాలా జాగ్రత్తగా, కట్టుదిట్టంగా ఝాన్సీకి వెళ్ళాడు. ఝాన్సీ పరిసర ప్రాంతాన్ని రెండు, మూడు రోజులలో వశపరచుకొన్నాడు.

రోజ్ ఝాన్సీకి దాదాపు 10 మైళ్ళ దూరాన ఉండగానే తన సేనా నాయకుడు అతన్ని చర్ఖారీమీద దండెత్తమని కబురుచేశాడు. ఎందుకంటే తాంత్యాతోపే చర్ఖారీని ముట్టడించాడు. చర్ఖారీ రాజుని వశపరచుకోవా లంటే అతనికి సహాయం చెయ్యాలికదా!

కాని రోజ్ ఒప్పుకోలేదు. 'నేను ఆజ్ఞ నుల్లంఘించినందుకు క్షంత వ్యుణ్ణి. చర్ఖారీకంటె ఝాన్సీ ఎన్నోరెట్లు విలువైనది. అందుకని ముందు ఝాన్సీని ముట్టడించాలి' అని ప్రత్యుత్తరమిచ్చాడు.

తాంత్యా చర్ఖారీనుంచి 24 ఫిరంగులు 3, 4 లక్షల రూపాయలు తీసు కొని కలాపి వెళ్ళిపోయాడు.

పీర్ ఆలీ రాణి దగ్గరికి పంపిన సమాచారం ఏమంత విలువైనది కాక పోయినా దానికి ప్రాముఖ్యం ఇవ్వడం జరిగింది. అతను పదాతిదళ సంఖ్య, ఏర్పాట్ల వివరాలు, ఫిరంగుల సంఖ్య—మొత్తం సేన సంఖ్యా - 7000 అని కబురు చేశాడు.

దీంతో అతను మరింత విశ్వాసపాత్రుడయ్యాడు. నేర్పుగాను, జాగ్రత్త గాను నవాబుకి సమాచారం అందజేస్తూనే వున్నాడు. ఎందుకంటే చాలా రోజులవరకు ఉత్తరం పంపటం సాధ్యం కాదేమోనని ఎప్పటికప్పుడు జాగ్రత్త పడుతున్నాడు.

పీర్ ఆలీ తిరిగి వచ్చినరోజు రహత్‌గఢ్ పఠానులు రాణిని శరణు జొచ్చారు. వాళ్లు స్వామిభక్తులై ఉంటామని ప్రమాణం చేశారు. రాణి వాళ్లని తన సేనలో చేర్చుకుంది. ఈ పఠాన్ నాయకునిపేరు గుల్ మహ మ్మద్. వీళ్లసంగతి అక్కడికి పంపలేకపోయానే అని పీర్ ఆలీ విచా రించాడు.

పఠానులు దాదాపు 500 మంది ఉన్నారు. రాణిదగ్గరకి వచ్చేసరికి వాళ్ల పరిస్థితి చాలా అధ్వానంగా ఉంది. బట్టలు చిరిగిపోయాయి. ఎన్నోరోజుల నుంచి కడుపునిండా తిండిలేదు. లాఠీలు, చిన్నకత్తులు తప్ప వేరే ఆయుధాలేవీ లేవు. రాణి వాళ్లకి అన్నిసౌకర్యాలు కలుగచేసింది.

స్వరాజ్యంకోసం రాణి అడుగుజాడల్లో మేము మా శిరస్సులు అర్పిస్తామని శపథం చేశారు.

ఝాన్సీ కోటద్వారాల బురుజు లన్నింటిమీద ఫిరంగుల ఏర్పాటు జరిగింది. ఫిరంగి గుళ్లు, తుపాకీ మందు, ఎప్పుడూ యుద్ధసామగ్రి చేరవేసే ఏర్పాట్లు కట్టుదిట్టంగా జరిగాయి.

దివాన్ దూలిజూ ఓరఛాద్వారంమీద, పీర్ అలీ సాగర్‌కిటికిమీద, ఖుదాబక్ష్ సైయ్యర్‌ద్వారంమీద, సాగరసింహ్ ఖండేరావుద్వారంమీద, పూరన్‌కోర్ ఉన్నావ్‌ద్వారంమీద నియుక్తులయ్యారు. దతియా ద్వారం కాఛీల అధీనంలో వుంది. జవాహర్‌సింహ్ మొత్తం నగరద్వారాల రక్షకుడిగా నియమింపబడ్డాడు. కోటలోని అన్ని బురుజులమీద మొత్తం 61 ఫిరంగులు ఏర్పాటు చేయబడ్డాయి. దక్షిణపు బురుజుమీద గులామ్ గౌస్‌ఖాన్ పేల్చడానికి, తూర్పు, ఉత్తరాల బురుజుమీద బావూ బక్షీ, మిగిలినవి దివాన్ రఘునాథసింహ్ అధీనంలో వుంటాయి. కోటలోపల ఎన్నికైన పఠానులు, బుందేల్‌ఖండ్ సైనికులు, స్త్రీ సైనికులు నియమింపబడ్డారు. అంతా కలిపి 4 వేలమంది ఉన్నారు. నీటివసతి చెప్పుకోతగ్గంత లేకపోయినా తాగటానికి సరిపడా ఉంది. కోటకి పశ్చిమాన శంకరుని గుడిపక్కన ఒక నుయ్యి ఉంది. దానిలోనుంచి సేనకి నీళ్లందియ్యటానికి బ్రాహ్మణులు నియమింపబడ్డారు.

ఫాల్గుణ అమావాస్య వెళ్ళిపోయింది. రామనవమి ఉత్సవాలు ఆరంభమయ్యాయి. కుంకుమోత్సవం జరిగింది. స్త్రీలు ఆ కాసేపు వచ్చే ఆపదలను మర్చిపోయి ఆనందంగా ఉన్నారు. శస్త్రాలు చేతిలోను, వెనక రాణి

ఉండగా వారి కేం కొదవ ? కావేపు పిచ్చాపాటి జరిగిన తర్వాత రాణి వారి నుద్దేశించి 'మీలో కొంతమంది నాకు తల్లితో సమానమైన వారయితే, మరి కొంతమంది అక్కచెల్లెళ్లతో సమానమైనవారు. మన ఆడపడుచుల పతిత్వాన్ని రక్షించవలసిన కర్తవ్యం మన మీదుంది. మనవారు గర్వించేటట్లుగా మనం మనపనిని నిర్వహించాలి.

స్త్రీలంతా కలిసి 'హరహర మహాదేవ' అంటూ నినాదాలు చేశారు.

కోమలమైన ఆ స్వరాల్లోంచి దృఢమైన నినాదాలు అనంతంగా అన్ని వైపులా వ్యాపించి ఇప్పటికీ అమరమై ఉన్నాయి. దీంతో పురుషులు చాలా ఉత్సాహపూరితు లయ్యారు. సిపాయిల నాయకుడు గుల్ మహమ్మద్ 'స్త్రీలు యుద్ధం చెయ్యటానికి తయారైనప్పుడు పురుషులు ఆకాశాన్ని తలక్రిందులు చేయగలిగి ఉండాలి' అని వారినింకా ఉత్తేజితులను చేశాడు.

# 21

జనరల్ రోజ్ సైన్యసమేతుడై మార్చి 20 ప్రొద్దున ఝాన్సీకి 3 మైళ్ళ దూరానవున్న 'కామాసిన్ దేవి' మందిరపు పర్వతం దగ్గరకి వచ్చారు. కాపేపట్లో గుడారాలు వేసుకున్నారు. ఈ గుడారాలని రాణి కోటలోని భవనం మీదినుంచి దుర్భిణీతో చూసింది. ఝాన్సీ అంతా అల్లకల్లోలంగా ఉంది. అది భయంతో కూడిన అల్లకల్లోలం కాదు. ఉత్సాహం, ఆవేశం పొంగులు వారే అల్లకల్లోలం. ఇక్కడినుంచి అక్కడికి గురిచూసి కొట్టడం కష్టం అవటం మూలాన ఫిరంగులు పేల్చేవారందరుకూడా దుర్భిణీలు ధరించారు. మోతీబాయి అశ్వికులతో కలపి వారిమీద దాడిచేస్తే బాగుంటుందని చెప్పింది. రాణి 'ఈ గుడారాల చుట్టుపక్కల ఫిరంగులు అమర్చబడి ఉంటాయి. కోట లోంచే యుద్ధం చెయ్యాలి. ఆంగ్లేయులు చుట్టు ముడతారు. ఇవాళో, రేపో తాంత్యా తోపే వస్తాడు. శత్రువుమీద రెట్టింపుశక్తితో దాడి చెయ్యవచ్చు. అతను కలాపీలోగాని, ఆ చుటుపక్కలగాని ఉంటే ఉంటా'దని చెప్పింది.

'వార్త పంపాలి. ఎవరిని పంపనా అని ఆలోచిస్తున్నా' అంది రాణి.

'ఇంతవరకు జోహీకి ఏ ముఖ్యమైన, పని చెప్పలేదు' అని మోతీబాయి అంది.

'కాని జోహీ చాలా సుకుమారమైనది.'

మోతీబాయి రాణివంక అర్ధవంతంగా చూస్తూ మా దేవిలో ప్రపంచం లోని కోమలత్వం అంతా నిండివుంది. అయినా సమయంవస్తే ఆమెలో ఇనుమును మించిన కాఠిన్యమూ వుంది. ఇటువంటి రాణి సేవకురాలు వార్తా హరురాలుగా పని చెయ్యలేదా? సైనికుడి కుండాల్సిన విద్యలన్నీ నేర్పారు.

బలమైనది కూడాను. పరేకోటద్వారం ఎలాగూ మూసేస్తాం కదా! జోహీని తొందరగా కలాపీ పంపండి' అంది.

రాణి, జోహీవెంట కాశీబాయిని పంపటానికి నిశ్చయించుకుంది. ఆ ఇద్దరూ యువకుల వేషాలు ధరించి బయలుదేరారు. గుఱ్ఱపుస్వారీ బాగా వచ్చినవారు గనుక వేగంగా వెళ్ళిపోయారు. వారు వెళ్ళగానే కోట దాటి పోగానే ద్వారాలన్నీ మూసివేశారు. ఝాన్సీ చాలా అప్రమత్తతగా ఉంది. కాని రాత్రిపూట ఆక్రమణ జరుగలేదు.

మార్చి 21 న జనరల్ రోజ్ తన అనుచరులతో దూరంనుంచి ఝాన్సీ చుట్టు తిరిగి పరిశీలించాడు. ఆక్రమణ చేసేచోటులోను, కీలక స్థానాలలోను ఫిరంగులు అమర్చారు. సేనని భాగాలుగా చేశారు. రోజ్ ఝాన్సీకి నాలుగు వైపులా బందోబస్తు చేశాడు. కామిసిస్ టోరియామీద పెద్ద దుర్బిణీ పెట్టించాడు. అన్నివైపులా దాటటానికీ, రక్షణకీ రెండువిధాలా పనికివచ్చేట్లు కందకాలు తవ్వించాడు. ఒకరి కొకరు సమాచారా లందచేసుకోడానికి వైర్‌లెస్ సెట్ పెట్టించాడు. ఫిరంగు లుంచేందుకు, మందు సామగ్రికోసం ఏర్పాట్లు చేయబడ్డాయి. వీటన్నిటినీ మించి రోజ్ చాలా నేర్పుతో యుద్ధపు టేర్పాట్లు చేస్తున్నాడు.

మంగళవారం మార్చి 23 న రోజ్ యుద్ధం చెయ్యటానికి ఆజ్ఞ ఇచ్చాడు. గుళ్ళవర్షం మొదలైంది. గుళ్ళకి సమాధానంగా గుళ్లు వస్తున్నాయి. పగలు పురుషులు ఫిరంగి కోటనుంచి ఫిరంగులు పేలుస్తుంటే రాత్రిపూట స్త్రీలు. 'తల్లి నిన్ను కన్నది ఈ ఉల్లాసము కొఱకె సఖీ!' అని స్త్రీలు ఉత్సాహంగా పాటలు పాడుతూ పనిచేస్తున్నారు. పురుషులుకూడా చాలా ఉత్సాహంగా పాల్గొన్నారు. అసలు దీన్ని మొదలుపెట్టినవాడు గులామ్ గౌస్ ఖాన్.

గౌస్ ఖాన్ ఆంగ్లేయుల దక్షిణపుపక్క అగ్ర్తమట్టూ మండుతున్న మంటల్ని ఆర్పేశాడు. స్త్రీలు పేల్చిన ఫిరంగులవలన చక్కని ఫలితాలు

కల్పించాయి. కొంచెంసేపయ్యాక రాణి, రాత్రిపూట పురుషులను, పగటి పూట స్త్రీలను ఫిరంగులు పేల్చమని చెప్పింది.

ఆంగ్లేయ జనరల్ తన డైరీలో రాణి సైన్యాన్నిగురించి వ్యాఖ్యానిస్తూ 'Rani's gunners are giving us shot for shot and women are working at the batteries' అంటే 'రాణి ఫిరంగిదారులు గుండుకు సమాధానం గుండుతోనే ఇస్తున్నారు. స్త్రీలు ఫిరంగులు పేలుస్తున్నారు' అని వ్రాసుకున్నాడు.

తూర్పువైపునుంచి ఆంగ్లేయులు ఫిరంగి గుళ్లు పేలుస్తున్నారు. కొన్ని కోటకి తగిలాయి. కొన్ని పట్టణంలోని ఇళ్ళని పాడుచేశాయి. కొంతమంది స్త్రీ పురుషులు చనిపోయారు. బావూ బక్షీ చాలా నేర్పుగా పేల్చాడు. తూర్పుపక్క ఆంగ్లేయుల ఫిరంగులు చల్లబడ్డాయి. ఫిరంగిదార్లు చని పోయారు. ఫిరంగులు వ్యర్థమై పోయాయి. బక్షీ తన భార్యకు ఫిరంగులు అప్పచెప్పి అన్నం తినటానికి బురుజు దిగి వెళ్ళాడు. ముందర్ రఘునాథ్ సింహ్ స్థానాన్ని ఆక్రమించింది. మోతీబాయి ఖుదాబక్ష్ స్థానాన్ని, సుందర్ దూల్హా జూస్థానాన్ని ఆక్రమించారు. రాణి స్వారీచేస్తూ ప్రాకారంచుట్టూ ఉన్న రంగాన్ని చూసిరావటానికి పొద్దున్నే వచ్చి మధ్యాహ్నం వెడుతుండేది. యుద్ధం జరుగుతూనే వున్నది. ఒకరోజురాత్రి పీర్ అలీ సాగర్ కిటికీనుంచి ఆంగ్లేయుల స్థావరందగ్గరికి వెళ్ళాడు. చాలాచోట్ల ఇతన్ని ఆపారు కాని స్నేహితుడనని చెప్తే రోజ్‌దగ్గరికి వెళ్ళనిచ్చారు. దుభాసీలద్వారా రోజ్ తన దౌత్యనాయకులతో కూడి పీర్ అలీతో మాట్లాడాడు.

రోజ్:-కోటలోంచి పేల్చే ఫిరంగి దళానికి నాయకు లెవరు?

పీర్ అలీ:-గులామ్ గౌస్ ఖాన్, బావూ బక్షీ.

రోజ్ ప్రాకారద్వారాల బురుజుల మీదున్న పిరంగిద్వారాల పేర్లు అడిగి తెలుసుకున్నాడు. కోటలోపల, బయట ఎక్కడెక్కడి స్త్రీలు ఫిరంగులు పేల్చేదివిని రోజ్‌తోపాటు మిగతా అనుచరులు నిర్ఘాంతపోయారు.

రోజ్:-ప్రధాన సేనాధిపతి ఎవరు?

పీర్ అలీ:-రాణి.

రోజ్:-ఆహా! ఆహా!

తుపాకీ మందు తయారుచేసే కార్ఖానాగురించి తెలుసుకున్నాడు.

'ముందే చాలా తయారుచేసి పెట్టుకొన్నారు. పైగా కార్ఖానాకూడా ఉంద'ని చెప్పాడు పీర్ అలీ.

కోటలోనుంచి పేలే ఫిరంగులకి, ప్రాకారంనుంచి పేలే ఫిరంగులు పొగలేనివని తెలిసి వాళ్లు చాలా ఆశ్చర్యపోయారు. వాటిని ఎవరు ఎలా తయారుచేసిందీ వాళ్ళకి అంతు పట్టలేదు. పీర్ అలీ దీనికి సమాధానం చెప్ప లేకపోయాడు. అన్ని కుల, వర్గాల ప్రజలు యుద్ధంలో పాల్గొంటున్నారని విని వారు మరింత ఆశ్చర్యాన్ని వ్యక్తం చేశారు.

రోజ్, పీర్ అలీతో 'నువ్వు నీ సాగర్ కిటికీనుంచి మా దళాన్నొకదాన్ని ఊళ్లోకి రానిస్తావా?' అని అడిగాడు.

పీర్ అలీ:-దానివల్ల ప్రయోజనంలేదు. ఆ కిటికీకి సరిగ్గా వెనక ఖజాంచీ కోటలో చాలా పెద్దపెద్ద ఫిరంగులున్నాయి.

రోజ్:-ఏదో ఒక ద్వారపాలకుడితో మాకు స్నేహం నమకూర్చు. నీకు అతనికికూడా బహుమానం ఇస్తాం.

పీర్:-సాధ్యమైనంతవరకు ప్రయత్నిస్తాను.

రోజ్:-పట్టణంలోను, కోటమీద ఎలా పేలిస్తే మా ఫిరంగిగుళ్లు సరిగ్గా తగులుతాయో చెప్పగలవా?

పీర్:-కోటకి దక్షిణంగా వున్న జారీకొండ మీంచి పేలిస్తే....

రోజ్:-ప్రాకారపు దక్షిణద్వారాల్లో ఏదైనా ఒకటి మా కోసం తెరిపించ గలవా!

పీర్:-తప్పక ప్రయత్నిస్తానని మనవి చేసుకున్నాడు.

రోజ్, పీర్ అలీని కృతజ్ఞతలుచెప్పి పంపించాడు.

# 22

ఆ రాత్రికే రోజ్ చాలా కట్టుదిట్టంగా జారీపర్వతంమీద ఫిరంగులు పేర్పించాడు. తెల్లవారుజామున నే ఫిరంగులమూతలు తీయబడ్డాయి. సరిగా లక్ష్యాలవైపు మరల్చారు. ఫిరంగులు ప్రత్యేకమయిన వత్తులతో అంటించి విధ్వంసకార్యక్రమం మొదలుపెట్టారు. పెద్ద మొత్తంలో జనులు చనిపోవటం, గాయపడటం జరిగింది. ఝాన్సీ వీధులన్నీ పాడుపడ్డట్టయినాయి. కోట పశ్చిమభాగపు గోడకి చిల్లి పడింది. నకర పరిస్థితిని రాణి బాధపడింది. వెంటనే గుఱ్ఱంమీద కోటలోంచి బయలుదేరి కురుస్తున్న గుళ్ళని దూసుకుంటూ నగరంలో తిరిగింది. పేట పేటకి వెళ్ళి ఉత్సాహం రేకెత్తించింది. తిండికి, నీటికి ఏర్పాటుచేసి వచ్చింది.

వస్తూవస్తూ గౌస్ ఖాన్‌ని కలుసుకుంది-పశ్చిమంవైపు ఆంగ్లేయులు కొత్త రంగాన్ని తయారుచేశారు. ఫిరంగులతో నగరంలో $\frac{1}{4}$ భాగము పాడయిపోయింది' అన్నది.

'దక్షిణరంగాన్ని ప్రభువులు చూడాలి. నేను పశ్చిమరంగాన్ని చూస్తాను.'

దక్షిణరంగాన్ని బక్షి భార్యకి అప్పగించింది. ఆమె చతురతతో తన పని ప్రారంభించింది. గౌస్ ఖాన్ వెంటనే పశ్చిమం వైపు వెళ్ళాడు. అతను దుర్భిణీతో జారీపర్వతంమీదవున్న ఆంగ్లేయుల ఫిరంగులని చూశాడు.

అక్కడ ఫిరంగులు నడిపేవాడితో 'శత్రువులు ఫిరంగుల్ని మట్టిముద్దల చాటున పెట్టారు, పర్వతపు వెనకపక్కకాదు' అని గౌస్‌ఖాన్ చెప్పాడు.

అతను ఆలస్యం చెయ్యకుండా ఫిరంగుల స్థానం మార్చి మూతలను వేరేపక్కకి తిప్పి పెట్టాడు. గౌస్ ఖాన్ ఫిరంగులకి వత్తితో నిప్పు పెట్టగావే అటుపక్కన మట్టి గూళ్లు కాస్తా ఎగిరిపోయాయి. ఆంగ్లేయులకు ఇంక

పశ్చిమ దిశనుంచి పోరాడే అవకాశంలేకుండా పోయింది. రాణి గులామ్ గౌస్ ఖాన్‌కి బంగారు కంకణాలు బహూకరించింది.

మూడవయామ తర్వాత డ్యూటీ మారింది. స్త్రీలు ఫిరంగులు భీకరంగా పేల్చటం మొదలుపెట్టారు.

రోజ్ వైర్‌లెస్ ద్వారా జారీపర్వతంమీద జరిగిన నష్టాన్నిగూర్చి తెలుసుకున్నాడు. సువర్ట్ అనే ఆంగ్లేయుడు రోజ్ నాయకుడు. అతను నష్టమైన ఆ గద్దని పునర్నిర్మించమన్నాడు. రోజ్ దుర్బిణీద్వారా ఝాన్సీవైపు చూశాడు. స్త్రీలు ఫిరంగులుపేల్చడం, భోజనం చేసేవారిని అందించేవారిని, విరిగిన బురుజులను తిరిగి బాగుచేసేవారిని చూశాడు. ఇంత తీక్షణంగా, ధైర్యంగా భారతీయులు యుద్ధంచేయటం ఇక్కడే చూచాడు. వాళ్ళని ఎదుర్కొనడానికి పథకం తయారుచేశాడు. ఝాన్సీకి దక్షిణవైపునుంచి భయంకరమైన గుళ్ళవర్షం కురిపించమని వైర్‌ద్వారా చెప్పాడు. దక్షిణవైపు బురుజుమీద బక్షీ భార్య ఫిరంగులను నడిపిస్తోంది. ఆమెకూడా వారిని ప్రతిఘటిస్తూ గుళ్ళవర్షం కురిపిస్తోంది. చెమటతో మొహం తడిసిపోయింది. ఆమె పచ్చనిశరీరం మరింత మెరుస్తోంది. ఒక ఆంగ్లసైనికుడు పరుగెత్తుకు వచ్చి ఓడిపోయాడు. కాని ఆంగ్లేయుల ఫిరంగిగుండు ఒకటి బురుజుమీది గోడని చీలుస్తూ బక్షీభార్య బుజంలోకి దూసుకుపోయింది. చెయ్యివిరిగి ఎగిరిపోయింది. ఆమె స్పృహతప్పి పడిపోయింది. తూర్పుపక్క ఉన్న బక్షీకి ఇది తెలిసింది. అతను నిర్వికారంగా 'అమెను మించినామె ఝాన్సీరాణి ఉంది. సాయంకాలం వచ్చి చూస్తాను దహనం చెయ్యకండి' అని చెప్పి పంపాడు.

గీతలో కృష్ణభగవానుడు చెప్పిన మాటల్ని గుర్తుచేసుకుంటూ రెట్టింపు వేగంగా, పిచ్చిధైర్యంతో బక్షీ ఫిరంగుల్ని పేలవటం మొదలెట్టాడు. రోజ్ వాళ్ళ తూర్పురంగం నాశనమైంది.

బక్షీ భార్య చనిపోయిందని తెలిసి రాణి వెంటనే వచ్చింది. ఆమె స్థానంలో ఫిరంగులను కాల్చేందుకు మరొకరిని నియమించింది. బక్షీభార్య రక్తసిక్తమైన శవాన్ని తన ఒడిలోకి తీసుకుంది. కంఠం రుద్ధమైంది. ఆంగ్లేయులు ఎడతెరిపిలేకుండా గుళ్లు కురిపిస్తూనే ఉన్నారు.

ముందర్ పరుగెత్తికొచ్చి 'బాయిసాబ్ ఏమిటి' అని అడిగింది.

రాణి 'గౌసీ' అన్నది.

ముందర్ తెలుసుకొని గౌస్‌ఖాన్‌ని పిలుచుకువచ్చింది. గౌస్ చేతులు కట్టుకుని 'రాణీ! ఇంకా ఎంతమంది సర్దార్లు బలికావాలో. స్వరాజ్యం ఒకరి చావు బ్రతుకులమీద ఆధారపడలేదని తమరే మాకు చెప్పారు. శ్రీమతి బక్షీ అమరత్వం పొందింది. బక్షీని చూడండి నిర్మోహుడై తన కర్తవ్యాన్ని పాలిస్తున్నాడు. తమరు రహస్యమందిరంలో కూర్చుని ఆజ్ఞలు ఇస్తూ ఉండండి నేను ఒక్కొక్క శత్రువుని అంతంచేస్తూ ఉంటాను' అన్నాడు.

శవం అంత్యక్రియలకి కావలసిన ఏర్పాట్లుచేసి రాణి రహస్య మందిరానికి వెళ్ళిపోయింది.

# 23

కోటకి దక్షిణంగా ఉన్న ప్రాకారానికి కొంచెం దూరంలో గోసాయిల గుడి ఉంది. దీనికి ఎదురుగానే ఆంగ్లేయులు ఫిరంగుల్ని నిలవచేశారు. అక్కడి నుంచే కోటమీదికి పేలుస్తున్నారు. కోటలోని ఫిరంగి పేల్చేవారికి అటు పక్కకి ఫిరంగులు పేలిస్తే గుడి పాడైపోతుం దేమోనని భయం వేసింది. గులామ్ గౌస్ చాలా నేర్పుతో గుడి పాడైపోకుండా ఆ ఫిరంగులన్నిటినీ నాశనం చేశాడు.

సాయంకాలానికి శ్రీమతి బక్షీ శవాన్ని దహనం చేశారు. ఆ రాత్రి యుద్ధం కాస్త తగ్గుముఖం పట్టినట్టుంది. ఓరఛా ద్వారందగ్గరున్న దూల్హాజూ స్థానంలో సుందర్ డ్యూటీకి వచ్చింది. ఆమె కాస్త దూల్హాజూని మందలించింది. ఈ వార్త రాణీదాకా వెళ్ళింది. ఆమెకూడా దూల్హాజూని దండించింది. ఎందుకంటే దూల్హాజూని పీర్ అలీ తనపక్కకి తిప్పుకున్నాడు. రాత్రి పూట అతన్ని సాగర్ కిటికీ ద్వారంగుండా రోజ్‌దగ్గరకి తీసుకెళ్లాడు. రోజ్ అతనిచేత తమకి సాయంచేసేటట్లు నమ్మకంగా చెప్పించుకొని ఒట్టేసి ఆంగ్లేయులు గెలవగానే ఒక జాగీరు ఇచ్చేట్లు ఒప్పుకున్నాడు. సాయం చేస్తానని దూల్హాజూ మాట ఇచ్చాడు.

ఆ రోజు దక్షిణ, పశ్చిమరంగాల్లో ఘోరమైన యుద్ధం జరిగింది. ఉత్తరాన ఉన్నావ్ ద్వారందగ్గర, భాండరీ ద్వారందగ్గర యుద్ధం జరుగుతూనే ఉంది. ఆంగ్లేయులు పశ్చిమ దిశనుంచి వేగంగాపేల్చే గుళ్ల తాకిడికి పశ్చిమ ద్వారపుభాగం ఒకటి విరిగిపోయింది. ఖండేరావ్ ద్వారంమీదనుంచి పశ్చిమద్వారం తాళాలతో బంధింపబడినప్పటికీ విరిగిన మార్గంగుండా శత్రువులు ప్రవేశించే ప్రమాదం ఉందని సాగరసింహ్ గుర్తించాడు.

'బుందేల్ వీరుల మానమర్యాదలు, సాగరసింహ్ మానమర్యాదలు మంటగలిపేట్టున్నాయి. మీరంతా తాళం తియ్యకుండా కిందికిదూకి శత్రువుల్ని పారద్రోలండి' అని సాగరసింహ్ అరిచాడు.

తాటివిచ్చెన వేసుకొని వారంతా దాదాపు ఓ వందమంది దబదబా దూకేశారు. వీళ్లు తొందరగా పక్కన ఉన్న బోరియావైపు వెళ్ళారు. ఆంగ్లేయ దళం వస్తుండగానే తుపాకీలు పేల్చేశారు. అటునుంచికూడా తుపాకులు పేల్చారు కాని ఆంగ్లేయ సైనికులు ఛిన్నాభిన్నమైపోయారు. మళ్లీ కూడుకుంటుండగానే సాగరసింహ్ తన అనుచరులతో కత్తి తీసుకు దూకాడు. అందర్నీ చంపేశాడు. కాని ఖండేరావ్ ద్వారందగ్గర సాగర్‌సింహ్ హతుడయ్యాడు. మిగిలిన సైనికులు లోపలికి వెళ్లారు. గోడ బాగుచేశారు. సాగర్‌సింహ్ చనిపోయాడని వినగానే రాణి కళ్ళముందు బరవాసాగర్ ఘటనంతా మెదిలింది. 'సాగర్‌సింహ్ లాంటి శౌర్యవంతులు, వీరులు పుట్టిన ఈ దేశానికి స్వాతంత్ర్యం రావటానికి ఇంకెంతోకాలం పట్టద'నుకున్నది.

పొద్దున్నే ఆంగ్లేయులు పశ్చిమద్వారంవైపు దుర్భిణీతో చూస్తే గోడ ఎక్కడా పాడైనట్లే కన్పించలేదు.

మళ్లీ రెండువైపులనుంచి గుళ్లవర్షం ప్రారంభమైంది. విరిగినగోడలు వెంటనే బాగుచేస్తున్నారు. ఝాన్సీరాణి ధైర్యం అభేద్యమైతే ప్రజలధైర్యం అచంచలమైంది.

కోట భవనంమీద వినాయకుడిగుడి ఉంది. దీనిమీద శత్రువులు పేల్చిన గుండు ఒకటిపడి విగ్రహంతప్ప మిగతా గుడినంతా నాశనం చేసింది. ఝాన్సీవాసులు తల్లడిల్లిపోయారు.

రాత్రికి మళ్లీ యుద్ధం కాస్త తగ్గింది. మళ్లీ రెండోరోజు ఘోరంగా జరిగింది. ఓరఛా ద్వారం దూల్హాజూ చేతిలో ఉంది. ఆమె రాత్రంతా

జాగారంచేసింది. ఆజ్ఞ అవగానే స్నానం అదీచేసి కాస్తతిని మళ్ళీ ఓరఛా ద్వారందగ్గర కెళ్ళింది.

క్రిందటి రోజుకి మల్లె ఈరోజుకూడా యుద్ధం బాగా జరిగింది. ఒక్క ఓరఛా బురుజుమీద ఫిరంగులు పేలటంలేదు. మందు తయారౌతుంది. అటుపక్కనుంచి భవనంముందు మందు తయారుచేసే చోటికి ఓ గుండు వచ్చి పడగానే అదంతా పేలిపోయి 20, 30 మంది ఎగిరిపోయారు. అంతా అల్లకల్లోలమయింది. కాసేపటికి అది తగ్గింది. పోయినవారి స్థానంలో కొత్తవారు నియమింపబడ్డారు. రాణీ పని ఏకాగ్రతతో జరిగిపోతుంది. అన్ని రంగాలనుంచి ఆమెకి వెంటవెంటనే కబుర్లు తెలుస్తుందేవి. ఆమె ఉత్తర్వు లిస్తూ ఉండేది. ప్రజల క్షేమసమాచారాలు కనుక్కోటానికి నగరమంతా తిరిగివచ్చేది. గీతాపఠనంకోసం క్రమం తప్పకుండా కాస్త సమయం కేటాయించుకునేది.

# 24

తాంత్యా చరీఖారీని జయించి కలాపీకి తిరిగివచ్చాడు. సిపాయిలు విజయో త్సవం చేసుకున్నారు.

తాంత్యా కలాపీలోని విశాల శస్త్రాగారాన్ని పరిశీలిస్తున్నారు. రకరకాల గుళ్ల తయారుచేస్తున్నారు. తుపాకులు చేస్తున్నారు. అక్కడ రెండువేల మణుగుల తుపాకీ మందున్నది. మందు ఇంకా తయారుచేస్తున్నారు. అప్పుడే జోహీ, కాశీబాయి వచ్చారు. ఝూన్సీ విషయాలన్నీ చెప్పారు. తాంత్యా ఒక సైన్యవిభాగాన్ని తీసుకొని సహాయం చెయ్యటానికి బయలుదేరాడు. కాని ఝూన్సీ చేరటానికి 7, 8 మైళ్ళముందే రోజ్‌తో తలపడాల్సి వచ్చింది. తాంత్యా చావగా మిగిలిన సేనని తీసుకొని కలాపీ వెళ్ళాడు. జోహీ అతని వెంట వచ్చింది. కాశీబాయి జాడ తెలియలేదు.

రాణి తాంత్యా వచ్చి వెళ్ళిపోయిన సంగతి తెలుసుకుంది. అయినా అధైర్యపడలేదు. ధైర్యంగా తనపని తను చేసుకుపోతోంది. కోటలోని సిపాయిలను, పనిచేసేవాళ్ళని ఉత్సాహపరచటానికి స్వయంగా రాసులకొద్దీ గోధుమపిండి కలిపి పూరీలు చేసిపెట్టింది. సిపాయిలు చాలా రుచిగా ఉన్నా యంటూ తిన్నారు. రాణి చిన్న రొట్టెముక్క తన తలపాగ కొంగున కట్టు కుంది. సిపాయిలు ఉన్మత్తులై యుద్ధంలో పాల్గొన్నారు. భయంకరమైన యుద్ధం జరుగుతోంది. ఒక్క ఓరఛా బురుజునుంచి పని సరిగ్గా జరగటం లేదు. సుందర్ అక్కడికి వచ్చింది. దూల్హాజూ సుందర్‌ని అక్కడ నిలువ నియ్యలేదు. ద్వారానికి పశ్చిమంగా ఒక టోరియా ఉంది. ఆ టోరియా బురుజుమీదికి సుందర్ వెళ్ళింది.

ఓరఛా ద్వారానికి ఈ టోరియానుంచి సైయ్యర్‌ద్వారం కాస్త దూరంగా ఉంది.

ఈ రెండుద్వారాలమధ్య ఆంగ్లేయుల ప్రాకారాన్ని ఆక్రమించటానికి సేనతో తయారుగా ఉన్నారు. ప్రాకారాని కావల దక్షిణవైపు ఎగుడు. దిగుడు పర్వతాలు. భూమి అంతా ఎత్తు పల్లాలుగా ఉంది. ఆంగ్లేయసేన దాడి చెయ్యటానికి, స్వరక్షణకి దీన్ని ఉపయోగిస్తున్నారు. ఓరఛా ద్వారానికి కాస్త ఎదురుగా ఒక పర్వతం వెనక ఎఱ్ఱజెండా ఎగిరింది. ద్వారందగ్గర ఫిరంగులు కాస్త క్షీణించాయి. రాణి దుర్బిణీతో ఫిరంగులు పేలటం. ఆంగ్లేయులు ఓరఛా ద్వారంవైపుకి రావటం చూసింది. ఎఱ్ఱజెండా ఇంకా పైకి ఎగిరి మళ్లీ మాయమయింది. రాణి అక్కడనుంచి ఫిరంగిగుళ్లు పేలటం లేదు. కేవలం మందు తగలడుతోందని తెలుసుకుంది.

సుందర్ ఎంతోసేపు ఫిరంగులు పేల్చలేకపోయింది. తనతోపాటు ఫిరంగులు పేల్చేవారంతా చనిపోయారు. ఆమె దూల్హాజూ చేసినమోసం తెలుసుకుంది. తెల్లవాళ్ల సేన 'హుర్రే' అని గోలచేస్తూ ఓరఛా ద్వారందగ్గరికి వస్తూండటం చూసింది. దూల్హాజూ ఒక ఇనుప చేతికట్టె తీసుకుని బురుజు కిందికి ఉరికాడు. వెంటనే కత్తి తీసుకొని సుందర్ అతని వెనక పరుగెత్తింది. ద్వారందగ్గరికి వెళ్ళేసరికి కాస్త ఆలస్యం అయింది. ద్వారానికి పెద్దపెద్ద సంకెలలువేసి వానికి పెద్ద తాళాలు వేసివున్నాయి. తాళాలు కోటలో ఉన్నాయి. కాని దుల్హాజూ చేతిలో తాళాలు తీసేందుకు సాధనం వుంది. అతను ఒక్క దుముకు దుముకి తాళాలు తీశాడు. రెండు, మూడు సంకెళ్లు కూడా తీసేశాడు. మూడోది కింద ఉంది. దుల్హాజూ ద్వారం తెరిచేలోపల సుందర్ వచ్చింది.

'దేశద్రోహీ! వేరు పురుగులాగా ఏమి టీపవి. ఆంగ్లేయులు నీకేమి ఇవ్వరు' అంటూ సుందర్ అతనిమీద విరుచుకుపడింది. కత్తితో దూల్హాజూ చేతిలోవున్న తాళాలు తీసే సాధనంమీద కొట్టింది. కత్తి విరిగింది. ఆ విరిగిన కత్తితోనే దూల్హాజూ మీదికి ఉరికింది. దూల్హాజూ తన దగ్గరవున్న

ఇనప సాధనంతో సుందర్‌ని కొట్టాడు. అయినా సుందర్ ఏమీ జంక లేదు. తెల్లవాళ్లు ఈలోపల గేటు బద్దలుకొట్టుకు వచ్చారు. సుందర్ 'హర హర మహదేవ్' అంటూండగానే తెల్లవారు పేల్చిన గుండు ఒకటి ఆమె తలలోంచి దూసుకుపోయింది. సుందర్ కన్నుమూసింది. ఆఫీసర్ 'ఈమేనా ఝాన్సీ రాణీ' అని అడిగాడు.

'లేదు! సేవకురాలు!' అని సమాధానమిచ్చాడు దూల్హాజూ.

చనిపోయిన సుందర్ గుప్పిలి గట్టిగా పట్టుకొని ఉంది. కత్తిపిడి ఒరలో ఉంది. ఇద్దరు తెల్లవాళ్లు ఆమె శవాన్ని బయటకి తీసుకు వచ్చి రాళ్ళతో కప్పెట్టారు. తెల్లవాళ్లు నగరం నాలుగుపక్కలా కమ్ముకొన్నారు.

ఓరఛా దుర్ఘటన జరగకమునుపే, దూల్హాజూ ఫిరంగులు సరిగా పేల్చక పోవటం చూసి, రాణీ మోతీబాయిని పంపింది. ఆమె సైయ్యర్ ద్వారం గుండా వచ్చింది. సైయ్యర్ ద్వారపు బురుజుమీద ఖుదాబక్ష్ ఉన్నాడు. అతను మోతీబాయిని ముందుకు సాగనివ్వలేదు. ఎందుకంటే తెల్లవాళ్ల దళాలన్నీ సైయ్యర్ ద్వారంవైపు, దానికి పశ్చిమంగావున్న ప్రాకారం వైపుకు ముమ్మరంగా వస్తున్నాయి. ఖుదాబక్ష్—'ఓరఛా ద్వారంవైపుకు వెళ్ళకు అక్కడ సుందరీబాయి ఉంది. నా వెంట ఉండు, ఇవాళ మన దేశం పేరు, మన రాణీపేరు, మన ఝాన్సీపేరు వన్నె కెక్కేటట్లు చేస్తాను. అమరంగా ఉండేటట్లు చేస్తాను' అన్నాడు.

మోతీబాయి ఏడ్చింది.

ఖుదాబక్ష్ ఫిరంగులు పేలుస్తూ, 'ఛీ! ఇప్పుడా కన్నీళ్లు!' అనగానే మోతీబాయి కళ్లు తుడుచుకొని పనిలో నిమగ్నురాలైంది. రాణీ దుర్భిణిలో యుద్ధాన్ని తిలకిస్తోంది. ఉత్తరంవైపు ద్వారాలమీద లేభవోరీ, ఠాకూర్, పశ్చిమద్వారంమీద తేలీ - చాలా పరాక్రమంగా యుద్ధం చేస్తున్నారు.

పైయ్యార్ ద్వారందగ్గర ఘోరమైన యుద్ధం జరుగుతూండటం చూసింది. కబురేం అందలేదు. రామచంద్ర దేశ్‌ముఖ్‌ని పంపింది. అతను గుజ్జం మీద వేగంగా వెళ్లాడు.

అతను అక్కడికి చేరేముందే ఖుదాబక్ష్ గుండుదెబ్బకి చనిపోయాడు. ద్వారపు బయటి మెట్లమీదనుంచి ఒక తెల్లవాడు బురుజుని పట్టుకొని లోపలికి రావటానికి ప్రయత్నం చేస్తుండగా మోతీబాయి మెరుపులాగా అతన్ని గుజ్జంమీదనుంచి పడేసింది. జీనుజారిపోయింది. మోతీబాయి ఖుదా బక్ష్ శవాన్ని తీసుకుపోవటానికి సిద్ధమవుతుంటే దేశ్‌ముఖ్ వచ్చాడు. అతను గుజ్జంమీద మోతీబాయిని కూర్చోపెట్టమని శవాన్ని తీసుకుని కోటలోకి వెళ్ళిపోయాడు. కోటద్వారం మూసేశారు. అదేసమయంలో ఓరఛా ద్వారంనుంచి తెల్లవారిదళాలు ప్రవేశిస్తున్నాయి. రాణి ఖుదాబక్ష్ శవాన్ని చూచి దుఃఖించింది. అంతలోనే తన్నుతాను సంబాళించుకుని శవాన్ని భవనానికి పక్కనే పాతిపెట్టమంది. గోరీ తవ్వటం మొదలు పెట్టారు.

జనరల్ రోజ్‌కి వైర్‌లెస్‌ద్వారా నగరాన్ని జయించినవార్త తెలిపింది. అతను ఇంకా తీవ్రంగా ఎదుర్కోమని ఆదేశ మిచ్చాడు.

సుందర్ చనిపోయిందని శత్రువులు ఓరఛా ద్వారంగుండా నగరంలోకి వస్తున్నారని రాణికి తెలిపింది. రాణి పెదవి కొరుక్కుంటూ దుర్బిణీ తీసు కొని బురుజు ఎక్కింది. రోజ్ నగరపు బురుజుని వశపర్చుకున్నాడు. తెల్ల వాళ్లు ముట్టడించటానికి ప్రయత్నం చేస్తున్నారు. వారిని ఝాన్సీ సిపాయిలు ఎదిరిస్తున్నారు. రాణి కిందికి దిగింది.

'ఝాన్సీ సర్వనాశనమైపోతోంది. స్వరాజ్యస్థాపన కింకా సమయం ఆసన్నం కాలేదు. కాని కర్తవ్యాన్ని నిర్వర్తించాలి' అనుకుంది రాణి.

ఆవిడ తన సర్దార్లందరినీ పిలిచింది. 'బయటికివెళ్ళి ఎదుర్కొనండి. తెల్లవాళ్లని నగరంనుంచి తరిమేసి ఝాన్సీని రక్షించండి' అని ప్రోత్సహించింది.

అందరూ ఉత్సాహంగా బయలుదేరారు. రాణి నాయకత్వం వహించింది. నానా భోపట్కర్‌కి ఆమె బయటికి వెళ్ళడం ఇష్టం లేదు. అయినా తటస్థంగా వుండిపోయాడు. రాణివెంట 500 మంది పఠానులు, 1000 మంది బుందేల్‌ఖండీలు ఉత్సాహంతో యుద్ధంలోకి బయలుదేరారు.

ఘోరమైన యుద్ధం జరిగింది. తెల్లవాళ్లు ఆ ధాటికి ఆగలేకపోతున్నారు. కాని ఇళ్లచాటునుంచి గుళ్లు కురిపిస్తున్నారు. రాణి తుపానుకు మల్లె వేగంగా, ఉధృతంగా విజృంభించింది. 'భారతీయ సైనికుల కత్తిముందు ప్రపంచంలోని ఏ వీరుడూ నిలవలేడని ఇవాళ ఋజువు చెయ్యండి' అని రాణి సైనికులను హెచ్చరించింది.

యుద్ధం ఇంకా భయంకరంగా సాగుతోంది. తుపాకీలయుద్ధం తగ్గి కత్తియుద్ధం ఎక్కువగా జరుగుతోంది. తెల్లవాళ్లు వీళ్ల ముందు ఆగలేకపోయారు చాలామంది చనిపోయారు. నానా భోపట్కర్ పరుగెత్తుకొనివచ్చి ఆయాసంతో 'ముందు ఈ ముసలివాడిని చంపి తమరు గుండుదెబ్బ తినండి....' అన్నాడు.

రాణి గాభరాగా 'నానాసాబ్! ఏమిటది?' అంది.

'తమరు చూస్తున్నారుగా ఇళ్ళచాటునుంచి గుళ్లు కురిపిస్తున్నారు. మీకు దెబ్బ తగిలిందంటే ఝాన్సీ పాతాళానికి క్రుంగిపోయిందన్నమాటే. ఇహ మిగిలింది మనకోట. యుద్ధం జరుగుతూ వుండనివ్వండి. మీరు లోపలికి వెళ్ళండి.'

రాణికి అంతా అర్థమయింది. గుల్ మహమ్మద్ పక్కనే ఉన్నాడు. అతనుకూడా రాణిని లోపలికెళ్ళమని ప్రార్థించాడు. రాణి ఉత్తరంవైపు

ద్వారంనుంచి 300 మంది పఠానులతోను, మిగిలిన బుందేల్‌ఖండ్‌లతోను కోటలోకి వెళ్ళింది. బుందేల్‌ఖండీలు చాలామంది చనిపోయారు. కోట ద్వారం మూసేశారు.

నగరంలో తెల్లవాళ్లు యువకులను, వృద్ధులను, పిల్లలను క్రూరంగా చంపేస్తున్నారు. కొంతమంది స్త్రీలనుకూడా చంపారు. బక్షి, పీర్ అలీ లాంటి కొంతమంది పగ తీర్చుకుంటున్నారు.

## 25

ఆంగ్లేయ సైనికులు ఇంటింటికీ వెళ్ళి వెండి, బంగారు సామాన్లనీ లూటీ చేయటం మొదలెట్టారు. పట్టణంలోని భవనంవైపు, ఆంగ్లేయులు చాలా అల్లకల్లోలం చేస్తున్నారు. భవనం వెనుకపక్కన ఉన్న నాటకశాలలో రాణి అశ్వికదళం ఉంది. వీళ్లలో 50 మంది బుందేల్ వీరులు ఉన్నారు. వీళ్ళల్లో ఏ ఒక్కరూ బతికున్నా ఈ అశ్వికదళంమీద, భవనంమీద అధికారం చేజిక్కించుకోలేరు. భవనానికి ఎదురుగా ఉన్న గ్రంథాలయందగ్గర బాగా యుద్ధం జరుగుతోంది. రాణి సిపాయిలందరూ చచ్చిపోయారు. శత్రువులు అశ్వాశాలకి భవనానికి నిప్పుపెట్టారు. గ్రంథాలయంకూడా తగలబడిపోతూంది, ఆ గ్రంథాలయంలో వేదాలప్రతులు, అముద్రిత గ్రంథాలు, శాస్త్రాలు, పురాణాలు, కావ్యాలు, చరిత్రలు, అరబీ, పారసీగ్రంథాలు ఇవన్నీ తగలడిపోవడంచూసి రాణి మూర్ఛిల్లింది, ముందర్ వెంట ఉన్నది. అతి కష్టంమీద రాణి తేరుకుంది.

అణగారిన స్వరంతో 'ముందర్! ముందర్! మన ప్రియమైన ఝాన్సీకి పట్టిన గతి ఇదా! నేను బతికుండగానే!' అని రాణి అంటుంటే ముందర్ ఆమెని భవనంలోకి తీసుకు వెళ్ళింది. ద్వారం దగ్గరున్న అరుగుమీద కూర్చుని ఏడ్చింది....లక్ష్మీబాయి ఏడ్చింది....భారతీయ నారీత్వానికి, గౌరవానికి, అభిమానానికి ప్రతిబింబమైన లక్ష్మీబాయి ఏడ్చింది.

ఇంతలో రామచంద్ర దేశ్‌ముఖ్ వచ్చి 'రాణీ! రాకుమారుడు గులామ్ గౌస్ ఖాన్ గుండుదెబ్బ తగిలి మరణించాడ'ని చెప్పాడు.

రాణి ఆడ సింహంలాగా లంఘించి 'ఖాదూ బక్షిని గులామ్ స్థానంలోకి పంపి శవాన్ని ఇక్కడికి తెప్పించండి' అని ఆజ్ఞ ఇచ్చింది. రామచంద్ర

దేశ్‌ముఖ్ వెళ్ళిపోయాడు. భావూ తీవ్రంగా గుళ్ళవర్షం కురిపించటం మొద లెట్టాడు.

రాణి గులామ్ శవాన్ని ఖుదాబక్ష్‌ని పాతిపెట్టాల్సినచోటే పెట్టించింది.

ఇంకా మిగిలిన బురుజులమీద పని తీవ్రంగానే సాగుతోంది. కాని దక్షిణవైపు బురుజుమీదమాత్రం ఫిరంగులు పేలవటం లేదు. రాణి ఆ పక్కకి మోతీబాయిని పంపింది. ఆ మోతీ వెళ్ళి తన పనిలో నిమగ్నురాలయింది. శత్రువులు ఆమె ఉన్నచోటికి గుళ్ళు తగిలేటట్లు పేలుస్తున్నారు. ఆంగ్లేయులు కోట ప్రధానద్వారందగ్గరికి వచ్చేశారు. కోటగోడ చాలాచోట్ల దెబ్బతిన్నది. కొన్నిచోట్ల గోడ బురుజులన్నీ దెబ్బతిన్నాయి. బాగు చేసేందుకు వ్యవధి లేదు. మోతీబాయి గుళ్లదెబ్బలనుంచి తప్పించుకుంటూ ఫిరంగులు పేలు స్తున్నా ఒక గుండువచ్చి భుజానికి తగిలి భుజం విరిగిపోయింది. చావు ఎలాగు తప్పదు. ఆమెతో పనిచేసే ఒక సైనికుడు మోతీబాయిని బురుజు మీదనుంచి భవనంలోకి తీసికెళ్లి నీళ్లు తాగించాడు. ఇంకా స్పృహ ఉంది.

ముందర్ దక్షిణపు బురుజు దగ్గరికివెళ్ళి యుద్ధం చేస్తానని రాణిని ప్రార్థించింది.

'ఉహూ। నువ్విక్కడే ఉండు. నిన్ను చూస్తూచూస్తూ పోగొట్టుకోలేను' అంది రాణి.

మోతీబాయి తల తన ఒడిలో పెట్టుకుంది రాణి. పక్కనే ఖుదాబక్ష్, గులామ్ శవాలున్నాయి.

మోతీబాయి కంపిస్తున్న స్వరంతో 'రాణీ। ఈ ఒడిలో తలపెట్టుకుని చచ్చిపోటం ఎంత అదృష్టం. ఈ అదృష్టం ఎవరెవరికి దక్కనున్నదో।' అన్నది.

వచ్చే ఏడుపు నాపుకుంటూ 'నువ్వు మోతీ (ముత్యానివి) గాదు నా వజ్రా నివి' అన్నది రాణి.

వాడుతున్న మోతీబాయి మొహం ఒక్కసారి ప్రకాశించింది. కళ్లు సగం మూసుకున్నాయి. పెదవులు అదురుతున్నాయి. 'రాణీ....వెలుగొం....దాలి' అంటూ ఆ వాడిన పువ్వు అనంతమైన దీప్తితో వెలిగి ఆరిపోయింది.

రాణి ఒడి మోతీబాయి రక్తంతో తడిసిపోయింది. రాణి లేచి 'వీళ్ళ ముగ్గురి గోరీలు ఒకేచోట వేరువేరుగా.........' అన్నది.

అంత్యక్రియలు గులామ్ మహ్మద్ చేశాడు. వారిముగ్గురికీ అభివాదన సూచకంగా రఘునాథసింహ్ తుపాకులు పేల్చాడు.

సాయంకాల మవ్వొస్తోంది. తొందర తొందరగా ఆ ముగ్గిరి గోరీలమీదా గట్టిగా చప్టా చేయించి, రాణి కడిగి స్నానం చేయించింది. యోధుడిలా వేషం వేసుకుంది. పూజా పునస్కారా లయింతర్వాత భవనం కింద భాగం లోని సన్నిహితులయిన వ్యక్తులను పిలిపించింది.

మీరంతా ఝాన్సీని రక్షిండానికి అతులితమైన శౌర్యప్రతాపాలతో ప్రాణాలకు తెగించి పోరాడారు. దాదాపు మన నాయకులు, యోధులు అంతా వీర స్వర్గం అలంకరించారు. మన నాలుగువేల సేనలో 400 మందికూడా మిగల లేదు. ఆంగ్లేయులు కోట ముట్టడించారు. కోట చాలాచోట్ల దెబ్బ తిన్నది. శత్రువులు లోనికి రావటానికి మహా పడితే, ఒకటి, అరా రోజులు పడుతుంది. మీలో పోట్లాడుతూ చనిపోగా మిగిలినవారిని శత్రువులు క్రూరంగా హింసిస్తారు. నేనుమాత్రం పట్టుబడను. ఒకవేళ ఫిరంగి దెబ్బతిని మరణిస్తే మన పూర్వులకి చాలా అవమానం. చావుకు ఒకే ఒక సాధనం నాదగ్గర ఉంది. తుపాకీ మందున్న కొట్లోకివెళ్లి పిస్తోలుతో పేల్చుకుని మన పూర్వుల్లో కలసిపోతాను. కోటనుంచి బయటికి పోవటానికి చీకటిరాత్రి మనకు సాయం చేస్తుంది.

భావూ బక్షి కంపనస్వరంతో 'నేనుకూడా ప్రభువుల సేవకోసం ఆ మందు సహాయంతో మీతో వస్తాను' అన్నాడు.

నానా భోపట్కర్ వెంటనే 'మీరు! ఆత్మహత్య చేసుకుంటారా! కృష్ణ భగవానుడు చెప్పిన గీతంతా తమకి కంఠోపాఠమే కదా! మీరు ఇంతవరకు ప్రతినిమిషం స్వరాజ్యస్థాపనకోసం ఎంత ప్రయత్నం చేస్తూవచ్చారు. అటు వంటి మీరు ఆత్మహత్య చేసుకుంటారా! మీరు ప్రజలని రక్షించడానికి కంకణం కట్టుకున్నారే! ఆ ప్రజలు మీరు చనిపోతే ఏమనుకుంటారో తెలుసా!' అన్నాడు.

రాణి ఆలోచనలో పడ్డది. భోపట్కర్ దామోదరరావుని తీసుకురమ్మని ముందరకి సంజ్ఞ చేశాడు. ఆమె తీసుకురావటానికి వెళ్ళింది.

రాణి కళ్ళముందు కురుక్షేత్రం దృశ్యం కదలాడింది.

కురుక్షేత్రం.........కౌరవ పాండవులసేన ఒకదానికొకటి ఎదురుగా ఉంది. అర్జునుడు కృష్ణుడితో 'భగవాన్! నా ధైర్యం నశించింది. ఇంక నావల్ల కాదు. యుద్ధం చేయలేను' అంటున్నాడు.

కృష్ణుడు ఉపదేశించినమీదట అర్జునుడు గాండీవాన్ని ధరించి.........

రాణి మనస్సులో ఒకవిధమైన కాంతి గోచరించింది. అప్పుడే ముందర్ దామోదరరావుని తీసుకువచ్చింది. అతను వచ్చి రాణి ఒళ్లోకి దూకాడు.

రాణి లేచింది. నానా భోపట్కర్ పాదాలను స్పృశించింది. 'నన్ను క్షమించండి, నానాసాబ్. సోదరులారా! క్షణికమైన బలహీనాన్ని మర్చిపోండి. నేను యుద్ధం చేస్తాను. మీ అందరియెదుటా ప్రమాణం చేస్తున్నాను. ఆంగ్లేయులందరినీ నేను ఒక్కదాన్ని ఎదుర్కొనవలసి వచ్చినా ఎదుర్కొంటానని ప్రమాణం చేస్తున్నాను.'

అటువంటి విపత్కరమైన పరిస్థితిలోకూడా కోటలో ఉన్న స్త్రీ పురుషు లందరిలోను నూతనోత్సాహం వెల్లివిరిసింది.

రాణి:-మీరంతా కాస్త ఎంగిలి పడండి. ఆయుధాలు ధరించలేనివారు, పోరాడలేనివారు సొరంగద్వారంగుండా బయటికి వెళ్ళిపొండి. మిగిలినవారు నాతో ఖాండేరీ ద్వారంవైపునుంచి కలాపీకి రండి' అంది.

అంతా ఆమోదించారు.

రాణి:-'ఖాండేరీ ద్వారందగ్గర ఏర్పాటు ఎవరు చేస్తారు?' భావూ బక్షీ ఆ బాధ్యత స్వీకరించాడు. అతని ఇల్లు సాలెవాళ్ళ పేటలోనే ఉంది. వాళ్ళని అతను బాగా ఎరుగున్నాడు. బక్షీ గుప్తమార్గంనుంచి వెళ్ళిపోయాడు. నానా భోపట్కర్, మరి కొంతమంది ఏడ్చుకుంటూ వెళ్ళిపోయారు.

రాణి జవాహర్‌సింహ్‌కి 'మీరు మీ చోటికివెళ్ళి సేనని పోగుచేసి కలాపి వెళ్ళండ'ని ఆజ్ఞ ఇచ్చింది.

'నేను ప్రభువులను సురక్షితమైన చోటికి చేర్చినతర్వాతే మరోపని చేస్తా'నన్నాడు.

రాణి ఒప్పుకుంది.

కొంచెం సేపయినతర్వాత రాణి ముందర్‌ని తీసుకుని శంకరుని గుడి కెళ్ళింది. ధ్యాన వందనా లాచరించి తిరిగి వచ్చారు.

మోరోపంత్ తాంబే చాలా ధనాన్ని, వజ్రాలు, ముత్యాలు మొదలైనవి తీసుకొని మూటకట్టాడు. కోట ఉత్తరభాగంలో కిందికి వెళ్ళే ద్వారానికి పక్కన ఒక అశ్వశాల, ఏనుగుశాల ఉన్నాయి. యుద్ధపురోజుల్లో జవాహర్ సింహ్, రఘునాథసింహ్ అక్కడే ఉండేవారు. మోరోపంత్ ఒక ఏనుగు మీద సామానంతా కట్టాడు. రాణి, ముందర్ పురుషవేషాలు ధరించారు. ఎంతో రాత్రి కాలేదు. అయినా బాగా చీకటిగా ఉంది. రాణి, దుప్పటిలో దామోదరరావుని తన నడుముకి కట్టుకుని కోట ఉత్తరద్వారంద్వారా బయటికి వెళ్ళింది. ముందు ఆమె, వెనక ముందర్, జవాహర్‌సింహ్, రఘునాథ సింహ్, పఠాన్లు. ద్వారం కిందికి మెట్లున్నాయి. ఝాన్సీకి, కోటకి నమస్క-

రించి భాండేరీవైపు వెళ్ళారు. మోరోపంత్ ఏనుగు వెనక ఉంది. రక్షక భటులు కత్తులతో అటూ, ఇటూ కాపలాగా నడుస్తున్నారు.

ఈ జ్వాల కోతవాలీ దగ్గరకు చేరగానే యుద్ధం జరిగింది. రాణి ఆంగ్లేయ దళాన్ని చీల్చుకుంటూ, దూసుకుంటూ వెళ్ళిపోయింది. మళ్ళీ ఆమె సైనికులతో తలపడ్డారు. రెండుపక్కలవారు చాలామంది మరణించారు. మిగిలిన సైనికులు రాణివెనక పరుగెత్తారు. దోవలో మండే ఇళ్ళ వెలుగు బాగా కన్పిస్తోంది. రాణి, అనుచరులు భాండేరీ ద్వారందగ్గరికి వెళ్లారు. ఇక్కడ భావూ బక్షీ సాలెవాళ్ళతోకలసి కత్తియుద్ధం చేస్తున్నాడు. రాణి అక్కడికి పోగానే యుద్ధం తీవ్రరూపం దాల్చింది. బక్షీ ద్వారం తెరిచాడు. రాణి, జవాహర్ సింహ్, రఘునాథసింహ్, ముందర్ వాళ్లు బయటికి వెళ్ళిపోయారు. బక్షీ ద్వారంపక్క యుద్ధం చేస్తూ చేస్తూ చచ్చిపోయాడు. చచ్చిపోయేముందు అతను రాణినిచూసి 'ఝాన్సీరాణీకి జై' అన్నాడు. మిగిలిన ఆంగ్లేయ సైనికులు పారిపోయారు. సాలెవాళ్లు భాండేరీద్వారం మూసేశారు. ద్వారం మూయబోయేముందు మోరోపంత్ ఏనుగుమీద వెళ్ళిపోయాడు. ఈయన ఉత్తర పశ్చిమలదిశగా ఉన్న దాతియావైపుకి వెళ్ళాడు. రాణి తూర్పువైపు దొంకల గుండా కలాపీ వెళ్లేందుకు బయలుదేరింది. కలాపీ ఝాన్సీనుంచి 100 మైళ్ల దూరంలో ఉంది.

మోరోపంత్ యుద్ధంచేస్తూ ప్రాతఃకాలానికి దాతియా చేరుకున్నాడు. అక్కడ అతనిదగ్గరున్న విలువైన వస్తువులన్నీ లాక్కుని ఝాన్సీలో వున్న ఆంగ్లేయులదగ్గరికి పంపారు. అదేరోజు మోరోపంత్‌ని ఉరి తీశారు.

రాణీ భాండేరీ ద్వారంగుండా వెళ్ళిందని ఝల్‌కారీకి తెలుసు. ఆవిడ ఝాన్సీరాణిని పోలి ఉంటుంది. కాస్త రంగులో తేడా. రాణి తెల్లగా ఉంటే ఈవిడ కాస్త శ్యామలవర్ణంలో ఉంటుంది. ఈవిడకి ఓ గుఱ్ఱం దొరికింది. రాణి ఎక్కి ఆంగ్లేయుల శిబిరంవైపు పరుగెత్తించింది. తన్ని

తను అర్పించుకుని రాణిని రక్షించుకోవాలని ఆవిడ ఆశయం. 'నేనే రాణీ నని మోసగిస్తాను. ఈలోపల రాణి తప్పించుకుంటుంది' అనుకుంది. కాని రహస్యం ఎంతోసేపు నిలవలేదు. రోజ్ అసలు రాణి పారిపోతున్నట్టు తెలుసుకుని ఆమె వెనుక లెఫ్టినెంట్ బోకర్‌ని కొంత సేనయిచ్చి పంపాడు. ఝల్‌కారీని చంపకుండా ఖైదు చేశారు. కాసేపయినతర్వాత ఆమెని వదలి పెట్టారు.

రాణికి, ఆమె అనుచరులకి కోట కావలవున్న ప్రాంతమంతా కొట్టిన పిండి. ఆంగ్లసేన భాగం ఒకటి వారితో తలపడింది. వాళ్ళని తప్పించుకుని 12 మంది మిగిలిన సైనికులతోను రాణి వెళ్ళిపోయింది. దోవ చాలా దుర్గమంగా ఉంది. నిశ్శబ్దంగా ఉంది. కీచురాళ్లు అరుస్తున్న ధ్వని. అవిగాక గుఱ్ఱపు డెక్కల చప్పుడు. గుఱ్ఱాలు పరుగెత్తటం మూలాన దెబ్బతిన్నాయి. 10, 12 మైళ్లు పరుగెత్తాక కాసేపు ఆగారు.

రాణి, రఘునాథసింహ్, జవాహర్‌సింహులతో 'ఇంక మీరు తిరిగి వెళ్ళిపొండి. సేనని పోగుచేసి కలాపీ రండి' అని చెప్పింది.

'ఈపని దివాన్ జవాహర్‌సింహ్ సమర్థవంతంగా నిర్వహించగలడు. నేను ప్రభువుల వెంటనంటి వుంటా' నన్నాడు రఘునాథసింహ్.

రాణి ఒప్పుకోక తప్పలేదు. జవాహర్‌సింహ్ రాణి పాదాలు తాకి తన ఊరు కటిలీవైపు వెళ్ళిపోయాడు. రాణి దళం ముందుకు సాగింది.

తెల్లవారురూముకి రాణి భాండేరీ కిందినుంచి ప్రవహించే పహూన్ నదీ తీరానికి చేరింది. కాళ్లు చేతులు కడుక్కుంటూండగానే బోకర్‌దళంవచ్చి ముట్టడించింది. రాణి వెంటనే ఎదుర్కొన్నది. బోకర్ సైనికులు చాలా మంది చచ్చిపోయారు. అతనుకూడా గాయపడి ఝాన్సీకి తిరిగి వెళ్ళిపోయాడు. రాణి గుఱ్ఱం గాయపడింది. ఆమెకి ఓ గ్రామంలో మంచి గుఱ్ఱం దొరికింది. దాదాపు అర్ధరాత్రికి కలాపీ వెళ్ళింది. అక్కడ తాంత్యా

తోపే, నానా సాహెబ్ తమ్ముడు రావ్ సాహెబు ఉన్నారు. ఉత్సాహంతో రాణికి స్వాగతం ఇచ్చారు.

ఝాన్సీలో చాలా రోజులవరకు యుద్ధం జరుగుతూనే ఉంది. దాదాపు మూడువేలమంది చనిపోయారు. అయినా ఝాన్సీవాసులు ఆంగ్లేయుల ఎదుట తలవంచలేదు. జనరల్ రోజ్ తన మంత్రి మేజర్ పిక్ తో గవర్నరు జనరల్ కి ఓ ఉత్తరం రాయించారు. దానిలో 'ఝాన్సీలో సివిల్ రూల్ చెయ్యటం కష్టంగా ఉంది కనుక సైన్యపాలన ఉండాలి' అని ఉంది.

## 26

రాణి కలాపీ వెళ్ళిన మర్నాటినుంచి పీష్వా సేనని ఆయత్తం చేసింది. ప్రణాళికానుసారం కొన్నిపనులు చకచకా సాగిపోయాయి. కొన్నిపనులు పీష్వా ఆధ్వర్యంలో అలాగే వున్నాయి. సేన సరిగా తయారు కాకపోవటం చూసి రాణి చాలా బాధపడింది. రావ్ సాహెబ్, ఆయన సేనలోని చాలా భాగం మన్నుతిన్న పాములల్లే స్తబ్ధుగా ఉన్నారు. అదను చూసి దొంగలు, బందిపోట్లు వీళ్ల సేనలో వచ్చిచేరారు. రాణి అధీనంలో ఒక్క దళం మాత్రమే ఉన్నది. ఆమె వారినే పటిష్ఠంగా తయారుచేసింది. ఈ దళంపేరు 'ఎరుపు చొక్కా' రోజ్ కలాపీవైపు బయలుదేరాడు. దోవలో కోంచ్ అనే చోట పీష్వాదళంతో యుద్ధం జరిగింది. ఈ దళం ఓడిపోయింది. రోజ్ కలాపీమీదకి వచ్చిపడ్డాడు.

రాణి 'ఎర్ర చొక్కా' దళం బాగా యుద్ధం చేసింది, కాని మిగతసేనకు శిక్షణ లేకపోవటం మూలాన ఆంగ్లసేన గెలిచింది. గెలిచినప్పటికీ ఆంగ్లేయులు రాణిద్వారా శిక్షణ ఇవ్వబడిన సైనికులు ఎదుర్కొన్నప్పుడల్లా వెనుకంజ వేశారు. రాణి ఇంకో గొప్పపని చేసింది. రావ్ సాహెబ్ మొదలైన క్రాంతికారులపేర్లు రణభూమినుంచి తన పదాతిదళంద్వారా రక్షించింది. జనరల్ రోజ్, లార్డ్ కన్నింగ్, గవర్నర్ జనరల్‌కి రాసిన ఉత్తరంలో అన్నివిషయాలతోపాటు ఇలా రాశాడు.

'రాణి వాళ్లందరిలో సర్వశ్రేష్ఠుడయిన పురుషుడు.'

కలాపీలో దోపిడీలు ప్రారంభమయ్యాయి. ఆంగ్ల సేనతోపాటు రావ్ సాహెబు 'సైనిక బందిపోట్లు'కూడా పాల్గొన్నారు.

రాణి, రావ్‌సాహెబుల సేన రోజంతా వడకొడుతున్నా లక్ష్యపెట్టక వేగంగా గోపాల్‌పురం అనే వూరి తోటలో ఆగారు. సైనికులు కొద్దిమందే

ఉన్నారు. అంతా సర్దారులే. బాందా నవాబు, తాంత్యా తోపే మొదలయిన వాళ్లు ఉన్నారు.

సమావేశం జరిగింది. ఇప్పుడేం చెయ్యాలి అన్నది ఆలోచిస్తున్నారు.

బాందా నవాబు నిట్టూరుస్తూ 'ఇప్పుడు మనం పంజరంలో చిక్కి పోయాం' అన్నాడు.

రాణి అతన్ని ప్రోత్సహిస్తూ 'విప్లవకారులంతా కలిసి పోరాడేచోట కోట లుండనే ఉన్నాయి. ఏదైనా ఒక పటిష్ఠమయిన కోటని వశపర్చు కోవాలి' అంది.

కాసేపు మంచికోట లెక్కడున్నాయి అనే దానిమీద చర్చ జరిగింది. ఆఖరికి రాణి నిశ్చయపూర్వకంగా గ్వాలియర్‌కోట పెద్దది, గట్టిదేను. రాజా మైనర్. అక్కడ మంత్రి, కొద్దిమంది నాయకులుమాత్రమే ఆంగ్లేయ పక్ష పాతులు. అక్కడి ప్రజలు, సేన మనకి సహాయం చేస్తారు. తాంత్యా అక్కడికి వెళ్లివచ్చారు. అంతా తెలుసు.

కాసేపాగాక గ్వాలియర్‌కి పోవడానికి నిశ్చయించుకున్నారు. తాంత్యా తోపేని ప్రణాళికను రూపొందించడానికి, సాధనాలు వశపర్చుకోడానికి ముందు పంపారు. గ్వాలియర్ ఆంగ్లసేనలోవున్న భారతీయుల్లో విద్రోహ భావం ఏర్పడింది. అందుకని తాంత్యా వెళ్ళినపని తేలికగా అయిపోయింది.

తాంత్యా వచ్చినతర్వాత రావ్ సాహెబ్ సేన గ్వాలియర్ చేరుకుంది. గ్వాలియర్ రాజా చిన్న సేన దివాన్ కోరికమీదట వాళ్లతో పోరాడింది, కాని ఓడిపోయింది. రాజా దివాన్ ఆంగ్లేయులదగ్గరికి ఆగ్రా వెళ్ళిపోయాడు. రావ్ సాహెబ్ జూన్‌నెలలో 3-వ తారీకున పెద్ద దర్బారు ఏర్పాటుచేశాడు. అక్కడి పీష్వాని పట్టాభిషిక్తుణ్ణి గావించి ఉత్సవాలు చేసుకున్నారు. లడ్డు, మిఠాయి, శ్రీఖండ్ మొదలయిన మిఠాయిలు వర్షంకన్న ఎక్కువగా కురిశాయి. పంచదార దొరకటం కష్టమై పోయింది.

ఈ సంతోషపు తుఫానులో రాణి, ఆమె సర్దారులుమాత్రమే పాల్గొన లేదు. వీళ్ళల్లో ముందర్, జోహీకూడా ఉన్నారు. జోహీ రాణీని కలాపీలో కలిసింది.

గ్వాలియర్ సంగీతంలో వన్నెకెక్కింది. వాన్ని రావ్ సాహెబ్, అతని అనుచరులు ఆదరించారు. నృత్యగానాదులతో కాలం గడుపుతున్నారు. రాణి ఎప్పుడూ ఈ ఉత్సవాల్లో పాల్గొనలేదు. రాణి అక్కడున్న పర్వతాలని, ఆ చుట్టుపక్క మైదానాలని సూక్ష్మంగా పరిశీలిస్తున్నది. ఏదో ఒకరోజున ఆంగ్ల సేనని ఎదుర్కొనాల్సి వస్తుందని ఆమెకు తెలుసు.

ఈ పరిశీలనా ప్రయాణంలో రాణీకి బాబా గంగాదాస్‌ను గురించి తెలిసింది. ఈయన కుటీరం సోన్ రేఖా కాలవ కావలిపక్క, కోటకి దక్షిణపు భాగం చివర తూర్పుపక్కగా ఉంది. బాబా గంగాదాస్ కుటీరం రెల్లు గడ్డితో, కట్టలతోను తయారుచేయబడింది. రాణి తిరుగుతూ తిరుగుతూ ఆ కుటీరందగ్గరికి వచ్చింది. అప్పుడామె చాలా దప్పికగొని ఉన్నది. బాబా మంచినీళ్ళిచ్చారు. బాబాకళ్ళల్లో శాంతి, కాంతి కలిగిన అద్భుతమైన ఆకర్షణ ఉంది. రాణి యుద్ధపుపటాన్ని గియ్యటంలోను, సైన్యాన్ని కవాతు చేయించటంలోను, మిగిలిన సమయాన్ని పూజా పునస్కారాలలోను గడిపేది. కాని రావ్ సాహెబ్ ఆయన సైనికులు రాసవిలాసాలలో మునిగి తేలుతుండేవారు. దాంతో రాణి వికలమనస్కురాలైంది. ఆ సమయంలో ముందర్ వారివెంట ఉన్నది. కుశలప్రశ్న లయ్యాక రాణి వినయంగా బాబాని 'నేను మిమ్మల్ని కొన్నిప్రశ్న లడగాలనుకొంటున్నాను. నా మనస్సెందుకో అశాంతిగా ఉంది. మీ సమాధానంతో ఉపశమనం కలుగుతుందనే ఆశగా ఉంది' అనడిగింది.

బాబా:-నేను రామభజనతప్ప ఏమీ ఎరగను.

రాణి:-కాదు స్వామీ. చెప్పకుండా దాచెయ్యకండి.

బాబా:-అడుగు అమ్మా! తెలిసినంతవరకు చెప్తాను.

రాణి:-ఈ దేశానికి స్వరాజ్య మెప్పుడు వస్తుంది?

బాబా:-ఎలా ప్రాప్తమవుతూ వచ్చిందో అలాగే జరుగుతుంది.

రాణి:-ఎలా బాబాజీ?

బాబా:-సేవ, తపస్సు, బలిదానంవల్ల.

రాణి:-మేము స్వరాజ్యాన్ని ఎలా స్థాపించాలి?

బాబా:-గోతులెలా నిండుతాయి, పునాదులెలా పూర్తి అవుతాయి? ఒక రాయి మీద ఇంకోరాయి. అలాగే! ఇదేప్రకారంగా అన్నీ. అప్పుడు దాని మీద భవనం కడుతారు. పునాది రాళ్లు భవనాన్ని చూడలేవు. కాని భవనం వాటి బలంమీదే ఆధారపడి ఉంటుంది! ఒక్కరోజులో ఇవన్నీ జరగాలంటే జరగవు. నిరంతర ప్రయత్నం, బలిదానం చాలా అవుసరం.

రాణి:-మేము బ్రతికుండగా స్వరాజ్యం వస్తుందంటారా?

బాబా:-ఆ మోహమెందుకు? ఆరంభింపబడిన పనిని నువ్వు ముందుకు నడిపావు. ఇంకా కొంతమందివచ్చి దీన్ని ఇంకా ముందుకు నడుపుతారు. ఇంకా మనలో లోపం ఉంది. అంటే స్వరాజ్యస్థాపన చెయ్యాలనుకున్న ఆదర్శవాదులు చిన్నచిన్న రాజ్యాలు తయారుచేసు కూర్చుంటారు. ప్రజలకి, వారికి మధ్య ఉన్న అగాధం పూడదు. ప్రజలు రాజుకి సహాయం చేసినప్పుడు, రాజుల విలాసత్వం విడనాడి ప్రజాసేవకులైనప్పుడు— స్వరాజ్యపు పునాది పూర్తవుతుందన్నమాట. అప్పుడు భవన నిర్మాణం మొదలవుతుంది. శాశ్వతంగా నిలవాల్సిన ధర్మరూపమే సమసిపోయింది. అది ఉద్ధరింపబడితే కాని భవననిర్మాణం సక్రమంగా జరగదు.

రాణి నమస్కరించి ముందర్‌తో వెళ్లిపోయింది. నివాసస్థలానికి వచ్చి, నిత్యకృత్యాలను తీర్చుకున్నది. ఇంతలోనే రోజ్ సేనతోకూడా దండెత్తి, గ్వాలియర్ చుట్టుపక్కలంతా సేనని ఉంచాడని సమాచారం అందింది.

గ్వాలియర్ ఆగ్రామార్గంలో ఒక దళాన్ని, ఇంకోదళాన్ని గ్వాలియర్ తూర్పువైపున 6 మైళ్ల దూరాన సరాయ్ అనేచోటున ఉంచారు. రావ్ సాహెబ్ పట్టాభిషిక్తుడైన మూడురోజుల తర్వాతనుంచి రోజ్ యుద్ధపు ఏర్పాట్లు చేస్తూనే వున్నాడు. గ్వాలియర్‌లో ఇంకా రావ్ సాహెబ్ ఉత్సవాలు జరుగుతూనే ఉన్నాయి.

గ్వాలియర్ రాజ్యపు సైనికులు చాలామంది రావ్ సాహెబ్‌తో వచ్చి కలిశారు. రోజ్ రాజనీతిని ఉపయోగించి ఆగ్రానుంచి దివాన్ దినకరరావుని, మైనర్ రాజాతో సహా పంపించాడు. దివాన్ సైనికుల్లో చాలామందిని మాయజుచ్చి రోజ్‌వైపుకు తిప్పాడు. రావ్ సాహెబ్ సేన సన్నగిల్లింది. ఇంత అయినా రాణి నిరుత్సాహపడలేదు. రావ్ సాహెబ్ గ్వాలియర్ వచ్చినతర్వాత రాణి, ఈ ఉత్సవాలు, వేడుకలు, విలాసాలు మానమని ఆయనకు నచ్చచెప్పింది. కాని ఆయన వినలేదు. ఆంగ్లేయులు దండెత్తి వచ్చినతర్వాత కాని ఆయనకి తెలిసిరాలేదు.

రాణిదగ్గరికి తాంత్యాని పంపి రాణిని నాయకత్వం వహించటానికి సిద్ధంగా ఉండమని కబురుచేశాడు. రాణి, రావ్ సాహెబు భోగలాలసతమ చూసి అసహ్యించుకుంది. తాంత్యా వినయంగా 'ఇప్పుడు క్షమించమని అడిగే వ్యవధికూడా లేదు. పని వెంటనే జరగా'లని చెప్పాడు.

రాణి తాంత్యాకి విశ్వాసంతో భరోసా ఇచ్చింది. 'పీష్వాతో పట్టుదలగా పని చేయమని చెప్పు. నేను పథకం చెపుతాను. విజయం మనదే కావచ్చు ననే ఆశ వుంది. ఒకవేళ అలా జరగకపోతే మన మిగిలిన సేనని, సామా నుని దక్షిణవైపున్న పర్వతందగ్గరికి తీసుకువెళ్లే ఏర్పాటు చెయ్యాలి' అంది.

తాంత్యాకి తొందరగా తన పథకం చెప్పి 'దీనికి మీరు ఆచార్యులు' అని అన్నది రాణి.

తాంత్యా ఉత్సాహంగా వెళ్లాడు.

జూన్ 17 ప్రొద్దున రోజ్ సేనకి బ్రిగేడియర్ స్మిత్ యుద్ధపుగుర్తు ఊల వేశాడు. రాణి తయారుగా ఉంది. ఫిరంగిశాల జోహీ ఆధీనంలో ఉంది.

ఘోరమైనయుద్ధం జరిగింది. మొదటి ఆక్రమణలో తెల్లసేన రాణి 'ఎట్టి చౌక్కా' సేనముందు నిలవలేకపోయింది. బ్రిగేడియర్ స్మిత్ పదాతిదళాన్ని కూర్చాడు. రాణి సైనికుల ముందునుంచి తన సిపాయిలు ఓడటం చూశాడు. రాణిసైనికులు వారిమీద విరుచుకుపడ్డారు. స్మిత్ తన రెండుదళాల సైనికులను రెండుపక్కలా నిలబెట్టాడు. రావ్ సాహెబ్ సైనికులు యుద్ధం చేయలేకపోవటంతో రాణిసైనికులు చాలామంది చచ్చిపోయారు. తెల్లసేన 'ఫూల్‌బాగ్' అనే స్థానాన్ని ఆక్రమించుకోవాలనుకుంటున్నది. ఎందుకంటే దానిలో రాజభవనం ఉన్నది. రాణి రణచాతుర్యంవల్ల వాళ్ళఉద్దేశ్యం నెరవేరలేదు. రాణి తను తయారుచేయించిన యుద్ధరంగాల బాగోగులు చూస్తూ, అవసరమైనచోట బాగు చేయిస్తోంది. తన యోధులసంఖ్య తక్కువున్నప్పటికీ వారిపట్ల రాణికి అమితమయిన విశ్వాసం. ఆంగ్లేయులుకూడా చాలా శౌర్యంగా పోట్లాడారు కాని చాలామంది చచ్చిపోయారు. రాణి గుఱ్ఱపు కాలికి గాయమైంది. ఆంగ్లేయులు రేపటి పథకం తయారు చేసుకోవాలన్న తొందరలో యుద్ధాన్ని సాయంకాలమే ఆపేశారు.

రాణి, ఆమె సర్దార్లు నిరంతర పరిశ్రమ చేశారు. అయినా రాణి రాత్రి చాలాసేపటివరకు పథకాన్ని నవరించి, సలహా సంప్రతింపులుచేసి, యుద్ధంలో శౌర్యపరాక్రమాలు చూపించినవారికి బహుమతులిచ్చి, మేల్కొల్పింది. గుల్ మహ్మద్‌కి 'కువర్' (రాజకుమారుడు) బిరుదు ఇచ్చింది.

గ్వాలియర్ సేన చాలావరకు ఆంగ్లసేనతో కలియటానికి కారణం దివాన్ దినకరరావు. అయినా కొంతమంది సైనికులు రావ్ సాహెబ్‌కి జానటగా నిల్చారు. రాణి, రావ్ సాహెబ్‌ని, తాంత్యాని జాగ్రత్తగా ఉండమని హెచ్చరించింది. కాని తయారీ అయేందుకు వ్యవధిలేదు. రాణి వాళ్ళని ప్రోత్సహించింది. ఇక చేయగలిగిందిలేక రెండోరోజున యుద్ధరంగానికి వాళ్ల అందుబాటులోవున్న సాధనాన్ని తీసుకువెళ్లారు.

జూన్ 18 ఉదయం. సూర్యుడు తన బంగారు కిరణాలతో ఉదయించాడు. ఉషారాణి చిరునవ్వులు వెదజల్లుతూ ఆవిర్భవించింది. రాణి పూజా పునస్కారాల తర్వాత గీతలోని పద్దెనిమిదవ అధ్యాయం పూర్తిచేసింది. పక్షులు కలకలారవాలు చేస్తున్నాయి. రాణి రోజులాగే సేనానాయకుని దుస్తులు, ఎఱ్ఱచొక్కా వేసుకుని పురుషవేషం ధరించింది. రెండువైపులా రెండు కత్తులు, పిస్తోళ్లు ధరించింది. యుద్ధంలో తనని సిపాయిలు గుర్తించటానికి మెడలో ముత్యాలదండ వేసుకుంది. లోహపు టోపీమీద ఎఱ్ఱని చందేరీ జలతారు తలపాగా ధరించింది. ఆమె ఐదుగురు సర్దార్లు - ముందర్, జోహీ, రఘునాథ్‌సింహ్, గులామ్ మహమద్, రామచంద్ర దేశ్‌ముఖ్ - ఆమె వెంట ఉన్నారు.

ముందర్:- దేవీ! గుఱ్ఱం కుంటిదైపోయింది.

రాణి:- వెంటనే మంచి గుఱ్ఱాన్ని తీసుకురా:

ముందర్ గుఱ్ఱాన్ని తీసుకువచ్చింది. సింధియా ప్రభువు గుఱ్ఱపుశాలనుంచి బాగా బలమైన, కాంతివంతమైన గుఱ్ఱాన్ని తీసుకువచ్చింది.

రాణికి గుఱ్ఱాల నాణ్యం నిర్ణయించటంలో మంచి నైపుణ్యం ఉంది. ముందర్‌తో 'ఈ గుఱ్ఱం ఎదురుతిరగొచ్చు కాని దీనితోనే పనిగడుపుకోవాలి' అని సర్దారులకి అగర్తలగురించి చెపుతూ 'పశ్చిమోత్తరాల యుద్ధరంగాలు అనుభవంగల నాయకుల అధీనంలో ఉన్నాయి. కాని సైనికుల విషయంలో ఏసంగతీ నిశ్చయంగా చెప్పలేము. ఒకవేళ ఈ రంగాలవల్ల పని జరక్కపోతే దక్షిణవైపునుంచి వెళ్లిపోవడానికి పూర్తి ప్రయత్నాలు చేసుకోవలసి ఉంటుంది' అన్నది. ముందర్ రాణిని మంచినీళ్లు తాగమని

ప్రార్థించింది. అంత ప్రొద్దున్నేకూడా ఎండ కాస్త ఎక్కువగానే ఉంది. రోజంతా కొట్టేవడని సహించాలిమరి!

రాణి షర్బత్ మాత్రమే తాగుతానన్నది. మిగినవాళ్లు కాస్త ఎంగిలి పడ్డారు. రాణికోసం ముందర్ షర్బత్ తయారుచేసింది. జోహీ, ముందర్ కూడా రాణితోపాటు కాస్త షర్బత్ తాగారు.

శత్రువులు యుద్ధపు నగారా మోగించడం దూరంనుంచి వినిపించింది. ఫిరంగి పేల్చిన చప్పుడుకూడా వినిపించింది. అంతకుముందే ఫిరంగిగుండు ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ పైనుంచి ఎగిరివచ్చి కోటకి తగిలింది.

రోజ్ సేనానాయకుడు కొండమీదినుంచి దుర్భిణితో చూశాడు. తర్వాత తన డైరీలో 'రాణి తన అక్కాచెల్లెళ్లతో కలిపి షర్బత్ తాగటానికి ఉద్యుక్తురాలౌతుంది' అని రాశాడు. వాళ్లు జోహీ, ముందర్‌లు. ఆమెకు అక్క చెల్లెళ్లు లేరు.

రాణి రామచంద్ర దేశ్‌ముఖ్‌ని 'దామోదరరావును రక్షించేభారం మీదే! వాడిని ఇవాళ మీ వీపున కట్టుకొండి. ఒకవేళ నేను చచ్చిపోతే మీరు ఎలాగైనా వాడిని దక్షిణానికి చేర్పించాలి. మీరు ఇవాళ నన్నుగురించి కాక మీ గురించి చాలా జాగ్రత్తగా ఉండాలి. రెండోవిషయం. నేను చనిపోతే నా శవాన్ని విదేశీయులెవరూ తాకటానికి వీల్లేదు. అంతే! ఇంక గుఱ్ఱాన్ని తీసుకురండి' అని ఆజ్ఞాపించింది

ముందర్ గుఱ్ఱాన్ని తీసుకువచ్చింది. ఆమె కళ్లనిండా నీళ్లు నిండుకుని వర్షించే మేఘంలా ఉన్నాయి. తూర్పున సూర్యుని ప్రతిబింబపు ఎఱ్ఱని కాంతి వ్యాపించింది. ఈసారి ఫిరంగుల చప్పుడు ఒక్క ఉదుటున విన్పించాయి.

'ఇవి తాంత్యా శత్రువులకి సమాధానంగా కాలుస్తున్న ఫిరంగుల చప్పుడు' అంది రాణి.

జోహీ తలమీద చెయ్యేసి నిమురుతూ 'వెళ్ళు నీ రంగంమీదికి. వెళ్ళి శత్రువులని ముప్పుతిప్పలు పెట్టు.'

జోహీ వీపుమీద నీళ్ళపాత్రనుకూడా కట్టుకొని రాణికి నమస్కరించి 'నా మహారాణి పేరు నిలబెడతాను. జయం మనదే!' అంటూ వెళ్ళింది.

అందరూ ఎవరి వీపుమీద వాళ్ళు నీళ్ళపాత్ర ఉంచుకుని వెళ్లారు. రఘునాథసింహ్ ముందర్‌ని కలుసుకుని 'మహారాణిని ఒక్కక్షణం ఒదిలిపెట్టి ఉండకు. ఆమె ఈ రోజు ఆఖరుసారిగా యుద్ధం చెయ్యటానికి వెడుతున్నారు....

'మీరు ఎక్కడుంటారు.'

'వారి ఆజ్ఞానుసారం. కాని మీ అందరికి దగ్గరగా ఉండటానికే ప్రయత్నిస్తాను.'

ఆంగ్లేయుల ఫిరంగి గుళ్ళు వర్షంకురిపినట్లు కురుస్తున్నాయి. జోహీ నడిపే ఫిరంగిశాల కాసేపటికి నిప్పంటుకుంది. రెండోపక్క తాంత్యా ఉన్నాడు. సూర్యుడు ఉదయించాడు.

సూర్యకిరణాల తాకిడికి రాణి మొహం మెరుస్తోంది. కంళ్ళు జ్యోతులల్లె ప్రకాశిస్తున్నాయి. ఎఱ్ఱచొక్కామీద తెల్లని ముత్యాలమాల తళుకులీనుతున్నది. ఒరనుంచి కత్తితీసింది. రాణి ఆంగ్లేయులతో తలపడటానికి తూర్పు పక్కకి వెళ్ళింది.

క్రితంరోజు దెబ్బతిని ఉండటంవలన ఆంగ్లేయులు తగు జాగ్రత్తలో ఉన్నారు. వీళ్ళు తమ పదాతిదళాన్ని తూర్పు దక్షిణ వైపులనుంచి, మిగతా అన్ని పక్కలనుంచి ఆక్రమణకోసం పంపారు. ఫిరంగులు ఎలాగూ వారి వెన్నంటి కాపాడుతూనే ఉన్నాయి. రెండు పక్కలనుంచి ఆశ్వికు లుపయోగించే చిన్న తుపాకులు పేలుతూనే ఉన్నాయి. రాణి దెబ్బలమీద దెబ్బతీస్తూ

వాళ్ళని ఓడిస్తోంది. రాణి రణకౌశలానికి ఆంగ్లనాయకులు కంపిస్తున్నారు. ఎంతసేపయినా ఆంగ్లేయులకు పీష్వా రంగాన్ని దాటేందుకు అవకాశం లభించలేదు.

కాసేపయింతర్వాత రావ్ సాహెబ్ రెండు రంగాల్లోకి ఆంగ్లేయులు ప్రవేశించారని వినింది రాణి. వింటూనే రాణి జోహీరంగాన్ని రక్షించే ఏర్పాటు చేసింది. ఈలోపల బ్రిగేడియర్ స్మిత్ దాచివుంచిన పదాతిదళాన్ని ముందుకు సాగమని పీష్వా పదాతిదళం మీదికి వదిలాడు. రాణి నెమ్మది నెమ్మదిగా పశ్చిమ, దక్షిణవైపుల ఉన్న తన రంగాలదగ్గర మిగిలిన సేనని కలవడానికి వెళ్ళాలని అటుపక్కకి తిరిగింది. కాని మధ్యలోనే తెల్లసేనని ఎదుర్కోవాల్సి వచ్చింది. రాణి గుఱ్ఱపు కళ్ళాన్ని నోట్లో బిగించి రెండు చేతులతోను కత్తులు దూసి తన మార్గాన్ని నిష్కంటకం చేసుకుంటోంది. దక్షిణ, పశ్చిమాలవైపు సోన్‌రేఖా అనే చిన్నకాలువ వుంది. దానికి కాస్త ముందుగా వెడితే బాబా గంగాదాసు కుటీరం, కుటీరానికి వెనక పశ్చిమ దక్షిణాలవైపు తొలగిపోతున్న పీష్వా పదాతిదళం.

ముందర్ రాణి వెనకే ఉంది. ఇరుపక్కలా రఘునాథసింహ్, రామచంద్ర దేశ్‌ముఖ్ ఉన్నారు. ఇంకా వెనక గులామ్ మహమ్మద్ మిగిలిన 20, 25 మంది సైనికులు వస్తున్నారు. కాసేపట్లోనే ఆంగ్లసేన వీళ్ళని నాలుగు పక్కలనించి చుట్టు ముట్టింది. రాణి రెండుకత్తులు దూసుకుంటూ దోవ చేసుకుంటూ పోతున్నాయి. వెనకవచ్చే సైనికులసంఖ్య తగ్గిపోయి చివరకు ఎవరూ మిగలకుండా పోయారు. అదేసమయంలో తాంత్యా, ష్తైలీ, అవధే సైనికుల సహాయంతో ఆంగ్లేయులమీదికి ఉరికాడు. తాంత్యా ఎంతటి కష్టమైన వ్యూహంలోంచైనా ఇవతలకి రాగల నేర్పుగలవాడు. అలాగే వచ్చేశాడు. అతనివెనకే రావ్ సాహేబ్.

సూర్యుడు అస్తమించే వేళయింది.

ఎట్టిచొక్కా దళంలోని ఆఖరి సైనికుడుకూడా చచ్చిపోయాడు. 10, 15 మంది తెల్లవాళ్లు కాలినడకన రాణిని అనుసరించారు. రాణి వెనుతిరిగి చూసింది. రఘునాథసింహ్, గుల్ మహమ్మద్ వాళ్లని చంపుతున్నారు. ఇంకోపక్క రామచంద్రరావు దేశ్ముఖ్ దామోదరరావుని రక్షించటానికి చిన్న తుపాకీతో పోట్లాడుతున్నాడు. రాణి, దేశ్ముఖ్కి సహాయం చెయ్యమని రఘునాథసింహ్కి సంజ్ఞ చేసింది. ముందర్ పోరాడుతూ చచ్చిపోయింది. అతను పోరాడుతూ కొంతమందిని చంపేశాడు. ఇంతలో రాణి గుండెకింద ఒక తెల్లసైనికుడి తుపాకీ చివర కొన తేలి ఉండే కత్తివచ్చి గుచ్చుకుంది. అయినా రాణి వెంటనే వాడిని చంపేసింది. రాణి పొట్టలోంచి బాగా రక్తం ప్రవహించింది. ఆమె మనస్సులో 'స్వరాజ్యపు పునాది రాయిగా మారబోతున్నాను' అనుకుంది. వెంటనే రఘునాథసింహ్తో 'నా మృతదేహాన్ని తెల్లవాళ్లు ముట్టుకోటానికి వీల్లేదు' అనిచెప్పి ముందుకు సాగి, ముందర్ శవాన్ని జాగ్రత్తగా చూడమని చెప్పింది. రఘునాథసింహ్ వెంటనే కిందికిదూకి తలపాగా చించి ముందర్ శవాన్ని వీపుకు కట్టుకున్నాడు. రాణి ఒక్కొక్క తెల్ల సైనికుణ్ణి తన కత్తితో అంతం చేసింది. మిగిలినవాళ్లు అటూ, ఇటూ చెదరిపోయారు. అందుకని రఘునాథసింహ్కి సమయం చిక్కింది.

ఇప్పుడు 5 గురు తెల్లవాళ్లుమాత్రమే తరుముకొస్తున్నారు. గుల్మహమ్మద్ రాణి దగ్గరికి వచ్చేశాడు. ఆమె సోన్రేఖా కాలవ దగ్గరికొచ్చి దాటే వేళకి గుఱ్ఱం మొరాయించింది. ఆంగ్లేయులు దగ్గరికి వచ్చేశారు. తెల్లవాడొకడు పిస్టల్ పేల్చాడు. రాణి ఎడమతొడ విరిగిపోయింది. కత్తి విసిరేసి గుఱ్ఱపు కళ్ళాన్ని సరిచేసుకుంది. రెండోతొడతో ఆసనాన్ని సరిచేసుకూర్చుంది. ఇంకో తెల్లసైనికుణ్ణి చంపింది. ఇంతలో వెనకనుంచి ఇంకోడు వచ్చాడు. రాణి గుఱ్ఱం కాళ్లు రెండు ఎత్తేసరికి రాణి వెనక్కి జారిపోయింది.

ఒక తొడ పనిచెయ్యటం లేదు. పొట్టలోంచి రక్తం విపరీతంగా కారుతోంది. గుల్‌మహమ్మద్ ముందుకువచ్చి తెల్లవాడితో తలపడేలోపలే వాడు రాణిమీద కత్తి విసిరాడు. ఆమె తల కుడిపక్కభాగం ముక్కలైంది. కళ్లు బయటికి వచ్చేశాయి. అయినా చలించక వాడిమీద కత్తి దూసింది. దాంతో అతని భుజం విరిగింది. గుల్‌మహమ్మద్ వాడిని రెండు ముక్కలుగా నరికాడు. ఇంకా ఇద్దరు ముగ్గురు తెల్లవాళ్లు మిగిలారు. వాళ్ళు యుద్ధరంగం విడిచి పారిపోయారు. గుల్‌మహమ్మద్ వెనక్కితిరిగి చూసేసరికి రామచంద్ర దేశ్‌ముఖ్ గుఱ్ఱంమీంచి పడిపోతున్న రాణిని పట్టుకుంటున్నాడు. గుల్‌మహమ్మద్ ఎక్కెక్కి ఏడవటం మొదలెట్టాడు. రఘునాథసింహ్, దేశ్‌ముఖ్ రాణిని నెమ్మదిగా దింపి గుఱ్ఱాన్ని తన్నగానే అది వెళ్ళిపోయింది. వాళ్ళిద్దరూ కలిపి రాణిని బాబా గంగదాసు కుటీరందగ్గరికి తీసుకువచ్చారు. ఇంకా రాణి బ్రతికే వుంది.

విలపిస్తున్న గుల్‌మహమ్మద్‌కి రఘునాథసింహ్ 'కువర్‌సాబ్ ! రాణి మనకేమి చెప్పిందో గుర్తు చేసుకోండి. తెల్లవాళ్లు పడుతూ, చస్తూ ఇక్కడికి వస్తే ఈమె శరీరంసంగతి ఏమవుతుందో ఆలోచించండి' అన్నాడు.

గుల్‌మహమ్మద్ వెంటనే లేచాడు. గుప్పిళ్లు బిగించాడు. ఊసూరూ మంటున్న దామోదరరావుని ఓపక్క కూర్చోబెట్టి, దేశ్‌ముఖ్ రాణిని తన మెత్తమీద పడుకోబెట్టాడు. రఘునాథసింహ్ ముందర్‌ని తన మెత్తమీద పడుకోపెట్టి గుఱాల్ని కాసేపు చెట్లకి కట్టాడు.

బాబా గంగాదాసు 'సీత, సావిత్రి పుట్టిన దేశపుపుత్రిక ఈమె' అన్నారు.

రాణి నీళ్లకోసం నోరు తెరిచింది. బాబా వెంటనే గంగాజలం తీసుకువచ్చి రాణి గొంతుకలో పోయగానే ఆమెకి కాస్త తెలివి వచ్చింది. 'హర హర మహాదేవ' అంది. మళ్ళీ 'ఓం! వాసుదేవాయ నమః' అంది.

ఈ మాటలన్న తర్వాత ఆమెకి స్పృహ తప్పిపోయింది. మళ్లీ నెమ్మదిగా శిథిలమైన స్వరంతో....

ద....హ....తి....నై....నం....పా....వ....కః; ఆమె ముఖం ప్రకాశంతో వెలిగిపోయింది. సూర్యుడు అస్తమించాడు. ఎఱ్ఱని కాంతిపుంజం పశ్చిమపు నుదుటమీద మెరుస్తోంది. ఆ వెలుగుకిరణాలు గగనమంతా వ్యాపించాయి.

అంతా ఏడ్చారు.

బాబా, 'ప్రకాశం అనంతమైంది. చిన్నకణాన్నికూడా వెలిగిస్తుంది. మళ్ళీ ఉదయిస్తుంది. ప్రతికణంలోను వెల్లి విరుస్తుంది. రాణి చిరంజీవి.'

రాణి శవ దహనానికి ఏర్పాట్లు జరిగాయి. పక్కనే గడ్డి దట్టంగా ఉంది. ఇది చాలదని బాబా తన కుటీరపు కట్టెలు తీస్తానన్నాడు. కుటీరంలో ఉన్న సామాన్లు తీయమని దేశ్‌ముఖ్ ప్రార్థించాడు. బాబా లోపలినుంచి ఒక కంబళి, తుంబుర, లంగోటీ తెచ్చి 'ఇకేం లేవు త్వరగా కానీండి' అన్నాడు. కుటీరం కట్టెలన్నీ వారు ముగ్గురూ తీశారు. పని తొందరగా అయింది. రాణి హారంతీసి దామోదరరావుదగ్గర పెట్టారు. ఒక చిన్న ముత్యాలమాల మాత్రం ఉండనిచ్చారు. ఆమె కవచం అపీ ఉండనిచ్చి చితి పేర్చినమీదట రాణి లక్ష్మీబాయి, ముందర్ శవాల్ని దేశ్‌ముఖ్ చితిమీద ఉంచాడు. అగ్ని అంటించబడింది. వెంటనే చితి మండింది. కుటీరం దగ్గరంతా రక్తం ప్రవహించింది. దేశ్‌ముఖ్ దాన్ని తుడిచేశాడు. కాని చరిత్రలో ఆ రక్తం వ్రాసిందిమాత్రం అక్షయమూ, అమరమూ అయింది.

రాణి చితాభస్మాన్ని సైతం విదేశీయులు తాకకండా ఉండటానికి గుల్ మహమ్మద్ ఆ పొగవస్తున్న చితిమీద అరుగులాగా కట్టేశాడు. దేశ్‌ముఖ్ దామోదరరావుని వీపుకు కట్టుకొని వెళ్లిపోయాడు. రఘునాథసింహ్ చితిని

రక్షించడంకోసం తెల్లవార్లు కాపలాకాస్తూ అటూ ఇటూ తిరుగాడే శత్రువులమీద తుపాకీ పేలుస్తూ ఆఖరికి చనిపోయాడు.

ప్రొద్దున్నే ఆంగ్లేయ ఆఫీసరు, దొరికితే రాణికోసం, లేకపోతే శవం కోసం అక్కడికి, చితి దగ్గరికి వచ్చాడు. గుల్‌మహమ్మద్‌ని 'ఈ గోరీ ఎవరిద'ని అడిగాడు.

అతను శ్రద్ధగా, వినయంగా 'మా గురువుది, ఆయన మా బలశాలి' అన్నాడు.